
అపరాధ పరిశోధన
రు.4 | జనవరి '80
సప్లిమెంట్
RABHAKAR
73

అపరాధ పరిశోధన అనుబంధం—73

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## నీడచూసి బెదిరిపోకు

రచన : వసుంధర

## లాల్ అండ్ జాన్ కనిపించని కన్య

రచన: సికిందర్

## దురాశ దుఃఖానికి చేటు

రచన: వాణిశ్రీ

## కాలాంతకురాలు

రచన: వి. ఎస్. చెన్నూరి

## పొగమంచు

మొదటి భాగము—రచన: ముద్దా సురేష్

**అపరాధ పరిశోధన సప్లిమెంట్—73**
జనవరి, 1980
వెల: రు. 4-00
ఏడాది చందా 49 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**రమణశ్రీ**
**ఏ. వీ. మోహన్రావ్**
**సుజనశ్రీ**
**వసుంధర**
**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**క్రాంతి ప్రెస్,**
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# నీడ చూసి బెదిరిపోకు

## వసుంధర

గోపాలకృష్ణయ్య మరోసారి ఆ వుత్తరాన్ని చదువుకున్నాడు.

"రేపురాత్రి పన్నెండు గంటలకు నువ్వు చస్తావ్. అవసరమైన పనులన్నీ ఈలోగా ముగించుకో."

రెండే రెండు వాక్యాలు. సంతకం లేదు.

అది నీలిరంగు కాగితం. ఈ రోజు పోస్టులో వచ్చిన ఉత్తరం కాదది. ఎప్పుడో యెవరో తన జేబులో ఓ కవరు పెట్టారు. ఆ కవర్లో ఉన్నదీ ఉత్తరం.

ఎవరు ఈ ఉత్తరం రాసివుంటారు? దీన్ని తను సీరియస్‌గా తీసుకోవాలా, అక్కర్లేదా?

గోపాలకృష్ణయ్య ఈ విషయాలాలోచిస్తున్నప్పటికీ- ఆ ఉత్తరం అతనికి భయం కలిగించలేదన్నమాట మాత్రం నిజం. అలాగని గోపాలకృష్ణయ్య కిలాంటి ఉత్తరాలు అలవాటుకునేందుకు లేదు. జీవితంలో ఎన్నో యెదురుదెబ్బలు తిన్నాడు కానీ యిలాంటి ఉత్తరాన్నందుకోవడం

మాత్రం ఇదే మొదటిసారి.

గోపాలకృష్ణయ్య సామాన్యకుటుంబంలో పుట్టి కష్టాల్లో పెరిగి పద్దెనిమిదేళ్ళు వచ్చేసరికి బాగా చిక్కుల్లో పడిపోయాడు. కొండంత భారాన్ని కొడుక్కు వదిలి తండ్రి అర్ధాంతరంగా కన్నుమూశాడు. అప్పుడు గోపాల కృష్ణయ్య జీవితాన్నంతం చేసుకోవాలని కూడా అను కున్నాడు.

అటువంటి నిస్సహాయ పరిస్థితుల్లో అతను ఒక దొంగ తనం చేశాడు. తనను నమ్మిన ఒక మధ్యతరగతి గృహస్థు ఇంట్లో పథకం ప్రకారం నగలు దొంగిలించాడు. వాటిని రహస్యంగా అమ్మితే మూడువేలు వచ్చాయి. దాంతో చిన్నవ్యాపారం ప్రారంభించాడు.

వ్యాపారంలో కిటుకులన్నీ అతిత్వరలోనే తెలుసు కుని తొక్కవలసిన అడ్డదారులన్నీ తొక్కి, పాతికేళ్ళు వచ్చేసరికి లక్షాధికారి అయ్యాడు. ఊళ్ళో పేరుప్రతిష్ఠలు సంపాదించాడు.

అయన దొంగిలించిన నగలు రామాయమ్మ అనే స్త్రీవి. గోపాలకృష్ణయ్య దొంగిలించాక ఆమెకు ఆ సంగతి వెంటనే తెలియలేదు. తెలిశాక వెంటనే భర్తకు చెప్పింది. ఆ భర్త ముందు భార్యనే అనుమానించాడు. రహస్యంగా ఆమే వాటిని అమ్మేసి వుంటుందనుకున్నాడు. ఎందుకంటే ఆమె పుట్టింటివారు అప్పుడు డబ్బు అవసరంలో వుండి అల్లుడికి ఉత్తరం కూడా రాశారు. తన తలిదండ్రుల కెలాగో అలా సాయపడమని ఆమె భర్తను వేడుకుంది కూడా. భర్త నిరాకరించాడు. ఇంట్లో నగలు పోయాయి.

రామాయమ్మ అనుమానం గోపాలకృష్ణయ్య మీద

వుంది. అతను వాళ్ళింటికి తరచుగా వస్తూంటాడు. ఇంట్లో కూడా చనువుగా మసులుతూంటాడు. అతని చనువు కారణంగా రామాయమ్మ అతనితో అభిమానంగా కూడా మాట్లాడేది. ఒకసారి ఆమె నగలు దాస్తూండగా గోపాలకృష్ణయ్య చూశాడు. అందువల్ల అతనికి నగలు తీయడానికి మంచి అవకాశముంది. తమ యింట్లో నగలుపోయిన కొద్దిరోజులకే గోపాలకృష్ణయ్య వ్యాపారం కూడా ప్రారంభించాడు.

రామాయమ్మ తన అనుమానాన్ని భర్తకు చెప్పాలని కూడా చెప్పలేదు. గోపాలకృష్ణయ్య పెద్దనిమిదేళ్ళ వాడే అయినా మనిషి ఎత్తరువుగా వుంటాడు. రామాయమ్మకు పాతికేళ్ళకు పైబడినప్పటికీ గువ్వపిట్టలా చిన్నపిల్లలా వుంటుంది. రామాయమ్మ భర్తది బట్టతల. వయసాట్టే లేకపోయినా పెద్దవాడిలా వుంటాడు. వాళ్ళు ముగ్గురూ ఒకచోట వున్నప్పుడు గోపాలకృష్ణయ్య, రామాయమ్మ భార్యాభర్తల్లా వుంటారు. ఎప్పుడో యెవరో అలా పొరపాటుపడి ఆ జంటను మెచ్చుకోవడం కూడా జరిగింది. అప్పట్నించి రామాయమ్మ భర్తకు గోపాలకృష్ణయ్యంటే అసూయ, భార్య అంటే అనుమానమూ ఆరంభమయ్యాయి.

నగలు గదిలోకి వెళ్ళి దొంగలించేటంత చనువూ, అవకాశం గోపాలకృష్ణయ్యకున్నట్లు భర్తకు చెప్పడం ఆమెకిష్టంలేదు. అందుకు రెండే రెండు కారణాలు. ఒకటి ఈ విషయం తనకు స్పష్టంగా తెలీదు. రెండు భర్తకీ విషయమై అతని మీద అనుమానం కలగలేదు.

అయితే రామాయమ్మ తన అనుమానాన్ని గోపాలకృష్ణయ్య ముందే బయటపెట్టింది. అందుకని గోపాల

కృష్ణయ్య చాలా అవమానపడ్డట్లు నటించాడు. రామా యమ్మ నొచ్చుకుని మన్నించమని అడిగింది. గోపాల కృష్ణయ్య కూడా అప్పటికి తేలుకుట్టిన దొంగలా ఊరు కున్నాడు.

గోపాలకృష్ణయ్యకు రామాయమ్మ తనను అనుమానించి నందుకు కోపం వచ్చింది. తన పగను తీర్చుకునేందుకు అతను నిశ్చయించుకున్నాడు. అందుకని వ్యాపారంలో కాస్త నిలదొక్కుకోగానే వెయ్యిరూపాయలు ఖరీదు చేసే నెక్లస్ ఒకటి కొని రామాయమ్మ దగ్గరకు తీసుకువెళ్ళి "మేము కష్టాల్లో వున్నప్పుడు ఆశ్రయమిచ్చి బాగా ఆదుకున్నావు. నీ మేలు మరిచిపోలేను. నీ నగలు పోయి నప్పుడు నేనూ యెంతో బాధపడ్డాను. అయితే నువ్వు నన్ను అనుమానించావు. అందుకే ఆ నేరాన్ని నేను భరించి బాకీ తీర్చదల్చుకున్నాను. ఈ నెక్లస్ నీకు రహ స్యంగా యివ్వమంటావా, నీ భర్తకివ్వమంటావా-ఇది మీ కుటుంబానికి నా కానుక" అన్నాడు.

రామాయమ్మ నెక్లస్ చూసి చాలా సంతోషించింది. ఆమె అతడి శక్తిసామార్థ్యాలను మరోసారి మెచ్చుకుని, అతడినను మానించినందుకు బాగా నొచ్చుకుని-ఆ నెక్లస్‌ను తన భర్తకే ఇమ్మని చెప్పింది. అందువల్ల ఏ గొడవలూ ఉండవని ఆమె అనుకుంది.

గోపాలకృష్ణయ్య యిచ్చిన బహుమతిని రామాయమ్మ భర్త ఆనందంగా తీసుకున్నాడు. కానీ తర్వాత అతను భార్యను నానామాటలూ అన్నాడు "వాళ్ళకు మన కుటుంబం సాయపడింది. అందుకు కారణం నేనే. కానీ వాడు బహుమతి నాకు కాక నీకిచ్చాడు. అంటే నీకూ వాడికీ ఏదో వుండే వుండాలి."

"మీరిలా అనేమాటైతే ఆ నెక్లెస్ తిరిగిచ్చేయండి. అది నాకొద్దు" అంది రామాయమ్మ.

నెక్లెస్ తిరిగివ్వడానికి ఆమె భర్త అంగీకరించలేదు.

మరుసటినెల గోపాలకృష్ణయ్య ఇంకో బహుమతి ఇచ్చాడు. ఆ తర్వాత ఇంకొకటి. అయిదువందలనుంచి వెయ్యివరకూ ఖరీదుండే బహుమతులు అతను సుమారు ఆరేడువేలవరకూ ఖర్చుచేసి ఆ ఇంట ఇచ్చాడు. ఆ విధంగా ఆ ఇంటికీ తనకూ ఉన్న బాకీ వడ్డీతోసహా తీర్చినట్లయింది. అంతేకాదు-అది అనుకున్న ఫలితాలను కూడా సాధించింది.

రామాయమ్మ భర్తకు గోపాలకృష్ణయ్యనేమీ అనాలని ఉండేదికాదు. విలువైన ఆ బంగారం అతను సంతోషంగా తీసుకునేవాడు. రామాయమ్మ బ్రతుకు మాత్రం దుర్భరమైంది. భర్త సూటిపోటి మాటలు భరించలేక ఆమె గోపాలకృష్ణయ్యను వేడుకుందికూడా-ఈ కానుకలు ఆపమని!

అది తన బాధ్యత అన్నాడు గోపాలకృష్ణయ్య.

కానీ అది తనకు ప్రాణాంతకమెలాగయిందో వివరించింది రామాయమ్మ.

అందుకోసమే ఎదురుచూస్తున్నట్లు - "మీ ఆయన అనుమానం పుడకలతోగానీ పోదు. ఆయన్ను భరించలేకపోతే నా దగ్గరకొచ్చేయ్. పెళ్ళైనదాన్ని మళ్ళీ పెళ్లి చేసుకోవడం నాకు గౌరవంకాదు కాబట్టి నేను నిన్ను ఉంచుకుంటాను. మీ ఆయనకంటే బాగా చూసుకుంటాను" అన్నాడు గోపాలకృష్ణయ్య.

అవమానంతో, కోపంతో రామాయమ్మ ముఖం ఎర్రబడింది. "నిన్ను నేను స్వంత తమ్ముడిగా భావించాను.

అభిమానించాను. నీ వెధవ మగబుద్ధి పోనిచ్చుకున్నావు కాదు. ముగ్గురు పిల్లల తల్లిని, భర్తచాటున గౌరవంగా బ్రతుకుతున్నదాన్ని ఎంతమాటన్నావురా నువ్వు? నా చేతిలో కత్తివుంటే ఇప్పుడే నిన్ను పొడిచేసి ఉండేదాన్ని" అంది.

"స్వంత తమ్ముళ్ళను దొంగతనానికి అనుమానిస్తారా ఎవరైనా? నీ సంగతి నాకు తెలియదనుకోకు. ఆ బట్టతల మొగుడి దగ్గర నీకు సుఖముండదు. సుఖమైన జీవితం కావాలనుకుంటే నాతో వచ్చేయ్" అన్నాడు గోపాలకృష్ణయ్య.

రామాయమ్మ తుపుక్కున ఊసి వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది.

అప్పుడామె కళ్ళల్లో కనబడ్డ ఆవేశం, కసి, కోపం అన్నీ గోపాలకృష్ణయ్యకు గుర్తున్నాయి. ఆ తర్వాత మళ్ళీ వాళ్ళిద్దరూ కలుసుకోలేదు.

ఇప్పుడీ ఉత్తరం వైపు చూస్తూంటే రామాయమ్మ గుర్తొస్తోంది. ఆ అక్షరాలలోంచి రామాయమ్మ కళ్ళు కనబడుతున్నాయి. ఆ కళ్ళలో కసి, ఆవేశం, కోపం కనబడుతున్నాయి. నీలికాగితం మీద ఆ ఎర్రటి కళ్ళు వింతగా మెరుస్తున్నాయి.

"రామాయమ్మా—నువ్వు నన్ను చంపేటంతటి దానివౌతావా - ఇందుకు ఫలితం తప్పక అనుభవిస్తావ్. ఈ రోజునే" అనుకున్నాడు గోపాలకృష్ణయ్య.

## 2

"ఎవరూ?" అంది రామాయమ్మ.

"మీ ఆయనగారి చీటీ ఇచ్చారండి" అంటూ ఒకతను ఆమెకు ఓ చీటీ అందించి వెళ్ళిపోయాడు.

రామాయమ్మ ఆ చీటీని చదువుకుంది. ఎవరో గొప్ప బంధువు వచ్చి హోటల్లో మకాం చేశాట్ట. ఆయన తన తోటీ భర్తతోటీ ఏవో ముఖ్య విశేషాలు మాట్లాడాలిట. ఒక్కత్తినీ బయల్దేరి వెంటనే రమ్మనమని హోటల్ గది నెంబరు ఇచ్చాడు.

పెద్దపిల్లలిద్దరూ స్కూలుకు వెళ్ళారు. మూడోది ఆడపిల్ల. దానికి మూడేళ్ళు. పక్కింట్లో దానికి బాగా అలవాటు. పిల్లను వాళ్ళింట్లో యిచ్చి ఇంటికి తాళం వేసి హడావిడిగా బయల్దేరి వెళ్ళింది రామాయమ్మ.

"హమ్మయ్య వచ్చావా?" అన్నాడు గోపాలకృష్ణయ్య గదిలోకి ఆమెను ఆహ్వానిస్తూ.

"నువ్వా?" అంది రామాయమ్మ ఒక్కడుగు వెనక్కు వేస్తూ.

"భయపడకు. నేను నిన్ను పిలిచిన కారణం వేరు. నీ అందాన్ని చూసి మోహించి పిలిపించాననుకోకు. ముగ్గురు పిల్లల తల్లివి, నన్ను దొంగ అన్నదానివి - నువ్వు నా కెందుకు? వచ్చి అలా కూర్చో. నీ జీవితానికి సంబంధించిన ముఖ్య విశేషం మాట్లాడాలి. వినకుండా వెడితే నువ్వే విచారిస్తావు."

రామాయమ్మ ధైర్యం చేసి గదిలోకి వెళ్ళి సోఫాలో కూర్చొని "చెప్పు" అంది.

గోపాలకృష్ణయ్య తన జేబులోంచి ఓ నీలిరంగు కాగితం తీసి ఆమె ముందు పెట్టి "ఇదేమిటో చెప్పు. తెలియదని బుకాయించకు" అన్నాడు.

రామాయమ్మ అది చదివి "ఏమిటిది?" అంది. ఆమెకు అర్థం కాలేదు.

"నీకు తెలుసు" అన్నాడు గోపాలకృష్ణయ్య.

రామాయమ్మ మరోసారి ఆ చీటీ చదివింది. అందులో రెండే రెండు వాక్యాలున్నాయి "రేపు రాత్రి పన్నెండు గంటలకు నువ్వు చస్తావ్. అవసరమైన పనులన్నీ ఈలోగా ముగించుకో"—

"నీకు నన్ను చంపాల్సిన అవసరమేమొచ్చింది? ఇలా ఎందుకు బెదిరిస్తున్నావ్? నేను నీకు చేసిన అన్యాయమేమిటి?" అంది రామాయమ్మ.

"నేను నిన్ను చంపుతానన్నానా?" అన్నాడు గోపాలకృష్ణయ్య ఆశ్చర్యంగా.

"ఈ చీటీలో రాసి ఉన్నదదే కదా?" అంది రామాయమ్మ.

"ఆ చీటీ వచ్చింది నీక్కాదు. నాకు...." అన్నాడు గోపాలకృష్ణయ్య.

"ఆఁ" అంది రామాయమ్మ తేలిగ్గా నిట్టూర్చి—"ఆ మహానుభావుడెవరోగానీ త్వరగా ఆ పని కానిస్తే బాగుండును. నేను బ్రతుకుతాను" అంది.

గోపాలకృష్ణయ్య గుర్రుగా ఆమెవంక చూసి "ఆ ఉత్తరం నువ్వే రాశావని నా అనుమానం" అన్నాడు.

"నేనా?" అని పకపకా నవ్వింది రామాయమ్మ. "హత్య చేసే శక్తి నాకుంటే నువ్వింత కాలం బ్రతికే వాడివే కాదు. అది నీ అదృష్టం."

గోపాలకృష్ణయ్యకు నమ్మకం కుదరలేదు "ఈ ఉత్తరం నువ్వు తప్ప యింకెవరూ రాసివుండరు. హత్యలు చేసే దమ్ములు నీకు లేవని నాకు తెలుసు. కానీ నాకు మన సిమితం లేకుండా చేయడానికీ పని చేశావ్."

"ఈ ఉత్తరం నేను రాయలేదు. నీ సమయం వృథా చేసుకోకు. ఎవరో నీ వ్యాపారానికి సంబంధించిన బల

మైన ఈ శత్రువు ఉత్తరాన్ని రాసివుంటాడు. వాడు నిన్ను నిజంగా చంపేయొచ్చు. తొందరగా ఏ పోలీసులకో చెప్పకో. ఆ దస్తూరీ నాదికాదు. అలాంటి కాగితాలు కూడా నాకు దొరకవు" అంది రామాయమ్మ.

గోపాలకృష్ణయ్య ముఖంలో కలవరపాటు కనబడింది. "నిజంగా నువ్వు ఉత్తరం రాయలేదా?" అన్నాడు గాభరాగా. రామాయమ్మ రాయకపోతే ఆ ఉత్తరం ఇంకెవరు రాసివుంటారన్న ఆలోచన అతన్ని భయపెడుతోంది.

"నేను రాయలేను. నాకు నిన్ను చూస్తే జాలిగా వుంది. ఈ ఉత్తరాన్ని పోలీసులకు చూపించి నీ ప్రాణాలు రక్షించుకో. ఇలాంటి ఉత్తరాల నశ్రద్ధ చేయకూడదు. అలాచేస్తే ప్రాణాలు నిజంగా పోవచ్చు" అంది రామాయమ్మ.

ఇంతలో గదిలో ఫోన్ మ్రోగింది. గోపాలకృష్ణయ్య అందుకుని సందేశాన్నందుకుని మళ్ళీ ఫోన్ పెట్టేసి "సరేలే-నువ్వెళ్ళు. ఈ ఉత్తరం యెవరు రాశారో యిలాగూ తెలుసుకోలేకపోను. నువ్వు అయితే మాత్రం బాగా అనుభవిస్తావ్" అన్నాడు.

రామాయమ్మ లేచింది. గోపాలకృష్ణయ్య గుమ్మంలోంచి బయటకు వచ్చి ఆమెను సాగనంపాడు. దూరంగా వస్తున్న రామాయమ్మ భర్త తామిద్దర్నీ చూడడం గమనించి తృప్తిగా తలాడించుకుని గదిలోకెళ్ళి తలుపులు వేసుకున్నాడు.

రామాయమ్మ భర్తను చూడలేదు. ఆమె ఏదో ఆలోచిస్తూ నాలుగడుగులు ముందుకువేసి భర్త పిలుపువిని ఉలిక్కిపడింది.

"ఆ గదిలో వున్నది గోపాలకృష్ణయ్యేనా?" అనడిగాడు భర్త.

"అవును" అంది రామాయమ్మ.

"ఎంతకు తెగించావ్?" అన్నాడు రామాయమ్మ భర్త.

భర్త మాటలకు అర్థం తెలియగా రామాయమ్మ పూర్తిగా ఈ లోకంలోకి వచ్చి "మీరెక్కడికెలా వచ్చారు?" అంది ఆశ్చర్యంగా.

"నువ్వేసే వేషవ్యేషాలు తెలుసుకుందుకు నేను నిన్న లక్షకళ్ళతో కనిపెడుతున్నాను" అన్నాడామె భర్త.

రామాయమ్మ మౌనంగా భర్తకు తన చేతిలోని చీటీ అందజేసింది. అది తన భర్త పేరుతో ఇందాకా వచ్చిన చీటీ "ఇది చూసి మీరు రమ్మన్నారనుకుని వచ్చాను. తీరా చూస్తే అక్కడ గోపాలకృష్ణయ్య వున్నాడు. అసలేం జరిగిందంటే—" అని ఏదో చెప్పబోయింది.

"నువ్వేమీ చెప్పక్కర్లేదు. అన్ని సాక్ష్యాలూ తయారు చేసుకుని మరీ నాటకమాడుతున్నావన్నమాట. అందుకే వాడు నగలమీద నగలు గుప్పించేస్తున్నాడు. ఎంత జాణవయ్యావే నువ్వు?" అన్నాడామె భర్త..

# 3

ఆ ఉత్తరం రామాయమ్మ రాసివుంటే ఆమె తన జోలికివచ్చే అవకాశముండదు. భర్త ఆమెను ఇల్లు కదలనివ్వడు. ఆ విధంగా ఆ భయం వదిలిపోయింది. కానీ ఒకవేళ ఆమె కాకపోతే?

గోపాలకృష్ణయ్యకు ఎంతో భయం కలిగింది. ఆ ఉత్తరం నిజంగా యెవరో తనను చంపాలనే ఉద్దేశ్యం

తోనే వ్రాశారా? రామాయమ్మ వ్రాయలేదా? రామాయమ్మే రాసివుంటే ఆ ఉత్తరాన్ని పోలీసులకు చూపమని ఎందుకు సలహా ఇస్తుంది?

దస్తూరీ గుండ్రంగా అందంగా ముత్యాలకోవలా వుంది కాబట్టి ఆ ఉత్తరం ఆడవాళ్ళే రాసివుంటారనుకున్నాడతను. అయితే మగవాళ్ళ దస్తూరీ అలా ఉండకూడదని లేదుగదా! ఆ మాటకొస్తే తన దస్తూరీ కూడా గుండ్రంగానే వుంటుంది. అలాగే జనార్దనం దస్తూరీ కూడా!

జనార్దనం గుర్తుకు రాగానే గోపాలకృష్ణయ్య ఉలిక్కిపడ్డాడు.

జనార్దనం దస్తూరీ ఆ ఉత్తరంలోలాగే వుంటుంది.

జనార్దనంకి తనపై పగవుండే అవకాశముంది. తను మరీ సీరియస్‌గా తీసుకోలేదు కానీ జనార్దనానికి తనమీద పీకలదాకా కోపముండి వుండవచ్చు.

జనార్దనానికి తనమీద కోపం వుండక ఏం చేస్తుంది? ఒకప్పుడు తనకేమీ లేని రోజుల్లో తను ప్రతిదినం జనార్దనం దగ్గరకు వెళ్ళి తన భావిజీవితం గురించి ఏడ్చేవాడు. జనార్దనం తనను ఓదార్చేవాడు.

జనార్దనానిది చిన్న కిరాణాకొట్టు. జనార్దనం గోపాలకృష్ణయ్యకంటె సుమారు ఇరవై ఏళ్ళు పెద్దవాడు. గోపాలకృష్ణయ్యకు కిరాణాకొట్టు గురించి సలహా ఇచ్చింది జనార్దనమే. అతను దుకాణం ప్రారంభించిన కొన్నాళ్ళకి జనార్దనం జబ్బుపడ్డాడు. అప్పుడు కొంతకాలం పాటు జనార్దనానికి అవసరమైన సరుకులన్నీ గోపాలకృష్ణయ్యే తెచ్చాడు. ఒక నెలరోజులు అలా గోపాలకృష్ణయ్య జనార్దనానికి సాయపడ్డాడు.

ఆ నెలరోజుల్లోనూ అతను జనార్దనాన్ని చాలా

మోసాలు చేశాడు. ధరలు ఎక్కువచెప్పి, డబ్బు పోయిందనీ, నూనె దారిలో ఒలికిపోయిందనీ అబద్ధాలు చెప్పి మూడువేల రూపాయలు నష్టాన్ని జనార్ధనానికి కలిగించాడు. ఆ నష్టాన్ని జనార్దనం మౌనంగా భరించాడు. ఆ తర్వాత జనార్దనం మళ్ళీ ఎన్నడూ గోపాలకృష్ణయ్య సాయం తీసుకోలేదు.

ఈ సంగతి పెద్ద లెక్కలోనిది కాదు. జనార్దనానికో కూతురుంది. ఆమెను గోపాలకృష్ణయ్యకిచ్చి పెళ్ళి చేయొచ్చునని ఆశపడ్డాడు జనార్దనం. పెళ్లి ప్రసక్తి వచ్చినప్పుడు గోపాలకృష్ణయ్య కూడా ఏమీ మాట్లాడకుండా నవ్వి వూరుకునేవాడు. అతనికి అభ్యంతరం లేదనే వాళ్ళనుకున్నారు.

జనార్దనం కూతురు లక్ష్మి గోపాలకృష్ణయ్యతో చనువుగా తిరిగేది. తలిదండ్రులు అభ్యంతరం పెట్టకపోవడం అందుకు మరింత దోహదం చేసింది. ఈ అవకాశాన్ని పురస్కరించుకుని — గోపాలకృష్ణయ్య సార్ధకనామధేయుడై లక్ష్మిని అనుభవించాడు. ఆమెకు యెన్నో మోసపు వాగ్దానాలు చేసి తనదాన్ని చేసుకోగలిగాడు.

లక్ష్మికి నెలతప్పింది. ఆమె ఆ విషయాన్ని గోపాలకృష్ణయ్యకే ముందు చెప్పుకుంది.

"అబార్షన్ చేయించుకో" అన్నాడు గోపాలకృష్ణయ్య.

"అంత కర్మేంపట్టింది! వెంటనే పెళ్ళి చేసుకుందాం" అంది లక్ష్మి.

"ఇప్పుడిప్పుడే నా వ్యాపారంలో పైకొస్తున్నాను. నేను పెళ్ళి చేసుకోవడానికింకా నాలుగైదేళ్ళు పడుతుంది. నువ్వు అవసరమైన జాగ్రత్తలు తీసుకుంటావను

కున్నానుగానీ యిలా పీకలమీదకు తెచ్చుకుంటావనుకో లేదు."

"పెళ్ళికి ఆలస్యమౌతుందని నువ్వు చెప్పలేదు" అంది లక్ష్మి బాధగా.

"చెప్పినా చెప్పకపోయినా-ఆడదానవి! నీకామాత్రం ముందు జాగ్రత్తుండాలి!"

లక్ష్మి తనబాధ తల్లికి చెప్పుకుంది. ఆవిడ నెత్తీనోరూ బాదుకుని సంగతి భర్తకు చెప్పింది.

జనార్దనం గొడవ చేయొద్దని భార్యకు చెప్పి గోపాల కృష్ణయ్యతో విషయం మాట్లాడ్డానికి వెళ్ళాడు. ముందుగా లక్ష్మి గర్భం గురించి చెప్పకుండా పెళ్ళి గురించి మాట్లాడేడు.

"ఇప్పట్లో పెళ్ళి చేసుకోనండీ" అన్నాడు గోపాల కృష్ణయ్య.

"చేసుకోనంటే తప్పదు. ఆడపిల్లను కన్నవాళ్ళ బాధ నీ కర్థంకాదు" అన్నాడు జనార్దనం.

"అమ్మాయికి పెళ్ళి అర్జంటనుకుంటే వేరే సంబంధం చూసుకోండి" అన్నాడు గోపాలకృష్ణయ్య.

"అలాగే చూసుకుందుంగానీ నువ్వేమనుకున్నావా? దానికిప్పుడు నెలతప్పింది."

"నెల తప్పిందా?" అని ఆశ్చర్యాన్ని ప్రకటించాడు గోపాలకృష్ణయ్య.

"అలా ఆశ్చర్యం నటించకు. ఇందులో నీకు తెలీని విశేషాలేం లేవు" అన్నాడు జనార్దనం.

"నిజంగా నాకేమీ తెలీదు. నేను పవిత్రతకు ప్రాధాన్యతనిచ్చే మనిషిని. మీ అమ్మాయిని నిలదీసి అడిగి

అసలు మనిషెవరో తెలుసుకుని వాడికిచ్చి పెళ్ళి చేయండి."

"అమ్మాయి నీ పేరే చెప్పింది."

"ఆడపిల్లలు కాలుజారుతారేమో గానీ నేను జారను. నీతిగా బ్రతక్కపోయాక జీవితానికర్థంలేదు. మీ అమ్మాయి నన్ను మాయకుణ్ని చేసి ఎవడో చేసిన తప్పు నాకంటగట్టడానికి ప్రయత్నిస్తోంది. ఇదివరలో అయితే మీ అమ్మాయిని పెళ్ళిచేసుకుందామనే అనుకున్నాను. కానీ ఈ సంగతి తెలిసేక ఇక అంగీకరించలేను" అన్నాడు గోపాలకృష్ణయ్య.

జనార్దనానికి చాలా కోపం వచ్చింది. ఇద్దరూ చాలా సేపు వాదించుకున్నారు. ఆఖరికి జనార్దనం, గోపాల కృష్ణయ్యను చంపుతానని కూడా బెదిరించాడు.

"కూతురు పతిత. తండ్రి హంతకుడు. ఇంతకంటె ఏం చేస్తారు మీరు?" అన్నాడు గో. కృష్ణయ్య నిరసనగా.

జనార్దనానిక్కలిగిన ఆవేశమంతా అంతాకాదు. అతను తుపుక్కున ఉమ్మేసి అక్కణ్నించి వెళ్ళి పోయాడు.

తర్వాత ఏం జరిగిందో వివరంగా గో. కృష్ణయ్యకు తెలుసు. లక్ష్మి మారుప్రాంతాలకు వెళ్ళి పురుడుపోసుకుని ఆ కన్నబిడ్డను అనాధాశ్రమంలో వదిలివచ్చింది. ఆమెకు వివాహమైంది. ఆమె భర్తకు పోలీస్ డిపార్టుమెంట్లో మంచి పలుకుబడి వుంది. ఆ పలుకుబడితో అతన్ని దెబ్బ తీయాలని చూసింది లక్ష్మి. అయితే అతనేనా తక్కువ తిన్నది? దురదృష్టాన్ని అదృష్టంగానూ, దురవకాశాన్ని సదవకాశంగానూ మార్చడంలో అతనికి అనుభవం నానాటికీ పెరిగిపోతోంది.

గోపాలకృష్ణయ్య, లక్ష్మిని బ్లాక్ మెయిల్ చేయడం మొదలుపెట్టాడు. ఆమె తరచుగా ఏదో వంకన అనాథాశ్రమానికి వెళ్ళి అక్కడి తన బిడ్డను చూసుకు వస్తూ వుంది. అందుకు సంబంధించిన అసలు కారణాన్ని భర్తకు చెప్పగలనని బెదిరించాడు. ఫలితంగా లక్ష్మి అతని చేతుల్లోకి వచ్చింది. లక్ష్మిభర్తకు పోలీస్ డిపార్టుమెంట్లో వున్న పలుకుబడి గోపాలకృష్ణయ్య వ్యాపారం వృద్ధి చెందడానికీ ఉపయోగపడుతోంది. గోపాలకృష్ణయ్య, లక్ష్మి భర్త మంచి మిత్రులయ్యారు. ఆ స్నేహం చాలా ఉపయోగకరంగా వుండడవల్ల గోపాలకృష్ణయ్య లక్ష్మి మానాన్ని మళ్ళీ దోచుకునేందుకు ప్రయత్నించలేదు.

తన అసహాయ పరిస్థితికి లక్ష్మి మరీ కుమిలిపోయింది. తన కళ్ళముందే గోపాలకృష్ణయ్య అంతస్థు పెరిగిపోతోంది. ద్వేషిస్తూనే తను అతడికి సహకరిస్తోంది.

వారంరోజుల క్రితం అతడు లక్ష్మి నుంచి చిన్న సాయం కోరాడు. అది గోపాలకృష్ణయ్యకు చిన్నసాయమే అయినా లక్ష్మికి కాదు. ఆమె అతనింటికి వచ్చి ఓ పుస్తకం తీసుకుని గోపాలకృష్ణయ్య స్నేహితుడింట్లో యివ్వాలి. గోపాలకృష్ణయ్య ఇంటిమీద పోలీసుల నిఘా వుంది. లక్ష్మి పోలీసులు గౌరవించే మనిషి. ఆమె వారికేదైనా యిచ్చినా, అందులోనూ అది పుస్తకం అయితే ఎవరూ అనుమానించరు. ఆ పుస్తకం స్మగ్లింగ్ కు సంబంధించిన కొన్ని కోడ్స్ వివరాలున్నది. అది తన స్నేహితుడి కందజేయడానికి గోపాలకృష్ణయ్య లక్ష్మిని ఎన్నుకున్నాడు.

ఈ వ్యవహారంలో లక్ష్మి పట్టుబడితే ఆమె భర్తకు

అవమానం. డిపార్టుమెంట్లోని అతడి పలుకుబడి దెబ్బ తింటుంది. లక్ష్మిభర్త ఆ అవమానాన్ని సహించలేడు. అంతేకాదు, ఆ భార్యాభర్తల్లో ఒకరైనా జైలు పాలవుతారు.

అయినా లక్ష్మి అందుకు ఒప్పుకుంది. భర్తకు సంగతి చెప్పలేదు. ఒప్పుకునే ముందు ఆమె గోపాలకృష్ణయ్యతో ఘర్షణపడింది.

"ఇంకా యిలా యెన్నాళ్ళు కాలుస్తావ్ నువ్వు?" అనడిగిందామె.

"అవసరమున్నన్నాళ్ళు నిన్నిబ్బంది పెట్టక తప్పదు."

"నువ్వు నా శక్తికి మించిన పనులు చెబుతున్నావు" అంది లక్ష్మి.

"దీనికే యింత ఇదైపోతున్నావ్. తొందర్లో నా కష్టమర్స్ ముందు నీచేత కాబరేడాన్సులు చేయిద్దామనుకుంటూంటే...." అన్నాడు గో. కృష్ణయ్య క్రూరంగా నవ్వుతూ.

లక్ష్మి హడలిపోయింది. క్రూరమైన అతడి నవ్వు అన్నంతపనీ చేయగల సమర్థుడతనని తెలియజెప్తోంది.

"అదే జరిగితే నిన్ను తక్షణం నా చేతుల్తో చంపేస్తాను" అంది లక్ష్మి ఆవేశంగా.

"లేకపోతే చంపాలని లేదన్న మాట" అన్నాడు గో. కృష్ణయ్య వెటకారంగా.

లక్ష్మి అసహాయురాలై ఊరుకుంది.

"నన్ను చంపాలని చాలామంది అనుకుంటున్నారు. కాని చంపలేరు" అన్నాడు గో. కృష్ణయ్య.

"ఎందుకు చంపలేరు? నీ ఒక్కొక్క వ్యవహారమే నాలో ఆవేశాన్ని పెంచుతూ వస్తోంది. ఓ వారంరోజుల్లో

నిన్ను నేను చంపినా ఆశ్చర్యంలేదు" అంది లక్ష్మి.

ఆ తర్వాత వారంరోజుల్లో ఈ ఉత్తరం వచ్చింది. లక్ష్మి తనింటికి వస్తూపోతూ వుంటుంది. తన పాంటు జేబుల్లో ఈ ఉత్తరం పెట్టడం ఆమెకు కష్టంకాదు.

నిజం చెప్పాలంటే రామాయమ్మ కంటే లక్ష్మికే ఈ ఉత్తరం రాయడానికి అవకాశాలెక్కువున్నాయి. తను తొందరపడి రామాయమ్మ ననుమానించాడుగానీ అసలు మనిషి లక్ష్మి.

అయితే లక్ష్మికింత ధైర్యం ఎలా వచ్చింది?

ఆ రోజు తనతో మాటలయ్యాక ఆమె హత్య చేయాలనుకుని ఉంటుంది. తనకు తానై హత్య చేయలేదు కాబట్టి తండ్రితో చర్చించి ఎవడో ప్రొఫెషనల్ హంతకుణ్ణి పట్టి ఉంటుంది. ఆ ధైర్యంతో తనను హెచ్చరించి ఉంటుంది.

అయితే లక్ష్మి ఉత్తినే తనను బెదిరించిందా లేక నిజంగా చంపుతుందా?

ఏమో! ఈ విషయంలో తను అలక్ష్యం చేయకూడదు. ఇంక ఆమె తనకు ఎలాగూ సహకరించదు. చంపుతానని బెదిరించేదాకా వచ్చిందంటే తెగించినట్లే లెక్క! ఇంత కాలమూ ఆమె భర్త తనకు బాగా ఉపయోగపడ్డాడు. దాంతో తను సంతృప్తిపడాలిగానీ ఇంకా ఆశలు పెట్టుకో కూడదు.

గోపాలకృష్ణయ్య మళ్ళీ వెళ్ళి లక్ష్మిని కలుసుకున్నాడు. ఆమె ఇతనికొచ్చిన ఉత్తరాన్ని చూసి ఎంతో సంతోషించి—"దుర్మార్గులందరికీ ఇటువంటిరోజొకటి వుంటుందంటారు. నీకూ పోయేకాలం రావడం నా అదృష్టం" అంది.

"ఈలోగా నే నీ బ్రతుకు బయటపడ్తుందని మర్చిపోతున్నావ్" అన్నాడు గో. కృష్ణయ్య.

"ఎవరో నిన్ను బెదిరిస్తే నేనేం చేస్తాను. నేనే అనుకుని అలక్ష్యంగా వున్నావంటే నీ కర్మ కాలుతుంది. ఎవడో సునాయాసంగా నిన్ను చంపేస్తాడు" అంది లక్ష్మి.

"ఈ వుత్తరం నువ్వు వ్రాయలేదా?"

"వ్రాయాలనుంది కానీ ఇలాంటి వుత్తరాలు రాయడం నావల్ల కాదు. హత్యలు చేయడమన్నది నా ఊహలో కూడా భరించలేను" అంది లక్ష్మి.

"అబద్ధం!" అన్నాడు గో. కృష్ణయ్య.

"నా ప్రాణాలు నీ చేతిలో వున్నాయ్. నేను నీకు అపకారమెందు తలపెడతాను."

"అందుకే!" అన్నాడు గో. కృష్ణయ్య.

ఇద్దరూ చాలాసేపు వాదించుకున్నారు. లక్ష్మి అతన్ని తన రహస్యం బయటపెట్టవద్దని బ్రతిమాలింది. ఆ వుత్తరం గురించి తనకేమీ తెలియదని మరీమరీ చెప్పింది.

గోపాలకృష్ణయ్య అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. రేపటిలోగా తన హత్య జరక్కుండా వుండాలంటే అనుమానితుల్ని డిఫెన్స్‌లో వుంచాలి. తను లక్ష్మి రహస్యాన్ని బయటపెట్టక తప్పదు.

గోపాలకృష్ణయ్య వెంటనే లక్ష్మి భర్తకు ఫోన్ చేశాడు.

లక్ష్మి భర్త ఆ ఊళ్ళో చాలా పెద్ద పేరున్న శివశంకర్ హోటల్‌కు మేనేజర్. ఆ హోటల్‌ను పోలీసుల సావరంగా వాడుకోడానికి అతనిచ్చే సదుపాయాలవల్లనే అతనికి పోలీసు డిపార్టుమెంట్లో మంచి పలుకుబడివచ్చింది.

అలాగని అతను ధర్మాత్ముడు, నీతిపరుడు కాడు. తనకు తానై అవినీతిపనులు చేయకపోయినా తన పలుకుబడితో అతను చాలామంది అవినీతిపరులకు సాయపడుతూ అప్పు డప్పుడు మంచి ప్రతిఫలాన్ని కూడా పొందుతూంటాడు. తామతన్నించి పొందుతూన్న సదుపాయాలు మరే హోట ల్నించీ పొందకపోవడంవల్ల పోలీస్‌వారు అతన్ని చూసీ చూడనట్లూరుకుంటూంటారు.

గోపాలకృష్ణయ్య అతనికి ఫోన్ చేసి తన పేరు చెప్ప కుండా-లక్ష్మి వివాహానికి ముందే ఒక బిడ్డను కని ఫలానా అనాథాశ్రయంలో ఉంచిందనీ, అందుకు ఆధారాలుగా తనవద్ద వివరాలన్నీ వున్నాయంటూ ఆమె పురుడుపోసు కున్న తేదీ, హాస్పిటల్ పేరు వగైరాలన్నీ చెప్పాడు.

అవతలి కంఠంలో ఆదుర్దా ధ్వనించగానే తృప్తిగా ఫోన్ క్రింద పెట్టేసి-"నా హత్య సంగతి తర్వాత ఆలో చించుకోవచ్చు ముందు నీ కాపురం సంగతి చూసుకో" అనుకున్నాడు.

# 4

గోపాలకృష్ణయ్య బట్టలషాపులో వుండగా అతని బంధువు నరసయ్య పలకరించి-"అన్నట్లు నీ కిది తెలుసా? రామనాథం జైల్నించి విడుదలై వచ్చేశాట్ట!" అన్నాడు.

గో. కృష్ణయ్య ఉలిక్కిపడి "ఎప్పుడుట?" అన్నాడు.

"రెండ్రోజులయిందంటున్నారు...." అన్నాడు నర సయ్య.

"ఎక్కడున్నాట్ట?"

"వాళ్ళింట్లోనే!" అన్నాడు నరసయ్య.

గో. కృష్ణయ్య ఆలోచనలో పడ్డాడు. తను తొందర

పడి లక్ష్మిని అనుమానించాడు గానీ ఈ ఉత్తరం రాసే అవకాశం రామనాధానికే ఎక్కువ వుండివుండాలి.

రామనాధం, గో. కృష్ణయ్య కంటే ఓ రెండేళ్ళు చిన్న. తెలివితేటల్లో అయితే ఇంకా చాలా చిన్న. అతను గో. కృష్ణయ్య బట్టల కొట్లో సేల్సుమన్‌గా చేరాడు.

రామనాధానికీ, గో. కృష్ణయ్యకూ దూరపు బంధుత్వముంది. ఆ బంధుత్వాన్ని పురస్కరించుకునే అతడికి తన బట్టల షాపులో ఉద్యోగమిచ్చాడు.

రామనాధం చురుకైన కుర్రాడు. కొట్లోకి వచ్చిన వాళ్ళందర్నీ చూపులతో, మాటలతో ఇట్టే ఆకర్షించుకుని వాళ్ళను మైకంలో పడేసి కొనాలన్న ఆలోచనలేని వాళ్ళనుకూడా కొనేలా చేసేవాడు. అతని కారణంగా షాపులో చాలా ఎక్కువ సరుకు అమ్ముడుపోయేది. అది చూసి సంతోషించి గో. కృష్ణయ్య అతడి జీతం పెంచేడు కూడా.

రామనాధం చూడ్డానికి సినిమా హీరోలా వుంటాడు. ఆట్టే చదువుకోకపోయినా సంస్కారం ముఖంలో కొట్టొచ్చినట్లు కనబడుతూంటుంది. చాలామంది ఆడ వాళ్ళు, ముఖ్యంగా కాలేజీ స్టూడెంట్స్ షాపులో సరా సరి అతనివద్దకే వెడుతూండేవారు.

రామనాధం ఆకర్షణ షాపుకి వచ్చే కస్టమర్స్‌కి మాత్రమే పరిమితమైతే యిబ్బంది వుండేది కాదు. గో. కృష్ణయ్య చెల్లెలు లలిత అతడిపట్ల ఆకర్షితురాలైంది. ఇది అతనికి నచ్చలేదు. లలితకు ఎంతగానో చెప్పి చూశాడు.

"మనమూ కష్టపడి పైకొచ్చినవాళ్ళమేగా – మనం

ప్రోత్సహిస్తే అతనూ పైకొస్తాడు. మన దుకాణంలో సేల్సన్నీ అతనికారణంగా నేనని చాలామంది చెప్పుకుంటు న్నారు. నే నతన్ని ప్రేమిస్తున్నాను" అని చెప్పింది లలిత అన్నకు.

"కష్టపడి పైకివచ్చేక ఆ విషయం మనం మరిచి పోవాలి. మొక్క చెట్టుగా మారేక తన నీడలో మరో మొక్కను ఎదగ నివ్వదు. నేను రామనాథాన్ని పైకి రానివ్వను. వాడి జీవితమంతా అలా సేల్స్‌మన్‌గనే గడిపేస్తాడు. అందుకేం చేయాలో నాకు తెలుసు. కాబట్టి నువ్వు వాడి విషయం మరిచిపో. నా పాత అంతసు నేను మరిచిపోయాను. నాతోపాటు నా చెల్లెలిగా నీ అంతసూ పెరిగింది. ఆ అంతసుకు తగ్గవాణ్ణి చూసి పెళ్ళి చేస్తాను" అన్నాడు గో. కృష్ణయ్య.

లలిత అప్పటికి ఊరుకుని రహస్యంగా రామనాథాన్ని కలుసుకుని "నేను నా నగలతో నీతో వచ్చేస్తాను. ఆ డబ్బుతో వ్యాపారం ప్రారంభించి నువ్వూ గొప్పవాడివి కావచ్చు. మనం పెళ్ళిచేసుకుందాం" అంది.

రామనాథం, లలితకు సమాధానం చెప్పకుండా గో. కృష్ణయ్యను కలుసుకున్నాడు.

"మీ చెల్లెలు నన్ను ప్రేమిస్తున్నానంటోంది. తన నగలతో వచ్చేస్తానంటోంది. నన్ను వేరే వ్యాపారం చేయమని ప్రోత్సహిస్తోంది. నన్ను పెళ్ళి చేసుకుంటా నంటోంది" అన్నాడతను.

గో. కృష్ణయ్య కిది తెలియని విషయం కాదు. అందు వల్ల అతను తడబడకుండా "అయితే నీ అభిప్రాయ మేమిటి?" అన్నాడు.

"మీరు నాకు అన్నం పెట్టారు. కృతఘ్నుణ్ణనిపించుకోవడం నాకు నచ్చదు. అందుకే అన్ని విషయాలూ మీకు చెప్పాను" అన్నాడు రామనాథం.

"చెప్పడంవరకూ బాగానే ఉంది. నీ అభిప్రాయ మేమిటి?" అన్నాడు గో. కృష్ణయ్య.

"అంతా మీ యిష్టం!" అన్నాడు రామనాథం.

"అంటే నేను యిష్టపడితే ఈ పెళ్ళి చేసుకుంటావన్న మాట!"

"లలితవంటి ఉత్తమురాలు నా భార్య అవుతుందంటే అభ్యంతరం పెట్టడం ఏ మూర్ఖుడివల్లనో అవుతుంది కానీ నావల్ల కాదు. ఎటొచ్చీ నాక్కావలసింది పెద్దల ఆశీర్వాదం!" అన్నాడు రామనాథం.

మరుక్షణం అతని చెంప ఛెళ్ళుమంది. గో. కృష్ణయ్య ఆవేశంతో ఊగిపోతూ, "దయచూపిన దేవుణ్ణి కాళ్ళుపట్టమని అడిగే నీచుడివిరా నువ్వు. లలిత అంతనేమిటో నీ అంతనేమిటో ఊహించావట్రా-అది నీ యజమానురాలు. ఒక సేల్స్‌మన్‌గా నిన్ను శాసించడానికేగానీ, భార్యగా నీ సేవలు చేయడానికి కాదు పుట్టలేదు. ఏదో చిన్నపిల్ల ఎర్రగా బుర్రగా వుంటే అదే గొప్ప అనుకుని నిన్ను ప్రేమించాననుకుంటోంది. అంతమాత్రాన నువ్వో హీరోవై పోతావట్రా - ఇంకెప్పుడైనా యిలాంటి వెధవాలోచనలు పెట్టుకుంటే ఉద్యోగం ఊడుతుంది జాగ్రత్త" అన్నాడు.

రామనాథం చెంప తడుముకుంటూ "లలిత అడగ్గానే ఆమెతో వెళ్ళిపోయుంటే ఏం చేసేవారు? ఆమెకు అన్నగా మిమ్మల్ని గౌరవించి ముందుగా విషయం చెప్పినందుకు నన్నిలా అవమానిస్తారా? ఇది న్యాయమా? ఈ పెళ్ళి

మీ కష్టంలేకపోతే లేదనిచెప్పినా నేను బాధపడి ఉండే వాణ్ణికాను. కాని మీరు నన్ను అనూహ్యంగా అవమానించారు" అన్నాడు.

"నీ బుద్ధికి తగ్గట్లే ప్రవర్తించాను నేను. లేకపోతే లలితెక్కడ, నువ్వెక్కడ? అది అడగ్గానే చంకలు గుద్దుకుంటూ నా దగ్గరకు వచ్చేబదులు అమ్మా, ఇది తప్పు. మనిద్దరికీ ఏ పరిస్థితుల్లోనూ పొసగదు అని బుద్ధిచెప్పలేకపోయావా? అసలు నీ బుర్రలో ఉన్నాయిరా పాడు ఊహలు-అందుకే నా దగ్గరకొచ్చావు. మీ రిద్దరూ వెళ్ళిపోయుంటే ఏంచేసేవాణ్ణనికదూ నీ ప్రశ్న! దాని కింకా మైనారిటీ తీరలేదు. నిన్ను వేటాడి జైల్లోకి తోయించేవాడ్ని. ఏదో పెద్ద సాయంచేసినట్లు మాట్లాడకు. ఇన్నాళ్ళూ నువ్వు నమ్మకస్తుడవని నమ్మానుకానీ యిప్పుడిప్పుడే నీ అసలుబుద్ధి బయటపడుతోంది"

రామనాథం ముఖం కోపంతో కందగడ్డలా అయింది. "నన్ను మన్నించండి గో. కృష్ణయ్యగారూ, మీరు నా విశ్వాసాన్ని శంకిస్తే నేను భరించలేను. సేఠ్ రాంచంద్ గారు నన్ను తన దుకాణంలో పనిచేయమనీ, మీ రిచ్చే దానిమీద రెండొందలెక్కువిస్తాననీ చెప్పారు. అయితే సేల్స్‌మన్ గా నా ప్రతిభ చూపుకునే అవకాశమిచ్చింది మీరు. అందువల్లనే గదా ఇప్పుడు బయట నా డిమాండ్ పెరిగింది. అందుకని నేను మీ షాపును వదిలిపెట్టదల్చుకోలేదు" అన్నాడు ఆవేశంగా.

"వెధవకబుర్లు చెప్పకు. డబ్బిస్తే కాలదన్నుకునేవాడెవరూ ఉంటాడనుకోను" అన్నాడు గో. కృష్ణయ్య. అది ఆయనకు స్వానుభవం మరి - "నీకు సేఠ్ రాంచంద్

డబ్బెక్కువిస్తానంటే ఆ సంగతి నాకెందుకు చెప్ప లేదు?"

"జీతం కోసం బేరమాడుతున్నట్లు భావించి మీ మనసు నొచ్చుకుంటుందని సందేహించాను. నా బాగోగు లన్నీ నాకంటే మీకే బాగా తెలుసును. అందుకే అన్నీ మీకే వదిలిపెట్టాను."

"నా పనివాళ్ళను నాతోనే కట్టిపారేయడం నాకు నచ్చదు. నీ కెక్కువ డబ్బులొస్తే ఇంకో చోటుకు వెళ్ళి పనిచేసుకోవచ్చు" అన్నాడు గో. కృష్ణయ్య నిష్ఠూరంగా.

"మీరు మనస్ఫూర్తిగా అభ్యంతరం లేదని చెబితే రేపే రాంచంద్ గారి దుకాణంలో జాయినౌతాను" అన్నాడు రామనాథం. ఆ విధంగా అయితే తనకు లలిత యజమానురాలు కాదు. ఆమెను భార్యగా పొందే అర్హత పెరుగుతుందని అతను మనసులో అనుకున్నాడు.

గో. కృష్ణయ్య ఉలిక్కిపడ్డాడు. రామనాథం చాలా ఖచ్చితంగా మాట్లాడుతున్నాడు. అంటే అతను నిజంగానే మంచి పొజిషన్లో వున్నాడన్నమాట. రామనాథం గుండెనిబ్బరం చూస్తుంటే గో. కృష్ణయ్యకు భయం వేసింది.

రామనాథానికి ఊళ్ళో మంచి పేరు వచ్చింది. అతని కోసం చాలామంది దుకాణాదారులు ప్రయత్నిస్తున్నట్లు అతను చూచాయగా వినివున్నాడు. ఇందులో చాలా ప్రమాదముంది. ఇలా ఇతరులు రామనాథం కోసం పోటీ పడుతూంటే తను అతడి జీతం పెంచుకుంటూ పోక తప్పదు. అప్పుడు అరికంగా అతడి స్థాయి పెరుగుతుంది. లలితపై తనకు సరైన కంట్రోల్ లేదు. ఆమె ప్రోత్సాహం

లభించి ఈ రామనాథం తనతో పోటీచేసే వ్యాపారస్థుడు కూడా కావచ్చు.

లలిత రామనాథాన్ని ప్రేమిస్తోంది. రామనాథం తన వ్యాపారానికి పోటీ అయ్యే అవకాశం కనబడుతోంది.

ఇలాంటి విషయాలను మొగ్గలోనే త్రుంచేయాలి. అనుభవంతో నిండివున్న గో. కృష్ణయ్య బుర్ర చకచకా పనిచేసింది. అతను వెంటనే తన మనసులోని కఠినత్వాన్ని విడిచిపెట్టి "నాకు ఆవేశం ఎక్కువ రామనాథం! ఇందాకా నిన్నన్నదానికి నన్ను మన్నించు. నేను నీ విషయమై తీవ్రంగా ఆలోచించి నా నిర్ణయం చెబుతాను. నువ్వు నిజంగానే విశ్వాసపాత్రుడివి. లలిత విషయంలో కూడా నేను బాగా ఆలోచిస్తాను. మన మధ్య జరిగిన ఈ సంభాషణ మన మధ్యనే వుండిపోవాలి" అన్నాడు.

గో. కృష్ణయ్య అలా మాట్లాడడంతో రామనాథం కరిగిపోయాడు. అతడి కఠినత్వాన్ని కూడా రామనాథం మన్నించగలిగాడు. పై అంతస్థులో ఉన్నవాళ్ళు మాత్రం ఆవేశపడడం సహజమేనని అతడి కనిపించింది. తన మంచితనం గురించి అర్థంకాగానే గో. కృష్ణయ్య మారాడని అతను భావించాడు.

మర్నాడు గో. కృష్ణయ్య ఒక పెట్టెను రామనాథానికిచ్చి కొన్ని పరిస్థితుల కారణంగా అది తన ఇంట్లో వుంచరాదనీ, ఇన్‌కమ్‌టాక్స్ రెయిడింగ్ జరుగనున్న ఈ రోజుల్లో కొంతకాలంపాటు అవి అతనింట్లో దాచమనీ కోరాడు. లలితను అతనికిచ్చి వివాహం చేయదల్చినట్లు కూడా చెప్పాడు. రామనాథం అమితంగా సంతోషించాడు. తానిచ్చిన పెట్టె గురించి మూడో కంటికి తెలియకూడదని మరీ మరీ చెప్పాడు గో. కృష్ణయ్య.

తర్వాత గో. కృష్ణయ్య లలిత దగ్గరకు వెళ్ళి రామ నాధంతో వివాహానికి తను అనుమతిస్తున్నట్లు చెప్పాడు. లలిత ఆశ్చర్యపడి తన అన్నగారి మంచిమనసు నెంతగానో అభినందించింది.

"కుర్రాడు యోగ్యుడు. విశ్వాసపాత్రుడు. నీకు నచ్చిన వాడు. నీ సుఖంకంటే నాక్కావలసినదేముంది? నీమాట కాదని ఎలా అనగలను?" అన్నాడు గో. కృష్ణయ్య.

లలిత అన్న కాళ్ళమీదపడి మొదట తా నతన్ని అపారం చేసుకున్నందుకు మన్నించమని అడిగింది.

"అన్నా చెల్లెళ్ళ మధ్య మన్నన లేమిటమ్మా!" అన్నాడు గో. కృష్ణయ్య ఆమెను పైకి లేవనెత్తుతూ.

రెండ్రోజుల తర్వాత గోపాలకృష్ణయ్య తనింట్లో వస్తువులు పోయినట్లు పోలీసురిపోర్టు ఇచ్చాడు. పోలీసులడిగిన ప్రశ్నలకు జవాబు చెబుతూ-"యెవరిని నమ్మాలో,ఎవరిని నమ్మకూడదో తెలియకుండా వుంది. ఆ వస్తువులన్నీ ఒక పెట్లో వుంచాను. దానిగురించి తెలిసిన బయటివాడు రామనాధం ఒక్కడే. అయితే అతన్ని నే ననుమానించ లేను. నే నతనికి మా చెల్లెల్నిచ్చి వివాహం చేద్దామని కూడా అనుకుంటున్నాను" అన్నాడు.

పోలీస్ ఇన్స్పెక్టర్ వెంటనే "అయితే అతడి ఇల్లు శోధించాలి" అన్నాడు.

దానికి బదులుగా గోపాలకృష్ణయ్య "నా యందు దయుంచి నా ఇబ్బందిని మీ రర్ధం చేసుకోవాలి. అతను కాబోయే ఇంటల్లుడు. ఒక పోలీసు అఫీసరుగా మీరతన్ని అనుమానించవచ్చు. కానీ నేనా పని చేయలేను. చేసినా పైకి చెప్పుకోలేను. ఈ సోదా కారణంగా ఈ పెళ్ళి చెడిపోకూడదు. వ్యవహారాన్ని వీలైనంత రహస్యంగా

నడిపించండి. సోదాను మీ స్వంత బాధ్యతపై జరిపించండి" అన్నాడు.

ఆ విధంగా గో. కృష్ణయ్య ఆశయం నెరవేరి రామనాథం జైలుపాలయ్యాడు. ఈ నాటకం గో. కృష్ణయ్య ఎంతో తెలివిగా నడిపించేడంటే లలిత మాత్రమే కాక, రామనాథం ఇంట్లోనివాళ్ళుకూడా రామనాథాన్నే అనుమానించి "దేవుడిలాంటి మనుషికి ద్రోహం తలపెట్టిన నీకు పుట్టగతులుండవురా" అని తిట్టే పరిస్థితి ఏర్పడింది.

గో. కృష్ణయ్య మాటలు నమ్మి ఆ పెట్టె విషయాన్నింట్లో వాళ్ళకూడా చెప్పలేదు రామనాథం. ఆ పెట్టెలోని విలువైన వస్తువులను చూసినవాళ్ళెవ్వరూ కూడా ఎవ్వరూ నమ్మి అంత విలువైన పెట్టెను పరాయి వాళ్ళకివ్వరని అన్నారు. లలితను పెళ్ళి చేసుకునే అంతస్థు తనకు తానై సంపాదించుకోవడం కోసం రామనాథం ఆ పని చేసివుండాలని తను భావిస్తున్నట్లు గో. కృష్ణయ్య అన్నాడు. అతను జైల్లో ఉండగా ఒక పర్యాయం రామనాథాన్ని కలుసుకుని మాట్లాడాడు కూడా.

రామనాథం అతన్ని చూస్తూనే ఆవేశపడి—"నీ గురించి జైల్లోంచి తిరిగిరాగానే పగ తీర్చుకుంటాను...." అన్నాడు.

గోపాలకృష్ణయ్య స్వరం తగ్గించి—"పగల సంగతి మరిచిపో—మళ్ళీ పిచ్చిపిచ్చి వేషాలు వేశావంటే ఈసారి హత్యా నేరం మీద ఉరికంబం యెక్కుతావు—" అన్నాడు.

"తప్పకుండా అలాగే జరుగుతుంది. జైల్లోంచి తిరిగి రాగానే నేను నిన్ను హత్య చేస్తాను...." అన్నాడు రామనాథం.

## 30

గోపాలకృష్ణయ్య ఉత్తరంవంక చూస్తున్నాడు. ఉత్తరంలోని ఆ అక్షరాల వెనుకనుంచి రామనాథం భయంకరంగా నవ్వుతూ కనిపిస్తున్నాడు.

రామనాథం జైల్లోంచి తనమీద పగతో తన్ను చంపడానికి తిరిగివచ్చాడా? ఈ ఉత్తరం అతనే రాశాడా? చంపితే తననెలా చంపాలని అతడి ఉద్దేశం? తనను చంపడం అతనివల్ల అవుతుందా?

తన కారణంగా రామనాథం జీవితం నాశనమైంది. బంగారు భవిష్యత్తు దగ్ధమై పోయింది. అతను ప్రేమించిన లలిత అతన్ని అసహ్యించుకుంది. ఇంట్లో వాళ్ళతన్ని అసహ్యించుకున్నారు. దొంగ అన్న అబద్ధపు ముద్రను సమాజం అతనిపై వేసింది. అందువల్ల రామనాథం తన్ను చంపేయాలని అనుకోవచ్చు.

యేది యేమైనా తను ఒకసారి రామనాథాన్ని కలుసుకోవాలి.

కలుసుకోగానే మీదపడి చంపితే....?

గోపాలకృష్ణయ్య ఒకసారి జబ్బలు చరుచుకున్నాడు. కండబలంలో రామనాథం తనముందు నిలబడలేడు. అందులోనూ యిప్పుడు జైల్నించి వచ్చాడు. ఇంకా నీరసంగా ఉంటాడు. మొండిబలమున్నా బహిరంగ ప్రయత్నం చేయడు. తనను చాటు దెబ్బ తీయడానికే ప్రయత్నిస్తాడు.

## 5

గోపాలకృష్ణయ్య వెంటనే బయల్దేరి రామనాథం యింటికి వెళ్ళాడు. గుమ్మంలోనే రామనాథం తండ్రి ఎదురయ్యాడు.

"రామనాథం యింట్లో ఉన్నాడా!" అన్నాడు గో. కృష్ణయ్య.

రామనాథం తండ్రి గో.కృష్ణయ్యకు నమస్కారంచేసి —"ఆ మూలగదిలో ఉన్నాడు బాబూ—"అన్నాడు. ఆ యింట్లో వాళ్ళకు గో.కృష్ణయ్యంటే గౌరవం. రామనాథం జైలుపాలైనపుడు అతను ఆయిదారువేల వరకూ ఆ యింటికి ఆర్థికసాయం చేశాడు. గో.కృష్ణయ్య డబ్బు ఎంత తెలివిగా సంపాదిస్తాడో అంత తెలివిగానూ ఖర్చు పెడతాడు.

"మనిషి బాగా బెంబేలుపడి ఉంటాడు. అతనికి మళ్ళీ నేనే ఉద్యోగమిస్తాను. ఆ సంగతి చెప్పడానికే వచ్చాను...." అన్నాడు గో.కృష్ణయ్య.

రామనాథం తండ్రి కళ్ళు మెరిశాయి—"ఆ మంచితనమే నీకు డబ్బు సంపాదించి పెడుతోంది బాబూ—" అన్నాడు అభిమానంగా.

ఆ మాటలు గో.కృష్ణయ్యకు వ్యంగ్యంలా తోచాయి. మంచితనం మనిషికి డబ్బు సంపాదించదు—పోగొడుతుందికానీ! రామనాథం మంచితనమే అతన్నీ గదిలోకి తెచ్చింది. ఆ మంచితనం అని తన గురించి రామనాథం తండ్రి అన్నది మంచితనం గురించికాదు. ఆ మంచితనం అంటే అది తన మంచితనం. తన మంచితనం—మంచితనం ముసుగులో ఉండే దుర్మార్గం. పయోముఖ విషకుంభం, మేకవన్నె పులి—ఇలాంటి పేర్లన్నీ తనకు చక్కగా నప్పుతాయి. అయితేనేం? ఆ మంచితనం తనకు నిజంగానే బాగా డబ్బు సంపాదించి పెడుతోంది.

మూల గదిలోకి వెళ్ళేముందు కొంచెం తటపటాయించాడు గోపాల కృష్ణయ్య. తనకు తానై పులివున్నబోన్లోకి

నడవడం లేదుగదా? అన్న అనుమానం ఆతనికి రవంత భయాన్ని కలిగించింది. గుమ్మందాకా వెళ్ళి గదిలోకి తొంగి చూశాడు.

గదిలో మడత మంచంమీద దిగులుగా కూర్చుని వున్నాడు రామనాథం. అతని కళ్ళు లోతుకు పోయి వున్నాయి. గడ్డం మాసింది. దవడలు పీక్కుపోయాయి. ఒకనాటి హీరో వాటం లేదు. ఇప్పుడు లలిత అతన్ని చూస్తే - ఒకప్పుడు నేను ప్రేమించిందితడినేనా అని ఆశ్చర్యపోయి-అసహ్యించుకుంటుంది.

రామనాథం గో. కృష్ణయ్యను చూడలేదు. రామనాథాన్నాదశలో చూడగానే గో. కృష్ణయ్య ధైర్యం పెరిగింది-"లోపలకు రావచ్చా?" అన్నాడు.

రామనాథం చటుక్కున గుమ్మంవైపు చూసి-"నువ్వా?" అన్నాడు.

గోపాలకృష్ణయ్య ఆశ్చర్యపోలేదు కానీ అతడి ఏకవచన ప్రయోగం కాస్త బాధనే కలిగించింది-"అవును నేనే-జైల్నించి వచ్చావని విని చూడ్డానికి వచ్చాను-" అన్నాడు.

"సరే చూడు" అన్నాడు రామనాథం నిర్లిప్తంగా. అతని వాటాన్ని చూస్తుంటే ఈ మనిషికిప్పుడు హత్యలు చేసే మూడ్ ఉందా అనిపించింది.

"నిన్ను చూస్తుంటే నాకు చాలా జాలిగా వుంది. మళ్ళీ ఉద్యోగంలో చేరతావా, ఇస్తాను!"

రామనాథం విషాదంగా నవ్వి-"ఇప్పుడు నీ దగ్గర తప్ప గత్యంతరం వుండదనేగా నీ ధైర్యం. పైగా ఒక దొంగకు ఆశ్రయమిచ్చినందుకు మంచి పేరు కూడా వస్తుంది. నువ్వు చేసిన దొంగనే కదా నేను. ఇతరు

లెవ్వరూ నమ్మకపోయినా నువ్వు నమ్మితీరుతావు. అయితే నేను మునుపటి రామనాథాన్ని కాను. నీ బట్టలషాపులో అడుగుపెట్టగానే అగ్గిపుల్ల గీసి బట్టలమీద వేయ బుద్ధి నాకు. నీలాంటి దగాకోరు దగ్గర నేను పనిచేయను, చేయ లేను....” అన్నాడు.

“నీ కర్మ. నిన్ను పనిలో చేరమని బ్రతిమాలడానికి రాలేదు నేను. చేరితే చేరు మానితే మాను. నీహద్దుల్లో నువ్వున్నంతకాలమూ నా మంచితనం రుచి చూడగలవు. లేనప్పుడు ఫలితం అనుభవిస్తావ్. ఆ విషయం చెప్పడానికే వచ్చాను....”

“ఆల్ రెడీ — అనుభవించానుగా” అన్నాడు రామ నాథం.

“అది జరిగిందానికి. ఇది జరుగనున్నదానికి. నువ్వు చేసిన తప్పుకి శిక్ష అనుభవించావ్. అందుకు నామీద పగబట్టి నన్ను హత్య చెయ్యాలనుకుంటే నాశనమయ్యేది మళ్ళీ నీ జీవితమే!” అన్నాడు గో. కృష్ణయ్య.

“నీ దయవల్ల నా జీవితం ఎప్పుడో నాశనమైంది. నాశనం కావడానికింకా యేం మిగిలుంది?”

“ఏం మిగిలుందో నేను తర్వాత చూపిస్తాను కానీ ముందు ఇప్పుడిది చూడు” అంటూ తన జేబులోంచి ఒక నీలిరంగు కాగితాన్ని తీసి అందించాడు గో.కృష్ణయ్య.

రామనాథం దాన్నందుకుని చూసి “ఇది నువ్వు నన్ను బెదిరించడానికి రాశావా, లేక ఎవరైనా నిన్ను బెదిరిస్తూ రాశారా?” అన్నాడు.

“తెలియనట్లే అడుగుతున్నావ్. ఇది నువ్వు రాసింది కదూ....” అన్నాడు గో. కృష్ణయ్య.

"అయితే ఇది నీకే వచ్చిందన్నమాట. నాకు చాలా సంతోషంగా ఉంది...." అన్నాడు రామనాథం.

"బుకాయించకు. ఇది నువ్వే రాశావ్—" అని గో.కృష్ణయ్య అతనది తన జేబులోకి ఎలా చేర్చగలిగి ఉంటాడా అని ఆలోచిస్తున్నాడు. తనింట్లో ఏ పని మనిషికి పది రూపాయలిచ్చినా ఆ ఉత్తరం జేబులో పెట్టొచ్చు. అది ప్రమాదంలేని పని కాబట్టి ఎవరైనా ఒప్పుకుంటారు.

"నేను రాయలేదు. కానీ ఎప్పుడూ భగవంతుణ్ని ప్రార్థించి కోరికలు కోరుకునే అలవాటులేని నే నిప్పుడే కోరుకుంటున్నాను. ఈ ఉత్తరంలో రాసిన ప్రకారం జరిగేలా చూడుగాక!" అన్నాడు రామనాథం.

"ఈ ఉత్తరం నువ్వే రాశావని నా అనుమానం—" అన్నాడు గో.కృష్ణయ్య.

"నీ యిష్టం వచ్చినట్లనుకో. నిన్ను చంపే ఓపిక నాకు లేదుగానీ నువ్వు త్వరగా చస్తే చూడాలన్న కోరిక మాత్రం బోలెడుంది—" అన్నాడు రామనాథం.

గో.కృష్ణయ్య చటుక్కున అక్కణ్నించి లేచి ఆ నీలి కాగితాన్ని తీసుకుని మళ్ళీ జేబులో పెట్టేసుకుని— "నాకు ద్రోహం తలపెడితే అనుభవిస్తావ్!...." అన్నాడు.

"ఎవరు ఎవరికి ద్రోహం తలపెట్టారో నీకే బాగా తెలుసు. ఇక్కణ్నించి పోరా—రాస్కెల్!" అన్నాడు రామనాథం. అప్పుడే అతని కళ్ళలో యెర్ర జీర వచ్చింది.

ఆ జీర చూడగానే, గో.కృష్ణయ్యకు భయం వేసింది. ఆ ఉత్తరం రాసింది రామనాథమేనని—అతను తనను

తప్పక హత్య చేయగలడనీ నమ్మకం కలిగింది.

రామనాథం వానిషి వంచివాడే కావచ్చుకానీ తనకూ అతనికీ చెడింది. అతను తనమీద పగబట్టాడు. అతనివల్ల తనకు ప్రమాదం ఉంది. రామనాథం యిప్పుడే జైల్నించి వచ్చాడు. అతను యింత కంటే ప్రమాదంగా మారే లోగా తను యేదో చేయాలి. అందుకు వొకటే మార్గం.

గో.కృష్ణయ్య గదిలోంచి బయటకు వచ్చేక— "ఏమంటున్నాడు మా వాడు?" అని పలకరించాడు రామనాథం తండ్రి.

"నా దగ్గర ఉద్యోగం చేయట. పైగా నన్ను చంపుతానని బెదిరిస్తున్నాడు. ఆవేశంలో ఉన్నాడు. మీరు నెమ్మదిగా నచ్చచెప్పి చూడండి. మీ కుటుంబానికి సహాయపడాలన్నదే నా తాపత్రయం—" అని అక్కణ్నించి వెళ్ళిపోయాడు గో.కృష్ణయ్య.

అప్పటికే తను యేం చేయాలో గో.కృష్ణయ్య నిర్ణయించుకుని ఉన్నాడు. అతను తిన్నగా పోలీస్ స్టేషన్‌కు వెళ్ళి—తనకు వచ్చిన ఉత్తరం యిచ్చి—"ఈ రోజే ఇది నాకు అందింది. నాకు రామనాథం పైన అనుమానంగా ఉంది. అతన్ని కలుసుకుని మాట్లాడితే నా చావు కోసమే ఎదురుచూస్తున్నానని చెప్పాడు. కొద్దిరోజుల పాటు అతన్ని ఓ కంట కనిపెట్టి ఉండమని కోరుతున్నాను...." అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ వివరాలు నోట్ చేసుకుని—"మేము చర్య తీసుకుంటాం లెండి. ఆ ఉత్తరం కూడా ఇక్కడే వదలండి—" అన్నాడు.

# 6

"నిన్ను చంపేస్తాను—...." అన్నాడు రామాయమ్మ భర్త సోమనాథం.

"నన్ను చంపేయండి. అప్పుడు నేను స్వర్గానికెడతాను. మీకు ఉరిశిక్ష పడుతుంది. ఆ విధంగా మనిద్దరికి ఆ గోపాలకృష్ణయ్య బాధ తగ్గుతుంది—" అంది రామాయమ్మ.

"మధ్య నీకేం బాధ? వంటి తిమ్మిరి తీరుతోంది గదా—అనుభవిస్తున్నదంతా నేను...."

"అలా అనుకుంటున్నారు. కానీ నేను పిల్లలమీద వట్టేసి చెబుతున్నాను. ఆ గోపాలకృష్ణయ్యంటే నాకు అసహ్యం. మీ కారణంగానే నేను వాడికి లోకువై పోయాను. ఎంతసేపూ మీరు నన్ను తిట్టి అనుమానించడమేగానీ వాణ్ని ఒక్క ముక్క అనగలిగారా—వాడా కారణంగా రోజు రోజుకూ పెచ్చుమీరి పోతున్నాడు.

ఒకానొకప్పుడు మనింట్లో నగలు దొబ్బి యింతవాడయ్యాడు. ఆ నగల విషయంలో వాణ్ని అనుమానించానన్న కోపంతో నామీద పగబట్టి యిలా సాధిస్తున్నాడు. మీకు చెప్పకుందామనుకుంటే—నేను మీ కెప్పుడైనా ఓ మనిషిలా కనబడ్డానా—ఎంతసేపూ నన్ను తిట్టి సాధిద్దామనే మీ తాపత్రయం. మీ అలుసు చూసుకుని నిజంగానే వాడు నా మానం దోచాలని ప్రయత్నించాడు. ఛి, ఛీ—తమ్ముడిలా చూసుకున్నాను వాణ్ని...." అంది రామాయమ్మ.

రామాయమ్మ భర్త వేడి కాస్త తగ్గింది. అప్పుడతను కాస్త తీరుబడిగా ఆమె చెప్పినవన్నీ విన్నాడు.వింటూంటే

నిజమనే అనిపించింది. ఆ విషయం బాగా ఆలోచించి చూడగా తనలో కూడా కొంత లోప మున్నదనీ తను తెలియకుండా నే గో. కృష్ణయ్యకు సహకరిస్తున్నాననీ గ్రహించాడు.

"నేను నిప్పులాంటి దాన్ని. మీ మనసులో విషం పోయడానికీ రోజు వాడింత నాటకమాడాడు. వాడో దుర్మార్గపు వెధవ. వాడెంతమందికి ఎన్ని అపకారాలు చేశాడో లెక్క ఉండదు. ఎవడో వాణ్ని చంపుతానని బెదిరిస్తూ ఉత్తరం రాస్తే అది నేనేనని అనుమానించి నన్నిలా కట్టిపారేయాలని పథకం వేశాడు. వాడి సుఖం వాడు చూసుకున్నాడు కానీ నా జీవితం ఏమైపోతుందో నన్న బాధ లేదు. కట్టుకున్నందుకు మీరైనా నన్నర్థం చేసుకోరు. మీరు లేనప్పుడొచ్చి—తను నన్నుంచుకుంటా ననీ మీ కంటే బాగా చూసుకుంటాననీ తనతో వచ్చేయ మనీ వెధవ కూతలన్నీ కూస్తుంటాడు—మీ కారణంగానే అవన్నీ భరించాల్సొస్తోంది. ఇంక భరించలేను. చంపా లనుకుంటే నన్ను చంపేయండి........" అంది రామా యమ్మ.

సోమనాథం ఆవేశంతో పళ్ళు కొరికాడు. అతడి శరీరం ఉద్రేకంతో ఊగింది. అంతవరకూ తను చాలా పెద్ద తప్పు చేసినట్లు అతను గుర్తించాడు.

సోమనాథానికి ఆవేశం ఎక్కువ. ఇంత కాలం ఆ ఆవేశం భార్యమీదనే చూపిస్తూండేవాడు. ఇన్నాళ్ళకది ఓ పరాయి వ్యక్తిమీదకు తిరిగింది. "గోపాలకృష్ణయ్యా! నీకు భూమ్మీద నూకలు చెల్లిపోయాయిరా—" అంటూ అతను అస్పష్టంగా గొణిగాడు.

# 7

"జీవితంలో ఇంత పెద్ద షాక్ తింటానని అనుకోలేదు లక్ష్మీ!" అన్నాడు లక్ష్మి భర్త శంకర్.

లక్ష్మి కళ్ళు ఎర్రగా ఉన్నాయి. ఏడ్చి ఏడ్చి అవి బాగా ఉబ్బాయి. బుగ్గలనిండా కన్నీటి చారికలు—

"నేను పాపిష్టిదాన్ని—నన్ను చంపేయండి....—" అంది.

"అవన్నీ తర్వాత—ఏడుపు తగ్గించి ముందుగా చెప్పు-నేను విన్నది నిజమేనా?"

"నిజమే!...." అని మళ్ళీ బావురుమని యేడ్చింది లక్ష్మి.

"అయితే ఈ నిజాన్నెందుకు దాచిపెట్టేవు?" కోపంగా అన్నాడు శంకర్.

"దాచిపెట్టక—ఎవరికైనా చెప్పుకునే నిజంటండీ అది!" అంది లక్ష్మి.

"అన్నీ తెలిసిదానివి. పాపిష్టిదాన్ననీ, చంపేయమనీ అంటున్నదానివి—అనవసరంగా నా జీవితంలో ఎందుకు ప్రవేశించావ్? అప్పుడే చావలేకపోయావా?" విసుగ్గా అన్నాడు శంకర్.

"చావాలని అనుకున్నాను. కానీ బ్రతుకు తీపి ఆపింది—"

"ఆ బ్రతుకు తీపి నాకూ ఉంటుందని తెలియదా?"

"తెలుసండీ—అందుకే ఆ నిజాన్ని దాచి మీతో హాయిగా బ్రతకాలనుకొన్నాను. ఆ నిజం తెలియనంత కాలమూ మీరూ సంతోషంగానే ఉన్నారు—" అంది లక్ష్మి.

"నా బాధ నిజం తెలిసినందుకు కాదు. నువ్వా నిజాన్ని

దాచినందుకు...." అన్నాడు శంకర్.

ఉలిక్కిపడింది లక్ష్మి.

"అవును లక్ష్మీ! మనది అనుకూల దాంపత్యమనీ మనం ఒకరినొకరు అర్థం చేసుకున్నామనీ ఎంతో మురిసిపోతున్నాను నేను. వివాహానికి ముందు ఈ రహస్యం దాచడం పెద్ద తప్పు. మన సమాజాన్నిబట్టి అది కొంతవరకూ సహించవచ్చును. ఆ తర్వాత మనం వొకరినొకరు అర్థం చేసుకున్నాక యీ రహస్యం దాచడం ఇంకా పెద్ద తప్పు. అది నా సంస్కారానికి అవమానం. ఆ తప్పు నేను క్షమించలేను...."

"ఆ తప్పు బయటపడితే మనమధ్య అపార్థాలొస్తాయని భయపడ్డానండీ—" అంది లక్ష్మి.

"ఆ తప్పు ఎప్పటికీ బయటపడదన్న గ్యారంటీ వుంటే అది వేరే సంగతి. కనీసం వొక బ్లాక్ మెయిలర్ నిన్ను బాధిస్తున్నప్పుడైనా నాతో చెప్పకపోవడం—భరించలేని అవమానంగా ఉంది నాకు...."

"నన్ను మన్నించండి. మీ సంస్కారాన్ని నేను సరిగా అర్థంచేసుకోలేకపోయాను. నా అనుభవాన్నిబట్టి నాకు పురుషులంటే ఒక విధమైన అనుమానం, భయం పట్టుకున్నాయి" అంది లక్ష్మి.

"ఇంతకీ ఆ తప్పు ఎందుకు చేశావ్?"

"తప్పనుకొని చేయలేదు. పెళ్ళి చేసుకుంటానంటే మోసపోయాను...."

"ఎవరా ప్రబుద్ధుడు...."

"గోపాలకృష్ణయ్య...." అంటూ లక్ష్మి జరిగిన కథంతా చెప్పి—"ఈ రోజు నాదే మీకు ఫోన్ చేసి ఉండాలి. నేనేమైనా హత్యా ప్రయత్నంలో ఉన్నా

నేమోనన్న అనుమానంతో నామీద యిలా దెబ్బతీశాడు"
అంది.

శంకర్ పిడికిళ్ళు బిగిశాయి—"అయితే స్నేహితుడిగా నటిస్తూ నాతో యింతకాలమూ ఆడుకుంటున్నాడన్నమాట ఆ గోపాలకృష్ణయ్య....—" అన్నాడు ఆవేశంగా.

"ముందు ముందు నా చేత తన కష్టమర్సు ముందు కాబరే డ్యాన్సులు చేయిస్తానని కూడా వాడు నన్ను బెదిరించాడు...." అంది లక్ష్మి యేడుస్తూ.

"నీ అసహాయ స్థితిని అర్థం చేసుకున్నాను కానీ నా సంస్కారాన్ననుమానించినందుకు మాత్రం నువ్వంటే చాలా కోపంగా ఉంది. ఏది యేమైనా మన జీవితాల నీ స్థితికి తీసుకువచ్చిన ఆ గోపాలకృష్ణయ్య కింక మూడింది. ఉత్తరంలో రాసిన ప్రకారమే వాడు చస్తాడు. ఈ శంకర్ సంగతి వాడికి తెలియదు. తెలిసేక బ్రతకడు" అన్నాడు శంకర్.

# 8

గోపాలకృష్ణయ్య తనతో మాట్లాడి వెళ్ళేక రామనాథం యింట్లోంచి బయటకు వెళ్ళాడు.

అతనికి మనసు స్థిమితంగా లేదు. గో.కృష్ణయ్యతో సంభాషణ అతని మనసు పాడుచేసింది. కాసేపు అలా వీధులమ్మట తిరిగి ఓ గంట తర్వాత మళ్ళీ యింటి ముఖం పట్టాడు. యిల్లు చేరబోయే సందు చివరనుంచి తనింటి ముందు పోలీసుజీపు ఆగి ఉండడం చూశాడు. చటుక్కున అతను వెనకడుగు వేశాడు.

ఇంటి ముందు పోలీస్ జీపు యెందుకు ఆగింది? అది

తప్పక తనకోసమే అయుండాలి. తనకోసమే అయితే యిప్పట్లో తనమీద నేరాలేవీ లేవు. ఇది గోపాలకృష్ణయ్య పథకమే అయుండాలి. తను హత్య చేస్తానని బెదిరించినట్లు పోలీసుల కతగాడు చెప్పివుండాలి.

ఎవడో గోపాలకృష్ణయ్యకు వుత్తరం వ్రాసాడు చంపుతానని బెదిరిస్తూ. అది తనే రాశానని గోపాలకృష్ణయ్య అనుమానం. ఆ వుత్తరం చూపించి తన పేరు చెబితే పోలీసులు తనను కస్టడీలోకి తీసుకున్నా తీసుకుంటారు. తనకు గోపాలకృష్ణయ్య పైన పగ వున్నదని పోలీసులకు తెలుసు. పైగా ఫ్రెష్‌గా జైల్నుంచి వచ్చాడు.

రామనాధం శరీరం కుతకుతలాడింది. ఈ గోపాలకృష్ణయ్య క్షమించదగ్గ మనిషి కాడు. తడి గుడ్డతో గొంతులు కోసే యీ పరమ కిరాతకుణ్ని బ్రతకనివ్వడం దేశానికే క్షేమం కాదు. వాణ్ని చంపడం తన తక్షణ కర్తవ్యం.

అయితే తనపై పోలీసుల నిఘా వుంటుంది. ఏం చెయ్యాలి?

తను తప్పించుకుని తిరగలేడు. అది తనవల్ల కాదు కాబట్టి....

రామనాధానికి శివయ్య గుర్తుకొచ్చాడు.

శివయ్య రామనాధానికి జైల్లో పరిచయమయ్యాడు. యేదో దొంగతనం నేరంమీద ఆర్నెల్లు జైలు శిక్ష అనుభవించడానికి వచ్చాడు శివయ్య. ఇద్దరికీ అనుకోకుండా పరిచయమైంది. మంచి స్నేహం కూడా కలిసింది. రామనాథం తన దీన గాథ శివయ్యకు చెప్పుకుని – "నువ్వు అలాగే వచ్చావా జైలుకి!" అనడిగాడు.

శివయ్య నవ్వి "దొంగతనమంటే నాకు అవమానం.

చేస్తే దోపిడీ లేదా హత్య. డబ్బొచ్చుకుని ఈ పను చేస్తూంటూను. నాకు అన్ని సర్కిల్స్‌లోనూ మంచి పలుకుబడుంది. పోలీసోళ్ళమీద బాలిపడి అప్పుడప్పుడు చిన్న దొంగతనాల పేరున జైలుకొస్తూంటూను...." అన్నాడు.

అతను ప్రొఫెషనల్ మర్డరర్ అని అర్థమైంది రామునాథానికి.

"నాకు దొంగలన్నా, దొంగతనాలన్నా యిష్టంలేదు. నీతో పరిచయమయ్యాక పరిసరాలనుబట్టే దొర, దొంగ-అన్న పేర్లు వచ్చాయి తప్పితే-మనుషులంతా ఒక్కటే ననిపిస్తోంది. నువ్వు మురికిపేటలో వుంటూ దోపిడీలు చేస్తున్నావు కాబట్టి దొంగవయ్యావు. గోపాలకృష్ణయ్య మేడల్లో వుండి దోపిడీలు చేస్తూ దొరయ్యాడు...." అన్నాడు రామనాథం.

మాటల సందర్భంలో ఒకసారి-"నేను నీకు డబ్బు సాయం చేయలేనుగానీ కావాలంటే నీకో హత్య ఫ్రీకే చేసిపెట్టగలను...." అన్నాడు శివయ్య.

ఆ మాటలకే రామనాథం కలవరపడ్డాడు. హత్య గురించి అంత సులభంగా మాట్లాడుతున్న శివయ్యను చూసి భయపడ్డాడు కూడా. కానీ ఇప్పుడు హత్యగురించి పురికొల్పడానికి అతను శివయ్య వద్దకు పరిగెత్తాడు.

శివయ్య అతన్ని చూడగానే సాదరంగానే ఆహ్వానించాడు-"ఇదివరకు నాకు మాటిచ్చిన ప్రకారం ఓ హత్య చేసిపెట్టాలి. యిప్పుడైనా నేను బాగుపడితే నీకు ప్రతిఫలం ముట్టజెప్తాను. ప్రస్తుతానికేమీ యివ్వలేను...." అంటూ హడావిడిగా తన కోరిక బయటపెట్టాడు రామనాథం.

"సరే-అలాగే కానీ యెవర్నేమిటి?" అనడిగాడు శివయ్య.

"గోపాలకృష్ణయ్యను...."

శివయ్య ఉలిక్కిపడి "ఈ గోపాలకృష్ణయ్య యెవడో నాకంటే వెధవలాగున్నాడే-వీణ్నే చంపమని ఇంతవరకు ఇద్దరొచ్చారు. నువ్వు మూడో వాడివి-" అన్నాడు.

రామనాథం ఆశ్చర్యంగా - "యెప్పుడొచ్చారు - ఈ రోజునే"-అనడిగాడు.

"ఆహా ఈ రోజునే! ఒకడి పేరు సోమనాథం. చంపితే రెండువేలిస్తానని అడ్వాన్సుగా నాలుగొందలిచ్చాడు. రెండోవాడు శంకర్. వెయ్యి రూపాయలు అడ్వాన్సిచ్చాడు. చంపేక యింకో నాలుగువేలిస్తానన్నాడు. ఇప్పుడు నువ్వొచ్చావ్-వాటం చూస్తే వీడు పెద్ద కేడీలాగున్నాడు-" అన్నాడు శివయ్య.

రామనాథం శివయ్యకు జరిగినదంతా చెప్పి-"బహుశా ఆ ఉత్తరం రాసినవాడు వాళ్ళిద్దరిలో ఒకడయ్యుంటాడు" అన్నాడు.

"ఎవడైతే మనకెందుకులే - రేపు రాత్రికి వాడికి మూడింది. నాకు డబ్బొచ్చి మురుతోంది. నీకు సాయమూ చేయగలుగుతున్నాను...." అన్నాడు శివయ్య.

రామనాథం ఆశ్చర్యంగా యింటికి వెళ్ళాడు. ఇంటి ముందు జీపు లేదు కానీ యింట్లో పోలీస్ ఇన్స్పెక్టర్ వున్నాడు-

"మీరిప్పుడు యెక్కణ్ణించి వస్తున్నారు?"అన్నాడు ఇన్స్పెక్టర్.

"మనసు బాగా లేక శిఖులమ్మట తిరుగుతున్నాను" అన్నాడు రామనాథం.

"సరే. ఇకమీదట అలా తిరక్కండి. కొద్ది రోజుల పాటు మీరు యిల్లు కదలకూడదు. ఇల్లు కదిలితే మా అను మతి తీసుకుని వెళ్ళాలి. గుర్తుంచుకోండి-"

"ఎందుకు?"

"ఎందుకో మీకే తెలుసు. తెలియకపోతే తెలుసుకో వలసిన అవసరంలేదు. మేము చెప్పిన నియమం పాటించక పోతే మిమ్మల్నా దేవుడు కూడా రక్షించలేడు-"అంటూ లేచాడు ఇన్ స్పెక్టర్.

"దేవుడు నన్ను రక్షించడం మానేసి చాలా కాలమైంది ఇన్ స్పెక్టర్-" అని పేలవంగా నవ్వాడు రామనాథం.

ఇన్ స్పెక్టర్ కదిలి వెళ్ళగానే-"నీ మూలంగా ఎలాంటిల్లు యిలాగై పోయిందిరా-నలుగురిలో తలెత్తుక తిరగ లేకుండా వున్నాం-" అంటూ బాధపడ్డాడు రామ నాథం తండ్రి.

"దీనికంతకూ కారణం నేను కాదు నాన్నా-అగోపాల కృష్ణయ్య. దానికి వాడు అనుభవించక తప్పదు" అన్నాడు రామనాథం.

# 9

వ్యవహారాలన్నీ చూసుకుని యింటికి వెళ్ళేసరికి - "ఎక్కడున్నావన్నయ్యా నీకోసం వదిన చాలాప్రయత్నం చేసింది. వాళ్ళన్నయ్య వచ్చాడు. యేదో అర్జంటు పని వుందట. వదిన్ని తీసుకు వెళ్ళాడు," అంటూ గోపాల కృష్ణయ్య తమ్ముడు చెప్పాడు.

భార్య ఊళ్ళో లేదనగానే గోపాలకృష్ణయ్యకు కొండంత దిగులు కలిగింది. ఆ యింట్లో అతనితో మనస్ఫూర్తిగా మాట్లాడేది అతని భార్య చంప

ఒక్కటే! తన మనసులో యేం బాధలున్నా అతనామెకే చెప్పుకుంటాడు. ఆ రోజు అతను మానసికంగా బాగా అలిసిపోయాడు. తన జేబులోని వుత్తరం విషయం భార్యకు చెప్పుకుని నాలుగు ఓదార్పుమాటలు వినాలనుకున్నాడు. అతనిలోని మంచితనాన్ని గుర్తించి అతన్ని అమితంగా పొగిడేది చంప ఒక్కటే? మీ అంత మంచివాడిని చంపాలని యెవరనుకుంటారండీ, యెవరో సరదాకు రాసివుంటారని ఆమె ఒక్కముక్క అంటే అదతనికి నిజం కాకపోయినప్పటికీ కూడా సంతోషాన్ని కలిగిస్తుంది. మనస్ఫూర్తిగా అతని మంచితనాన్ని పొగిడేది చంప ఒక్కటే!

ఆ రాత్రి గోపాలకృష్ణయ్య వేదాంతానికి సంబంధించిన పుస్తకాలు చదివాడు. అందులో ఒకదానిలో - "నువ్వు మంచి పనులు చేసి చూడు. ప్రపంచమంతా నీకు జేజేలు పడుతున్నదనిపిస్తుంది. చెడ్డపనులు చేయి.అందరూ నీకు శత్రువులనిపిస్తుంది. నీ నీడను చూసి నువ్వు బెదరకుండా వుండాలంటే మంచిని నమ్ముకో-" అని రాసి వుంది.

ఆ వాక్యాలు గోపాలకృష్ణయ్యమీద బాగా పని చేశాయి. తను మంచిని నమ్మక, చెడ్డ పనులు చేయడం వల్లనే నీడను చూసి బెదిరే స్థితి వచ్చింది. అయితే తను నిజంగా నీడను చూసే బెదురుతున్నాడా? ఆ వుత్తరం తనకు రాసిందెవరు? యెవరో శత్రువు కాదా మరి!

మంచిని నమ్ముకున్నా నమ్మకపోయినా నీడను చూసి బెదరకూడదని అతను అనుకున్నాడు. మరుసటి దినం ఆయన యిల్లు కదలలేదు. ఎంతనమ్మకూడ దనుకున్నా ఆ వుత్తరం అతనికి భయం కలిగిస్తోంది.

నంప కనుకొలకుల్లో నీళ్ళున్నాయి.-"నువ్వు తోడుగా వుంటే నాకేభయమూ వుండదు. నువ్వు లేకపోతే నేను బ్రతకలేను-అంటూండేవారాయన. ఆఖరికి నేను లేనప్పు డిలా దారుణంగా హత్య చేయబడ్డారు-"

భర్త శవం వంక చూసి ఆమె దుఃఖాన్నాపుకోలేక పోతోంది. పోలీస్ ఇన్‌స్పెక్టర్ ఆమె తమాయించుకునే దాకా ఆగి-"నీ భర్తను చంపింది నెవడో ప్రొఫెషనల్ హంతకుడు. ఎవరైనా వాణ్ణిందుకు పురిగొల్పి వుండాలి. లేదా వాడే ఆయనమీద పగబట్టి వుండాలి. మీ సహకారం లభిస్తే హంతకుణ్ని పట్టుకునేందుకు శాయశక్తులా ప్రయత్నిస్తాం-" అంటూ ఒక వుత్తరాన్ని ఆమెకందించి "దీన్ని గురించి మీరేమైనా చెప్పగలరా?" అన్నాడు.

ఆ వుత్తరం చూస్తూనే ఆమె భోరున ఏడ్చింది. మాటలు రావడానికామెకు కాసేపు పట్టింది.

"మొన్న వుదయం ఈ వుత్తరం నేనే రాసి కవర్లో వుంచి ఆయన జేబులో పెట్టాను. మొన్న ఏప్రిల్ ఒకటి అని మీకూ తెలుసు గదా-ఆయన్ను యేప్రిల్ ఫూల్ చేయాలనుకున్నాను కానీ మా అన్నయ్య అనుకోకుండా రావడంతో ఆ విషయము చెప్పలేకపోయాను. యిప్పుడా యన నన్ను ఫూల్‌ని చేసి వెళ్ళిపోయారు...." అని బావురుమంది.

ఆమె సరదాకి రాసిన వుత్తరంలోని బెదిరింపు నిజంగా యెలా జరిగింది?

ఇన్‌స్పెక్టర్‌కు ఈ ప్రశ్నకు జవాబు స్ఫురించలేదు. అతనికి చంపపైన రవంత అనుమానం కూడా కలిగింది.

కానీ అతని పరిశోధన అలా ప్రారంభమైతే కేసు ఏ మాత్రమూ ముందుకు నడవదు.

భర్తకు భార్య నీడవంటిది. ఆ నీడ అతనితో పరాచిక మాడింది. దానికి గోపాలకృష్ణయ్య బెదిరాడు.

మహిళలకు ఈ కథ ఇచ్చే సందేశమేమిటంటే-మీ భర్త దుర్మార్గుడని ఏమాత్రం అనుమానమున్నా అతడితో ఇలాంటి పరాచికాలాడకండి. ఆ పరాచికాలే అతడి ప్రాణం తీయగలవు.

—: సమాప్తం :—

# లాల్ అండ్ జాన్
# కనిపించని కన్య

## 'సికిందర్'

జాన్ కారు వేగం తగ్గించి, సిగరెట్ అవతలకి విసిరి, వరుసగా కుడివేపు వున్న యిళ్ళకేసి చూడసాగాడు.

"వెల్, పార్ట్‌నర్! ఈ యిళ్ళను చూస్తే మన క్లయింట్ చాలా డబ్బు గలవాడిలా వున్నాడు. ఏమంటావు?"

జాన్ మాటలు విని, లాల్ దీర్ఘంగా ఆవులించాడు.

"అతనింకా మన క్లయింట్ కాదు. అతను యింటికి రమ్మన్నాడు. మనం వెళుతున్నాం. దట్సాల్."

"అతనేదైనా కేసు అప్పగిస్తే ఫీజు అడగడానికి మాత్రం మొహమాటపడకు!"

"ఎంతడగాలి?"

"పది."

"వేలా?"

"అక్షరాలు!"

"కేసు ఎలాటిదైనా నా ఫీజు నువ్వన్నంత కావాలా?"

"అవును. కావలసింది తీసుకోవడమెలాగో నాకు తెలుసు."

"ఆల్ రైట్, యిదే యిల్లు, ఆ పేయ్."

జాన్ కారా పేశాడు.

ఇద్దరూ దిగి ఆ యింటికేసి చూశారు. రెండంతస్తుల మేడ. చుట్టూ అయిదు అడుగుల ప్రహారీ గోడ. ఇంటి ముందు తోట. పోర్టికోలో కుక్క.

డిటెక్టివ్‌లను చూసి కుక్క మొరిగింది. దాని అరుపు విని యింటి యజమాని బయటకొచ్చాడు.

గేటుదగ్గర డిటెక్టివ్‌లను చూసి, పరుగులాంటి నడకతో వచ్చి గేటు తెరిచాడు.

"డిటెక్టివ్‌లా! అది మీ కారా? లోనికి రండి."

అతనికి యాభై యేళ్ళుంటాయి. లావుగా, పొట్టిగా వుండి, ఫుల్ సూటులో వున్నాడు.

డిటెక్టివ్‌లు లోనికెళ్ళారు.

"ఇందాక ఫోన్ చేసింది—మిస్టర్ ప్రతాపరావు మీరేనా?" అడిగాడు లాల్.

అతను తలూపాడు. "నేనే మిస్టర్ లాల్, ఉదయం లేస్తూనే నాదొక వింత అనుభవం!"

"ఏమిటది?"

"నా రివాల్వర్ మాయమైంది!"

"ఎలా?" జాన్ అడిగాడు.

"నా కూతురు దానితో అదృశ్యమైంది!"

"పేరేమిటి?"

"రోహిణి."

"ఎన్నేళ్ళు?"

"పదిహేడు."

"ఎలా వుంటుంది?"

"తెల్లగా, పొట్టిగా, తల్లిలా వుంటుంది."

"తల్లి ఎలా వుంటుంది?"

"ప్లీజ్ షటప్, జాన్!" కసిరాడు లాల్, "మిస్టర్ రావ్, లోనికి పదండి. వివరంగా మాట్లాడుకుందాం."

రావ్ డిటెక్టివ్‌లను యింట్లోకి తీసికెళ్ళాడు. హాల్లో కూర్చోబెట్టి, నౌకరుతో కాఫీ తెమ్మని చెప్పాడు. ఆ తర్వాత డిటెక్టివ్‌లవైపు తిరిగి, "మిమ్మల్నిక్కడికి పిలిచి శ్రమ కలిగించానా?" అనడిగాడు.

లాల్ అడ్డంగా తలూపాడు.

"మా శ్రమ మాట ఎలా వున్నా, రివాల్వర్‌తో మీ కూతురి అదృశ్యం మిమ్మల్నేమీ కంగారుపరచక పోవడం ఆశ్చర్యంగా వుంది!"

రావ్ నవ్వాడు. "ఆమెగురించి తెలిస్తే మీరలా ఆశ్చర్యపోరు."

"అంటే యింతకు ముందు కూడా అదృశ్యమైందా?"

"రెండుసార్లు-కానీ రివాల్వర్‌తో కాదు."

"అప్పుడు మీరేం చేశారు?"

"నేనేమీ చెయ్యలేదు."

"ఎందుకు ఆమె అంటే యిష్టం లేదా? లేక నిర్లక్ష్యమా?"

"రెండూ కావు. ఆమె నా యేకైక సంతానం. గారాబంగా పెంచాను. కానీ, యుక్తవయసు వచ్చి రెక్కలొచ్చాక యెవరూ యేమీ చేయలేరు. రోహిణి తనకా

వలసిన వ్యక్తిని స్వయంగా యెన్నుకుంది. వాడు త్త రౌడీ వెధవ! పోలీస్ రికార్డు కూడా వుంది. అలాటి వెధవలో ఆమె యేం చూసిందో నా కర్థంగాదు!"

"రౌడీలక్కూడా మనసు వుంటుంది." అన్నాడు జాన్.

"ఉండవచ్చు. కానీ, వాడ్ని ప్రేమించి రోహిణి నా అంతస్తునూ హోదానూ హీనపర్చింది! ఇలాటి ప్రేమకు విలువ యిస్తే బయట నా పరువు ప్రతిష్ఠ లేం కావాలి!"

"మీరామెను మందలించలేదా?"

"బెదిరించాను కూడా! కానీ ఆమె భయం అంటే యేమిటో మర్చిపోయింది. ప్రేమలోవున్న మహత్తు అదే నేమో నాక తెలియదు."

"అతనెవరు? మీరు చూశారా?"

"రెండుసార్లు చూశాను. ఇరవై రోజుల క్రితం వాడూ, ఆమే కలిసి, వీధి మలుపులో నాకెదురయ్యారు. వాడు నన్ను చూసి పారిపోయాడు. ఆ రోజే వాళ్ళ వ్యవహారం తెలిసింది. రోహిణిని నిలదీశాను. వాణ్ని ప్రేమిస్తున్నట్లు చెప్పలేదు గానీ, పరోక్షంగా అలాగే మాట్లాడింది. నేను వార్నింగ్ యిచ్చాను. మూడు రోజుల తర్వాత హఠాత్తుగా అదృశ్యమైంది. మర్నాడు తిరిగి వచ్చింది. యెవరో ఫ్రెండ్ దగ్గరి కెళ్ళినట్లు బుకాయించింది. సహించాను.

కానీ, వారం రోజులు తర్వాత మళ్ళీ అలాగే వెళ్ళి మరుసటి రోజు వచ్చింది. ఈసారి తిట్టి మంచి చెడూ వివరించాను. ఆమె నా మాటలు విన్నట్లే నటిస్తూ మళ్ళీ వాడితో తిరగసాగింది! మొన్న సాయంత్రం టాంక్ బండ్ మీద చూశాను. కోపం పట్టలేక వాడ్ని కొట్టబోయాను,

కానీ-బాగుండదని, మళ్ళీ యిప్పుడైనా ఆమెతో కనిపిస్తే రివాల్వర్‌తో షూట్ చేస్తానని వాడ్ని బెదిరించాను."

"అతని పేరేమిటి?"

"తెలియదు. వాడి గురించి యెక్కువ తెలుసుకునే ప్రయత్నం చెయ్యలేదు. వాడికి యిరవై యేళ్ళుంటాయి."

"ఆతనికి పోలీస్ రికార్డు వున్నట్లు మీ కెలా తెలుసు?"

"వాడ్ని చూస్తే అలాగే అనిపిస్తుంది."

"మంచిది. ఇంతకూ రోహిణి ఎప్పుడు వెళ్ళిపోయింది?"

"నిన్న వుదయం లేచి చూస్తే యింట్లో యెక్కడా లేదు. ఆమె నౌకరు రాకముందే, తెల్లవారుతుండగానే వెళ్ళిపోయింది...."

"మరి మమ్మల్ని ఇవాళ యెందుకు పిల్చారు?"

"ఆమె నిన్న కన్పించకపోతే అది రొటీన్ వ్యవహారమనుకుని ఆమె వచ్చాక అంతు తేల్చాలని వూరుకున్నాను. కానీ, ఈసారి ఆమె మామూలుగా గాక, నా రివాల్వర్‌తో వెళ్ళిందని ఈ వుదయం తెలుసుకున్నాను కాబట్టి మిమ్మల్ని పిల్చాను."

"ఆమె రివాల్వర్ తీసుకెళ్ళిందని మీకెలా తెలిసింది."

"బీరువాలో నా రివాల్వర్ లేదుగనుక! దాన్ని నేను బీరువాలో ప్రత్యేకంగా చేయించిన అరలో పెట్టి తాళం వేస్తాను. అందులో నా భార్య నగలుకూడా వుంటాయి. వాటితోబాటు నా రెండు ఉంగరాలు కూడా వున్నాయి. ఈ ఉదయం ఉంగరం మార్చుకుందామని అర తెరిచాను-రివాల్వర్ లేదు."

"కాబట్టి ఆమే తీసికెళ్ళిందనుకున్నారా?"

"అవును. మొన్న వాడ్ని బెదించాను—రివాల్వర్‌తో

షూట్ చేస్తానని. ఆ భయంతో ఆమె దాన్ని తీసికెళ్ళి పోయింది."

"కానీ, ఆమె భయం అంటే యేమిటో మర్చిపోయిందని మీరిందాకే అన్నారు."

"అవును. ఈ కుర్రకుంకల్ని అర్థం చేసుకోవడం చాలా కష్టం! ఎప్పుడెలా ప్రవర్తిస్తారో తెలుసుకోలేం."

"బీరువా తాళాలు ఆమెదగ్గరకెలా వెళ్ళాయి?"

"రాత్రి నిద్రించేటప్పుడు నా తలగడక్రిందే ఉంటాయి. మొన్నరాత్రి ఆమె తస్కరించి బీరువా తెరిచి వుంటుంది. రివాల్వర్ తీసుకుని తెల్లారి వెళ్ళిపోయింది...."

"మీ బెదిరింపును ఆమె అంత సీరియస్‌గా తీసుకుందా?"

"చెప్పలేను. కానీ, వాడు భయపడి వుంటాడు. రోహిణిని ఆ పనికి వాడే పురిగొల్పి వుంటాడు—"

"మీరు నిజంగా షూట్ చెయ్యాలనుకున్నారా?"

"అది వొట్టి బెదిరింపు మాత్రమే!...." నవ్వాడు రావ్.

"అయితే యిప్పుడు మమ్మల్నేం చేయమంటారు?"

"ఆమెని కనుక్కోవాలి. వాడ్ని భయపెట్టి దూరంగా తరమాలి. నా రివాల్వర్ తిరిగి అప్పగించాలి."

"ఈ దశలో మీరేం చేసినా మీ కూతురు మనసు మార్చుకోవడం కుదరదనుకుంటాను."

"దాని మనసుతో మీ కనవసరం! నేను చెప్పినట్లు చెయ్యండి చాలు. ఫీజు విషయంలో ముందూ వెనకా చూడను. నా క్కావలసింది దానికి తగ్గ ఫలితం!"

"మంచిది. పదివేల రూపాయలకు తగ్గ ఫలితం మీకు లభిస్తుంది" అన్నాడు జాన్.

లాల్ విస్తుపోయాడు. కానీ రావ్ యే మాత్రం చలించలేదు.

"రోహిణి ఫ్రెండ్స్ ఎవరు? మీకు తెలుసా?" జాన్ అడిగాడు.

"ఇద్దరు తెలుసు. అనిత, నీరజ."

"వారితో రోహిణికి కెలాంటి సంబంధాలున్నాయి?"

"అనిత సన్నిహితంగా వుంటుంది. నీరజ కూడా వుంటుందిగానీ జిడ్డులాంటిది—అంటుకుంటే వదలదు. ఆమెకు తనగురించి గొప్పలు చెప్పుకోవడం తప్ప యేమీ చేతగాదు!"

"అనిత?"

"ఆమె ఒక్కతే రోహిణి కుపయోగపడేది."

"ఏ విధంగా?"

"అన్నివిధాలా—అన్ని విషయాల్లోనూ."

"ఆమె యెక్కడ వుంటుంది?"

"ఆమె డాక్టర్ నాథ్ కూతురు. గాంధీనగర్‌లో వుంటారు...." అని అడ్రసు చెప్పాడు రావ్.

"ఆల్ రైట్, రోహిణికి బాయ్ ఫ్రెండ్స్ వున్నారా?...."

"ఆ రాడీ వెధవ బాయ్ ఫ్రెండ్ కాకపోతే యింకెవడు!"

"ఆతని విషయం అలా వుంచండి. యింకెవరైనా వున్నారా?"

"తెలియదు."

"రోహిణి ఫోటో వుందా?"

"లేదు."

"బస్ పాస్?"

"వుంది. కానీ యెక్కడ పెడుతుందో తెలియదు."

"నేనామె గదిని చూడవచ్చా?"

రావ్ తలూపాడు. ఇంతలో నౌకరు వచ్చాడు. రావ్ కాఫీ లందించి, "మేడమీద మెట్ల నానుకునే ఆమె గదివుంది. కాఫీ తాగి వెళ్ళండి" అన్నాడు.

అందరూ నిశ్శబ్దంగా కాఫీలు తాగాక జాన్ అక్కడ నుంచి లేచాడు.

లాల్, రావ్ వేపు తిరిగాడు. "మీ రివాల్వర్ కు పర్మిట్ వుందా?"

రావ్ తలూపి, లోనికెళ్ళి తీసుకొచ్చాడు. లాల్ దాన్ని పరిశీలించి వివరాలు వ్రాసుకున్నాడు.

"మిస్టర్ లాల్! ఇహ రోహిణి తిరిగివచ్చే నమ్మకం లేదు! పరిస్థితిని చూస్తే ఆమె శాశ్వతంగా నాకు దూరంగా వెళ్ళిపోయిందనిపిస్తో ంది—ఒక రౌడీ వెంట వని నమ్మి! ఆమె జాడ మీరెలా తెలుసుకుంటారు?"

"మా పద్ధతుల ద్వారా" అన్నాడు లాల్ సిగరెట్ వెలిగించి, "రోహిణికి తల్లి లేదా?"

"చనిపోయింది—రెండేళ్ళ క్రితం."

"ఐ. సీ. యిప్పుడు చెప్పండి. రివాల్వర్ లోడ్ చేసి వుందా?"

"అవును. నిండా గుళ్ళున్నాయి."

ఆ తర్వాత జాన్ వచ్చేవరకు లాల్, రావ్ వ్యక్తిగత విషయాలు అడిగి తెలుసుకున్నాడు.

## 2

గాంధీనగర్ లో డాక్టర్ నాథ్ యింటి ముందు కారాగగానే యింట్లోంచి మొత్తం నలుగురు పిల్లలు పరి

నెత్తి వచ్చారు. అంతా మూడు నుంచి తొమ్మిదేళ్ళ వయసువాళ్ళు. ఇద్దరు అబ్బాయిలు, ఇద్దరు అమ్మాయిలు.

కానీ మరో అమ్మాయి—ఆమె అనిత అని జాన్ పసిగట్టాడు-వరండాలోనే సందేహిస్తూ నిలబడింది. డిటెక్టివ్ లు పిల్లల్ని తప్పించుకొని వరండా చేరుకున్నారు. లాల్ జేబులోంచి ఆమెకో కార్డు తీసి అందించాడు. ఆమె దాన్ని చదివి ఉలికిపడింది.

"ఓ.హో! మీ రిక్కడకొచ్చారా?"

"అవును. రోహిణి గురించి మాట్లాడాలి."

అనిత ముఖం ఎర్రబడింది, "ఆమెకేమయ్యింది?"

"తెలియదు. నిన్నటినుంచి కనిపించడంలేదు."

"ఎక్కడికెళ్ళింది?" గాభరాగా అడిగిందామె.

"అది తెలుసుకోమని ఆమె తండ్రి కోరాడు. మేమిక్కడికొచ్చాం. ఆమె గురించి నీకేం తెలుసు?"

ఆమె ఆందోళనగా అటూ యిటూ చూసింది. ఆ తర్వాత లాల్ వైపు తిరిగి అంది: "రండి, లోనికెళ్దాం. మీకు చాలా విషయాలు చెప్పాలి."

డిటెక్టివ్ లు ఆమెను అనుసరించారు. గదిలోకెళ్ళాక ఆమె తలుపుమూసి కూర్చోబెట్టింది.

"నాకేమీ అర్థంకావడం లేదు! రోహిణి ఈ మధ్య వింతగా ప్రవర్తిస్తోంది. కాలేజికి సరిగా రావడం లేదు. ఆ రోమియో దీపక్ గాడితో స్నేహం కుదిరి నప్పటి నుంచీ మారిపోయింది .... .... లాల్ గారూ, మరొక విషయం...."

"ఏమిటది?"

"రోహిణి మత్తుపదార్థాలకి అలవాటు పడిందని నా అనుమానం,"

లాల్, ఎర్రబడ్డ జాన్ ముఖం చూసి, తిరిగి అనితను చూశాడు.

"ఆశ్చర్యంగా వుంది. మీకెలా అనుమానం వచ్చింది?...."

"ఒకసారి ఆమె పర్సులో తెల్లటి పదార్థం చూశాను—చిన్న ప్లాస్టిక్ సంచీలో. అది నమ్మకంగా మత్తుపదార్థమే!"

"మీరామెను అడగలేదా?"

"అడిగితే చెప్పలేదు. రెండు నెలల నుంచి ఆమె దీపక్‌తో తిరుగుతోంది. దీపక్ మంచివాడు కాదు. వాడికో ముఠా, రహస్యపు కలాపాలూ చాలా వున్నాయి. రోహిణిని నేను హెచ్చరించాను. వినిపించుకోలేదు. చివరికి తండ్రికి తెలిసినా భయపడలేదు! ఈ మధ్య రెండుసార్లు యిల్లు విడిచి వాడితో వెళ్ళింది."

"ఎక్కడికి?"

"వాళ్ళ గోడవున్‌కి. దాన్ని ఈ మధ్యే అమ్మేశారు. కూకట్‌పల్లి ప్రాంతాల ఎక్కడో వుంది.... నాకు సరిగా తెలియదు."

"ఆ గోడవున్ ఆమె తండ్రిదా?"

"అవును. చాలాకాలంగా ఖాళీగావుండేది. ఈ మధ్య ఆఫర్ వస్తే అమ్మేశారు."

"ఆ రెండుసార్లు రోహిణి అక్కడ కెళ్ళిందా?"

"అవును. ఆ గోడవున్ దీపక్ తన స్థావరంకోసం ఎన్నుకున్నాడనుకుంటాను. రోహిణి గురించి నాకు చాలా బెంగగా వుంది! ఆమెకు తల్లి లేదు. తండ్రికి వ్యాపారంలో తీరికలేదు. ఆమె గురించి పట్టించుకునే వారెవరూ లేరు. అందుకే ఆమె అలా తయారైంది."

"సరే, యీసారి కూడా ఆమె అక్కడికే వెళ్ళిందను కుంటాను...."

"ఆమె వెళ్ళిందని మీరు చెప్పేవరకు నాకు తెలియదు. రాత్రి ఆమెకు ఫోన్ చేశాను—యెవరూ పలకలేదు—"

"ఎవరూ పలకలేదా?"

"అవును. మూడుసార్లు ఫోన్ చేశాను. రెస్పాన్స్ లేదు."

"ఎన్ని గంటలకి?"

"వర్షం వెలిశాక. సుమారు తొమ్మిదిన్నరకు."

"ఐసీ! గోపిణి దీపక్‌తో వెళ్ళింది గనుక ఆమె యింట్లో లేదు. ఆమె తండ్రి ఒక్కడే వుంటాడు. అతను రెస్పాన్స్ యివ్వలేదంటే ఆ సమయంలో బయట కెళ్ళి వుంటాడు........ నే నొకసారి మీ ఫోన్ ఉపయోగిస్తాను...."

లాల్ లేచి ఫోన్ అందుకుని డయిల్ చేయసాగాడు.

ఆ తర్వాత, "హల్లో, లాల్ స్పీకింగ్!" అన్నాడు.

వెంటనే రావ్ పలికాడు, "యేమిటి మిస్టర్ లాల్?...."

"కూకట్‌పల్లిలో మీకు గోడవున్ వున్నట్లు తెలుసుకున్నాను—"

"గాడ్! ఎలా తెలుసుకున్నారు! ఇప్పుడది నాదికాదు. అమ్మేశాను."

"ఎవరికమ్మారు?"

"తెలియదు. అంతా మిస్టరీ! ఆ పార్టీ ఎవరో తెలియదు. బ్రోకర్స్ ఎవరో కూడా తెలియదు. రెండు నెలల క్రితం వచ్చి ఆ దిక్కుమాలిన కొంపకు నలభై వేలు విలువకట్టాడు!

నా కాశ్చర్యమేసింది. చాలా కాలంగా ఆ యిల్లు నిరుప యోగంగా వుంది. సిమెంట్ ఏజెన్సీ వున్నప్పుడు అందులో పైర కోటా నిలువచేసేవాడిని. ఇప్పుడా యేజెన్సీ వదులు కోవడంతో ఆ యిల్లు శిథిలమైంది. అందుకే కళ్ళు మూసు కుని అమ్మేశాను. స్పాట్ క్యాష్! అంతా నిముషాల్లో జరిగిపోయింది. అప్పటికప్పుడే అతను ఆ డబ్బు చెల్లిం చాడు. రిజిస్ట్రేషన్ అవసరం లేదన్నాడు. ఆ లావా దేవీల్లో వ్యక్తుల పేర్లు గుప్తంగా వుంటాయన్నాడు....."

లాల్ ఆలోచించాడు.

"ఆ యిల్లు ఎక్కడుందో చెప్తారా?"

రావ్ అడ్రసు చెప్పి, "ఇప్పుడివన్నీ యెందుకు?" అన్నాడు.

"తర్వాత చెప్తాను. నిన్న రాత్రి మీ రెక్క డున్నారు?....."

"వర్షం కురిసింది—ఇంట్లోనే వున్నాను."

"ఏం చేశారు?"

"నిద్రపోయాను—వర్షం ప్రారంభమైన అరగంటకు. వర్షం ఎనిమిది గంటలకు ప్రారంభమైంది."

"మీ యింట్లో ఫోన్ ఎక్కడుంది?"

"నా బెడ్ ప్రక్కన."

"రాత్రి మీ కేవైనా ఫోన్ కాల్స్ వచ్చాయా?"

"లేదు."

"మీరు నిద్రపోయాక 9-30 ప్రాంతాల మీ బెడ్ ప్రక్కన మూడుసార్లు ఫోను మ్రోగింది."

"ఏమిటీ!"

"అవును. మీకు మెలుకువ ఎందుకు రాలేదు?"

"నాకేమీ అర్థం గావడంలేదు! రాత్రి ఫోను మ్రోగ

లేదు! ఎవరు చెప్పారు?"

"అనిత. సాధారణంగా ఫోన్ రింగయితే మీరు నిద్ర మేల్కొంటారా?"

"యాదృచ్ఛికంగా మేల్కొంటాను!"

"అయితే నా కొక్కటే తోస్తోంది! రాత్రి మూడు సార్లు అనిత ఫోన్ చేసినా మీకు మెలకువ రాలేదంటే, మీరు యింట్లో లేరని అర్థం."

తక్కున రిసీవర్ పెట్టేసి అనితవేపు తిరిగాడు లాల్.

"థాంక్స్ మిస్ అనితా! మీరు చాలా విషయాలు చెప్పారు!"

# 3

జాన్ కారు స్టార్టు చేశాక లాల్ సీట్లో వెనక్కి వాలి అన్నాడు: "కూకట్‌పల్లి పోనివ్వు. మిస్టర్ రావ్ పెద్ద గ్రంథం నడుపుతున్నాడు."

"ఏం చేశాడు?"

రావ్‌తో ఫోన్ సంభాషణ వివరించి చెప్పాడు లాల్.

"అయితే కూతురు యెక్కడికెళ్ళిందో లాల్‌కి తెలుసు! రాత్రి అతను వర్షం వెలిశాక గోడవున్ వెళ్ళివుండాలి. అక్కడ దీపక్ ముత్తాలో-లాల్-రోహిణి రివాల్వర్ తీసుకెళ్ళిందని నీ కన్పిస్తోందా?"

"ఇప్పుడన్పించడం లేదు."

"లాల్ ఈ ఫోటో చూడు!" జేబులోంచి రోహిణి బస్‌పాస్ తీసి చూపించాడు జాన్. "ఆమె గదిలో టేబిల్ సొరుగులో దొరికింది. ముఖం చూస్తే అలాంటి పని చేస్తుందనిపించడం లేదు. డ్రగ్ ఎడిక్టు! అనిత చెప్పింది నిజమేనా?"

"ఆమె గదిలో యింకేం కనుక్కున్నావు?"

"ఏమీ లేదు. ఆమె రహస్య కలాపాలు సాగిస్తోంది కాబట్టి తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ తీసుకుంది. మనం యిప్పుడామె దగ్గర కెళ్తున్నాం. అక్కడామె వుండవచ్చు. అయితే, అనిత చెప్పినట్లు అది దీపక్ సావరమైతే అతని ముఠాతో తలపడే అవకాశం వుంది....మనదగ్గర రివాల్వర్స్ లేవు."

"ఆఫీసుకెళ్ళి తీసుకుందాం. కానీ ఆ అవసరం లేదనుకుంటాను. నిన్న రాత్రి రావ్ అక్కడికి కెళ్ళాడు. అక్కడేదో జరిగింది....రావ్‌కు కూతురి ఆచూకీ, తను అమ్మిన ఇంటి మిస్టరీ తెలిసిపోయింది గనుక-ఇప్పుడక్కడ యెవరూ వుండరు. అంతా పారిపోతారు, రావ్ పోలీస్ రిపోర్టు యిస్తాడన్న భయంతో."

"ఆల్ రైట్. రావ్ అక్కడకెళ్ళివుంటే తప్పక రివాల్వర్ తీసుకెళ్ళాడు. మరి కూతురు తీసుకెళ్ళిందని యెందుకు అబద్ధం చెప్పాడు?"

"అక్కడేదో అనుకోనిది జరిగివుంటుంది. రివాల్వర్ మాయంచేసి అలా చెప్పాడు."

"షూటింగ్?" అడిగాడు జాన్.

లాల్ మాట్లాడలేదు. తీవ్రంగా ఆలోచనల్లో పడ్డాడు.

కారు యేజెన్సీ ఆఫీసు చేరుకున్నాక జాన్ వెళ్ళి రివాల్వర్ తీసుకొచ్చాడు. తిరిగి బయలుదేరి కూకట్‌పల్లి ప్రయాణమయ్యారు. ప్రయాణమంతా తీవ్రమైన ఆలోచనలతో, నిశ్శబ్దంగా సాగింది.

కూకట్‌పల్లి దాటాక, బొంబాయి హైవేమీద రెండు కిలోమీటర్ల దూరంలో, యెడమవైపు పెద్ద మర్రిచెట్టు

ప్రక్కన రెండంతస్తుల పాతబడ్డ చిన్న మేడ ఒకటి వుంది.

మేడ చుట్టూ విశాలమైన ఆవరణ, దాని చుట్టూ ప్రహరీ గోడ, ముందు భాగంలో గేటు వున్నాయి. ఇంట్లోకి యెక్కడా యెలక్ట్రిక్ తీగలు వెళ్ళడంలేదు గనుక యింటికి కరెంటు సదుపాయం లేదు. ఆవరణలో పిచ్చి మొక్కలు గుబురుగా పెరిగివున్నాయి. హైవేకూ, యింటికి మధ్య దూరం వంద అడుగులు వుంటుంది.

ఇంటి పరిసరాలన్నీ రాళ్ళూ రప్పలతో నిండి వున్నాయి. వెనుక భాగమంతా సువిశాలమైన మైదానం.

ఇంటికి కొంచెం దూరంలో కారు దిగి నడిచారిద్దరూ. సమయం పన్నెండు కావస్తోంది. ఎండలేదు. ఆకాశ మంతా నల్లటి మేఘాలు కమ్ముకొని వర్షం కురిపించడానికి సిద్ధంగా వున్నాయి.

గేటు చేరుకుని ఆగారు. ఇంట్లో యెక్కడా అలికిడి లేదు. కానీ, తలుపు ప్రక్కనుంచి పైకి వెళ్ళే చెక్క మెట్ల దగ్గర ఒక పాత నార్టన్ మోటార్ సైకిల్ ఆగి వుంది. తలుపుకు తాళం వేసివుంది. అద్దాల కిటికీలు మూసి వున్నాయి. పైనకూడా తలుపూ, కిటికీలూ మూసి వున్నాయి. యెక్కడా శబ్దం లేదు.

లాల్ నెమ్మదిగా గేటు తెరిచి లోనికి నడిచాడు. క్రితం రాత్రి వర్షం కురవటంవలన నేల మెత్తగా వుంది. అడుగులు దిగబడుతున్నాయి. అప్రయత్నంగా లాల్ దృష్టి నేలమీద పడింది. అక్కడ కారు టైరు గుర్తులు యింటి వైపుకు వెళ్తూ, తిరిగి వస్తూ కన్పిస్తున్నాయి. ఛటుక్కున తప్పుకుని వాటిని జాన్‌కు చూపించాడు.

జాన్ వాటిని చూసి, చెక్క మెట్లనుంచి యింటికి

యెడమవైపు వెళ్తున్న అడుగుజాడల్ని చూపించాడు. ఇద్దరూ వాటిని అనుసరించివెళ్ళారు.

ఆ అడుగుజాడలు మూప్పై అడుగులదూరం వెళ్ళి ఒక చిన్న రాళ్ళకుప్పదగ్గర అంతమయ్యాయి. అక్కడ నిలబడి చుట్టూ దృష్టిని సారించాడు లాల్. జాన్ మేడమీద కిటికీ అద్దాన్ని చూపించాడు. కిటికీ అద్దంలో చిన్నరంధ్రం కన్పిస్తోంది.

లాల్ చిటికెలేసి చకచకా యింటికేసి నడిచాడు. కాస్సేపట్లో యిద్దరూ చెక్కమెట్లద్వారా పైకి చేరుకున్నారు. మేడమీద గది తలుపు ఓరగా వేసివుంది. కాసేపు సందేహించి దానిమీద చప్పుడు చేశాడు.జవాబు లేదు. నెమ్మదిగా నెట్టాడు. కిర్రుమంటూ తెరుచుకుంది....

అప్పుడు లాల్ లోపలి దృశ్యం చూసి ఒక్క అడుగు వెనక్కి వేశాడు. జాన్ ముందుకొచ్చి లోనికి తొంగి చూశాడు.

గదిలో నేలమీద ఒక శవం వెల్లకిలా పడివుంది. దాని తల కుడి పార్శ్వ భాగంలో చిన్న రంధ్రం, తలచుట్టూ గడ్డకట్టిన రక్తం స్పష్టంగా కన్పిస్తున్నాయి....

## 4

క్రైం ఇన్‌స్పెక్టర్ బాలకృష్ణన్ ఠీవీగా కారు దిగి ముందుకొచ్చాడు:

"హల్లో, ఫ్రెండ్స్! మీ వృత్తితో ఇది యెన్నో శవం?"

"మేం శవాల్ని లెక్కించం. వాటి ఆత్మకు న్యాయం చేకూరుస్తాం." అన్నాడు జాన్.

"ఓ. కే. శవం చెప్పే కథ ఏమిటి?"

"పదండి చూద్దాం....ఇక్కడ టైర్ ప్రింట్స్ అడుగు

జాడలున్నాయి. అవి చెడిపోకుండా మీరంతా ఒక లైనులో మార్చ్ చేస్తే...."

డిటెక్టివ్‌ల వెనుక కృష్ణన్, ఇద్దరు ఫోటోగ్రాఫర్లు, ఫింగర్ ప్రింట్ యక్స్‌పర్టు, మేడమీదకు చేరదీశారు.

గదిలోకెళ్ళాక కృష్ణన్ శవాన్ని చూసి, "ఇంకా కుళ్ళలేదు.... వాతావరణంలో తేమ యెక్కువ వుండటం అందుక్కారణం" అన్నాడు.

ఫోటోగ్రాఫర్ వివిధ కోణాల్లో శవాన్ని ఫోటోలు తీశాడు. ఆ తర్వాత డాక్టర్ శవాన్ని పరీక్షించాడు.

"తలలో బులెట్ గాయమైంది. మరణం నిన్న రాత్రి యెప్పుడో సంభవించింది. సమయం కచ్చితంగా యిప్పుడే చెప్పలేను. కానీ, ఈ రిస్టువాచీని చూస్తే 8:50 కి ఆగి పోయి వుంది. బహుశ ఈ సమయంలోనే చావు సంభ వించి వుండవచ్చు."

లాల్ వంగి చేతికి వున్న గడియారంవంక చూశాడు. దాని అద్దం పగిలిపోయివుంది. ముళ్ళు 8-50 చూపిస్తు న్నాయి.

"కానీ-గడియారం రాత్రి ఆ సమయానికి ఆగిపోయిం దని నమ్మకమేమిటి? నిన్న పగలు ఆగిపోయి వుండవచ్చు. లేదా, ఈ వుదయం హంతకుడు దాన్ని చితగ్గొట్టి వుండ వచ్చు" అన్నాడు కృష్ణన్.

"అవును. మూడు సంభవాలున్నాయి. సరయిన సమా ధానం మనకు యితర ఆధారాలవల్ల దొరుకుతుంది." అన్నాడు లాల్.

"గడియారం విషయం యెలావున్నా, రిగర్ మార్టిస్‌ని బట్టి చావు నిన్న రాత్రి సంభవించిందని చెప్పగలను. శవం పూర్తిగా రంగు మారింది." అన్నాడు డాక్టర్.

"వెరీ వెల్! ఇప్పుడు యితర ఆధారాల్ని చూద్దాం" లేచి గదిని కలియజూశాడు లాల్.

గదిలో దీపక్ శవం పడమరవైపువున్న కిటికీకి ఆరడుగుల దూరాన పడివుంది. తల కిటికీవైపు కాళ్లు మంచంవైపు వున్నాయి: తూర్పు-పడమర దిశల్లో. నవారు మంచంమీద దుప్పటి చెదిరిపోయివుంది. మంచం ప్రక్కన చిన్న స్టూలు, స్టూలుమీద లాంతరు వున్నాయి. లాంతరు ఆరిపోయివుంది. కానీ వొత్తి తగ్గించిలేదు. జాన్ దాన్ని కదిపిచూసి,నిండా నూనె వున్నట్లు తెలుసుకున్నాడు.

గది ఉత్తరంవైపు గోడలో షెల్ఫు లున్నాయి. అందులో ఒక సూట్ కేసు, దానిలో ఒక జత ప్యాంటు, షర్టూ, యితర టాయిలెట్ వస్తువులూ వున్నాయి.

పడమరవైపు వున్న కిటికీ తలుపులు లోపలినుంచి గడియపెట్టివున్నాయి. దాని యెడమవైపు రెక్క అద్దంలో సరిగ్గా మనిషి యెత్తు స్థానంలో ఒక రంధ్రం వుంది. రంధ్రం చుట్టూ సుమారు 3. సెం. మీ. ల వరకు పగుళ్ళు వ్యాపించి వున్నాయి.

జాన్ ఆ రంధ్రంలోంచి సూటిగా బయట ఆవరణలో రాళ్ళకుప్పలకేసి చూశాడు. హంతకుడు అక్కడ నిలబడి షూట్ చేసి వుండాలి.

ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్టు గదిలో వస్తువులన్నిటి మీదా పౌడరు జల్లి స్నాప్స్ లాగుతున్నాడు. జాన్ ఒక ఫోటోగ్రాఫర్‌ని పిలిచి కిటికీ రెక్కల్ని ఫోటోలు తీయించాడు.

ఈ లోపు లాల్ కేసుగురించి కృష్ణన్‌కు వివరించాడు. డాక్టర్ శవం జేబులు వెదికి ఒక సిగరెట్ ప్యాకెట్,

కర్ఛీఫ్ తీశాడు. ఆ తర్వాత శవాన్ని స్ట్రెచర్ మీద అంబులెన్స్‌లో తరలించి దానితో వెళ్ళిపోయాడు.

లాల్ మెట్లు దిగి క్రిందికి వచ్చాడు. అతన్ని అందరూ అనుసరించారు. లాల్ యింటి ముందు టైర్ ప్రింట్స్ చూపించి వాటిని ఫోటోలు తీయమన్నాడు.

"కృష్ణన్ ఈ గుర్తులు రావ్ కారు వసుకుంటాను. మీరు చెక్ చెయ్యండి. నిన్న రాత్రి వర్షం యెప్పుడు ప్రారంభ మైంది?"

"ఎనిమిది గంటలకు. తొమ్మిది ప్రాంతాల వెలిసింది."

"అయితే నిన్న వర్షం వెలిశాక యిక్కడికి కారు వచ్చింది." అన్నాడు లాల్.

"వర్షం వెలిశాక అని మీకెలా తెలుసు?"

లాల్ అన్నాడు:

"వర్షం కురవకముందు కారు వస్తే, ఆ తర్వాత వర్షం కురిస్తే గుర్తులు కొట్టుకుపోతాయి. వర్షం కురుస్తున్నప్పుడు వచ్చినా కొట్టుకుపోతాయి. ఈ విషయంలో నేల స్వభావం పరిశీలించాలి. బంక నేల అయితే వర్షం కురిసినా గుర్తులు కొట్టుకుపోవు. కానీ ఇది యెర్ర నేల. ఈ మట్టికి జిగురు స్వభావం లేదు. ఇసుకపాలు యెక్కువ వుంది. కాబట్టి వర్షం కురిస్తే గుర్తులుండవు. అందువల్ల గుర్తులు చెక్కుచెదరకుండా వుండాలంటే వర్షం వెలిశాక కారు రావాలి."

"అయితే వర్షం కురుస్తున్నప్పుడు హత్య జరగలేదా?"

"తెలియదు. డాక్టర్ రిపోర్టుకోసం యెదురు చూద్దాం." లాల్ ముందుకు నడిచాడు, "ఇక్కడ

చూడండి: ఈ అడుగుజాడలు ఆడవాళ్ళ హీల్స్ చెప్పులవి. ఇవికూడా వర్షం వెలిశాకే యేర్పడ్డాయి. వీటిలోతు సుమారు అంగుళం వుంది. జాగ్రత్తగా చూడండి: హీల్ భాగం మాత్రం అంగుళం దిగబడింది. మిగతా భాగం కొద్దిలోతుకే వుంది. ఈ జాడల్ని ఫోటోలు తియ్యండి. కొలతలు తీసుకోండి. వీటిలో యేదో ప్రత్యేకత వుంది..."

ఈ చెప్పులు ధరించిన మనిషి నడకలో యేదో వుద్దేశ్యం స్పష్టమవుతోంది. నేల స్వభావం అంతటా ఒకేలా వున్నా, అడుగుజాడలన్నీ ఒకేలా లేవు.లోతుగా లేని జాడల్ని మినహాయించి మిగతా వాటిని పరిశీలిస్తే ఈ చెప్పులు ధరించిన వ్యక్తి కావాలని, బుద్ధిపూర్వకంగా కాళ్ళు నేలకేసి కొడుతూ నడిచి వుండాలి...."

"అంటే హంతకుడు తనను పట్టించే సాక్ష్యాన్ని స్వయంగా సృష్టించుకుంటాడా!"

"ఆధారాల్ని బట్టి అలాగే అన్పిస్తోంది.... ఓహ్! యేమిటి దీని అర్ధం? తిరిగి వస్తున్నప్పుడు జాడలు యేవి!"

కృష్ణన్, జాన్‌లు వులిక్కిపడి చూశారు. ఆ అడుగు జాడలన్నీ రాళ్ళకుప్పవేపుకు వెళుతున్నాయిగానీ, తిరిగి వస్తున్నట్లు లేవు.

"వెల్! నాకిప్పుడొక్కటే తోస్తోంది...." అన్నాడు లాల్, "ఈ అడుగు జాడలు రోహిణి చెప్పులవి. రాత్రి వర్షం కురుస్తున్నప్పుడు హంతకుడు కార్లో యిక్కడికి కొచ్చాడు. కారు శబ్దంవిని రోహిణి బెదిరిపోయి దాక్కుంది. హంతకుడు కారు దిగి రాళ్ళకుప్పలవైపు నడిచాడు. అప్పుడు వర్షం పడుతోందని మరువకండి. అందు వల్ల అతని అడుగుజాడలు యేర్పడలేదు.

అతను రాళ్ళకుప్ప మీద నిలబడి మేడమీదకు

చూశాడు. అప్పుడు దీపక్ వచ్చిండేమోనని తెలుసుకోవడానికి కిటికీదగ్గర నిలబడి చూస్తున్నాడు. అతని వెనక స్టూలుమీద లాంతరు వుంది. దాని వెలుగువల్ల అతని నీడ కిటికీ అద్దంమీద పడుతోంది. కాచుకున్న హంతకుడు ఆ నీడను గుర్తించి రివాల్వర్‌తో షాట్ చేశాడు...."

"ఆ తర్వాత?"

"దీపక్ నేలకూలడంతో రోహిణి భయపడి లాంతర్ వూది ఆర్పేసింది. గది చీకటయింది. ఆమె ఆ గదిలో బిక్కుబిక్కుమంటూ గడిపింది. హంతకుడు వెంటనే రాళ్ళ కుప్పదగ్గరినుంచి తిరిగివచ్చి కార్లో కూర్చున్నాడు. అతని జాడలు వర్షంలో కొట్టుకుపోయాయి. అతని గురిమీద నమ్మకం వుంది కాబట్టి పైకివెళ్ళి దీపక్‌ని చూడలేదు. వర్షం తగ్గేవరకు కార్లోనే గడిపి, అప్పుడు బయలుదేరి వెళ్ళిపోయాడు....అందుకే కారు టైర్ల గుర్తులేర్పడ్డాయి."

"ఆ తర్వాత?"

"కారు వెళ్ళిపోయాక రోహిణి అక్కడ నుంచి పారిపోవాలనుకుంది. ఆమె క్రిందకువచ్చి పరుగుతీసింది.... తిన్నగా గేటువేపుకు కాకుండా, ఈ దిశలో పరిగెత్తి ఆ చివరి గోడ దూకి పారిపోయింది. అప్పుడు వర్షం లేదు. గనుక ఆమె అడుగు జాడలేర్పడ్డాయి."

"పొరపాటు, లాల్! చాలా పొరపాటు!" జాన్ అన్నాడు. "నువ్వన్న దాన్నిబట్టి వర్షం కురుస్తున్నప్పుడు కారు వచ్చి ఆగింది-వర్షం వెలిశాక వెళ్ళిపోయింది. అప్పుడు కారు వచ్చినప్పటి గుర్తుల ప్రసక్తే వుండదు గనుక వెడుతున్నప్పటివే వుండాలి! అంటే రెండు ట్రాక్స్ వుండాలి. కానీ అక్కడ నాలుగు ట్రాక్స్ వున్నాయి."

లాల్ ఆలోచించాడు. "దటీజ్ రైట్, వర్షం వెలిశాకే కారు వచ్చింది."

"వెరీ గుడ్! ఈ అడుగుజాడలు ఆ గోడవరకు వుంటాయి. లెటజ్ గో!" అన్నాడు జాన్.

ముగ్గురూ కదిలి వెళ్ళారు. ఆ రాళ్ళకుప్పనుంచి ప్రహరీ గోడ వరకూ అన్నీ పిచ్చి మొక్కలు పరుచుకుని వున్నాయి. కానీ నేలమీద అడుగుజాడ లేర్పడలేదు.

ముగ్గురూ నలిగిన మొక్కల ననుసరించి గోడదగ్గరికి చేరుకున్నారు. అక్కడకూడా అడుగుజాడలు లేవు. గోడ అయిదడుగుల ఎత్తు వుంది. జాన్ గోడయెక్కి అవతలికి చూశాడు. అవతల కూడా గుబురుగా మొక్కలున్నాయి—గోడ మీకడంవలన ఒక చోట విరిగిపోయి వున్నాయి.

"ఆమె యీ దిశలో పారిపోయి గోడెక్కిందన్నది మాత్రం నిశ్చయం. కానీ, అడుగుజాడలు లేవు. ఈ మొక్కల్లో పరిగెడితే చెప్పులు జారిపోతాయనుకుని వాటిని చేతిలో పట్టుకొని వురికింది" అన్నాడు జాన్.

"ఇంతకూ ఆమె యెక్కడికెళ్ళినట్లు?" అడిగాడు కృష్ణన్.

"సురక్షితమైన స్థలానికి. తిరిగి యింటికెళ్ళలేదు. అంటే హంతకుడు ఆమెను పట్టుకుంటాడని భయపడిందా? ఈ హత్య రావ్ చేసి వుంటే—ఆ విషయం ఆమెకు తెలిసేకూడా యింటికి వెళ్ళదు."

"రావ్ యిక్కడకొచ్చాడో లేదో తెలుసుకోవాలంటే టైర్ ప్రింట్స్ చెక్ చెయ్యాలి. ఆ పని నేను త్వరగా చేస్తాను" అన్నాడు కృష్ణన్.

"మంచిది. యిక్కడ మీ పని ముగించుకుని రండి. మేం వెళ్తాం" అన్నాడు లాల్.

# 5

ప్రతాపరావు డిటెక్టివ్‌లను చూసి పరిగెత్తి వచ్చి, "ఏమిటి? ఏం జరిగింది?" అనడిగాడు.

లాల్ అతన్ని సూటిగా చూశాడు. "ఏమీ జరగ లేదా?"

"నాకేం తెలుసు! ఏం జరిగిందసలు?"

"రాత్రి మీ యింటికి 9-30 ప్రాంతాల్లో మూడు సార్లు ఫోన్ వచ్చింది. కానీ మీకు మెలుకువ రాలేదు? మీ రబ్బర్దం చెప్తున్నారు. రాత్రి వర్షం వెలిశాక మీ రింట్లో లేరు. కారులో కూకట్‌పల్లీ వెళ్ళారు. అక్కడ గోడవున్‌లో మీ కూతురు వున్నట్లు తెలుసుకున్నారు. అక్కడితో ఆమె వ్యవహారానికి చుక్క పెట్టాలను కున్నారు. రివాల్వర్‌తో ఆమె ప్రేమికుడ్ని అన్న మాట ప్రకారం షూట్ చేసి తిరిగివచ్చారు."

"గాడ్! రోహిణి వాడితో అక్కడి కెళ్ళిందా?"

"మీకు తెలియదా? ఈ ఉదయం మాకు ఆమె ప్రేమి కుడు దీపక్ శవం అక్కడ దొరికింది. మీ కూతురి జాడ లేదు."

"ఓహ్! నాకేమీ తెలియదు! నేనక్కడికి వెళ్ళ లేదు!"

"మరి ఫోన్‌కు జవాబెందుకివ్వ లేదు?" అడిగాడు లాల్.

"రాత్రి నాకసలు మెలుకువ రాలేదు! కానీ— కానీ"

"ఏమిటి?"

"నేను రాత్రి 8-30కు నిద్రపోయాను. నిద్రపోక ముందుగా గ్యారేజి తలుపులు చప్పుడు చేసినట్లు వినిపించింది."

"ఎందుకు చప్పుడు చేశాయి? గాలి వీచిందా? మీరు తాళం వేశారా?"

"తాళం వేశాను. బహుశ గాలికి కొట్టుకున్నాయను కుంటాను...."

"కారు అందులోనే వుందా?"

"అవును."

"ఆ తర్వాత ఏం విన్నారు?"

"ఏమీ లేదు.... ఉరుములు మెరుపులతో రాత్రంతా అల్లకల్లోలంగా వుంది."

"గ్యారేజి తలుపు శబ్దంవిన్నాక మీ కేం అనిపించింది? ఎవరైనా కారు తీస్తున్నారనుకున్నారా?"

"అలాగే అనిపించింది...."

"ఆ శబ్దం విని మీరేం చేశారు?"

"కిటికీదగ్గరకొచ్చి బయటికి చూశాను. ఏమీ కనిపించ లేదు."

"ఎందుకు?"

"కిటికీ అద్దంమీద వర్షపుజల్లు పడుతోంది. బయటంతా చీకటి! నా గదికూడా చీకటిగా వున్నా బయటి దృశ్యా లేమీ కనిపించలేదు. అయినా నా పిచ్చిగానీ, కారెవరు తీసికెళ్తారు?"

"ఆల్‌రైట్, రాత్రి మీరే దుస్తుల్లో నిద్రపోయారు?"

రావ్ ముఖం ఆకస్మాత్తుగా ఎర్రబడింది. "లుంగీ— షర్టు."

"చూపించండి."

రావ్ సందేహించాడు.

"ఏమిటి సందేహం?"

రావ్ ఉలిక్కిపడి చూశాడు. "గాడ్! ఏమిటిదంతా! నేను కలలోకూడా వూహించని సంఘటనలు జరుగుతున్నాయి!"

"ఇప్పుడేం జరిగింది?"

"నా లుంగీకి బురద అంటి వుంది!"

లాల్ తల తిప్పి జాన్‌ని చూడు. జాన్ చిన్నగా నవ్వాడు.

"ఎలా అంటింది?" లాల్ అడిగాడు.

"అదే తెలియడంలేదు! మిస్టర్ లాల్, ఇప్పుడీ హత్య నా మెడకు చుట్టుకుంది! నన్ను నమ్మండి, నేనేమీ చెయ్యలేదు!"

"మీరేమీ చెయ్యకపోతే లుంగీ చూపించండి."

రావ్ తడబడుతున్న అడుగులతో వెళ్ళి బీరువాలోంచి లుంగీ షర్టు తెచ్చాడు.

లాల్ వాటిని అందుకుని చూశాడు. లుంగీ మధ్యభాగంలో రెండు పెద్ద బురద మరకలున్నాయి. అవి మోకాలిచిప్పల వల్ల యేర్పడ్డాయి - అంచులకూడా మరకలున్నాలు. షర్టు శుభ్రంగా వుంది. లాల్ రెండిటినీ వాసన చూశాడు. అవి తడిసిన సూచనలు కన్పించలేదు.

"ఆ మరకలెలా యేర్పడ్డాయో తెలియడంలేదు!" అన్నాడు రావ్ ఆందోళనగా. అతని ఆందోళన కృత్రిమంగా తెచ్చిపెట్టుకున్నది కాదు. ఈ సంఘటనలన్నీ అతన్ని నిజంగా కలవరపరుస్తున్నట్లు కళ్ళు చెబుతున్నాయి.

"రాత్రి నేను సుఖంగా నిద్రపోయాను. మధ్యలో మెలుకువ రాలేదు. తెల్లారి ఆలస్యంగా లేచాను - ఏడు గంటలకు. బెడ్ మీద లేచి కూర్చొని హఠాత్తుగా ఈ మరకల్ని చూశాను. నాకేమీ పాలుపోలేదు! రాత్రి నేను బయటకు అసలు వెళ్ళలేదు!"

"అయితే మీ లుంగీని యెవరో దొంగిలించారు." అన్నాడు జాన్.

"ఏమిటీ!"

జాన్ తల తిప్పి లాల్‌ని చూశాడు-ఏదేనా పొరపాటు జరిగిందేమోనని.

కానీ లాల్ అన్నాడు: "అవును. మీరు అబద్ధం చెప్పకపోతే రెండు సంభవాలున్నాయి-లుంగీని యెవరో దొంగిలించారు. లేదా మీరు స్లీప్ వాకింగ్ చేశారు."

"ఓహ్! ఏమిటీ విపరీతం! నా లుంగీ దొంగిలించారా! నన్ను నగ్నం చేసి-మైగాడ్-నా పరువు!-"

జాన్ పగలబడి నవ్వాడు. లాల్ కూడా శృతి కలిపాడు.

"ఆ అవకాశం లేదంటూరా?"

"అసంభవం! నాకు మెలుకువరాదా?"

"మీకు క్లోరోఫాం ఇస్తే?"

"అసలు యింట్లోకి వచ్చే అవకాశం యెవరికీ లేదు!"

లాల్ అన్నాడు:

"అయితే నిద్రలో లేచి మీరే బయటికెళ్ళారు. మీరు మానసిక రోగి. స్లీప్ వాకింగ్‌కి అలవాటు పడ్డారు. రాత్రి మీరు నిద్రావస్థలో డ్రైవ్ చేసుకుంటూ గోడవున్ వెళ్ళారు. అక్కడ దీపక్‌ని షూట్ చేసి తిరిగి వచ్చారు. గోడవున్ దగ్గర టైర్ ప్రింట్స్ వున్నాయి.

అవి మీ కారువేనని నా నమ్మకం. అయితే ఇప్పుడు చెప్పండి: రివాల్వర్ యెక్కడ పెట్టారు?"

"డామ్ హెల్! ప్లీజ్ గెటవుటాఫ్ హియర్!"

గొంతు చించుకుని అర్చాడు రావ్.

# 6

రాత్రి తొమ్మిదిగంటలకు డిటెక్టివ్‌లు కృష్ణన్ ఆఫీసుకు చేరుకున్నారు.

"వాటె వండర్ఫుల్ జాబ్! ఈ కేసు తేలిపోయింది!" అన్నాడు కృష్ణన్.

"ఎలా?" లాల్ అనుమానంగా అడిగాడు.

కృష్ణన్ నవ్వి, బ్రీఫ్ కేసులోంచి ఒక రివాల్వర్ తీసి టేబిల్ మీద పెట్టాడు. డిటెక్టివ్‌లు దాన్ని ఆశ్చర్యంగా చూశారు. దాని బ్యారెల్ పూర్తిగా చితగ్గొట్టబడి వుంది.

"ఈ రివాల్వర్ రాళ్ళకుప్పలో దొరికింది-యాదృచ్ఛికంగా. ఫోటోగ్రాఫర్ అడుగుజాడల్ని స్నాప్ తీస్తూ రాళ్ళకుప్పలో నల్లగా మెరుస్తున్న వస్తువును చూశాడు. వెంటనే రాళ్ళు కెలికి ఈ రివాల్వర్‌ను బయటకి తీశాడు. బుల్లెట్స్ లేవు. అన్నీ ప్రేల్చబడ్డాయి. ఖాళీ షెల్స్ తొలగించి దీన్ని చితగ్గొట్టి హంతకుడు రాళ్ళలో దాచాడు. కానీ నంబర్ చెక్కు చెదరలేదు. దీని ట్రేస్ చేసి ప్రతాపరావుదని తెలుసుకున్నాను. పైన ప్రింట్స్ కూడా రావ్ కారువేనని యెక్స్‌పర్టు ధృవపర్చాడు."

లాల్ ముఖం యెర్రబడింది.

"ఆశ్చర్యంగా వుంది! రోహిణి అడుగుజాడలు వెళుతున్న దారిలో ఈ రివాల్వర్ దొరకడమేమిటి?"

"రావ్ హత్యను ఆమె మీదకు మళ్ళించాలనుకున్నాడేమో?"

"మెడికల్ రిపోర్టు ఏమంటోంది?"

"హత్య నిన్న రాత్రి 8.00—9.00 మధ్య జరిగింది. కచ్చితంగా చెప్పాలంటే హతుడిచేతికి వున్న గడియారాన్ని బట్టి 8.50 కి జరిగింది. వాతావరణ విభాగం నుంచి వివరాలు సంపాదించాను. నిన్నిరాత్రి వర్షం జంట నగరాల చుట్టూ 10 కి. మీ. ల పరిధిలో కురిసింది. సరిగ్గా 8.05 కు ప్రారంభమై 9.07 వరకు 9 సెం. మీటల వర్షం కురిసింది. కాబట్టి హత్యాస్థలంలో నేలలో ఏర్పడిన గుర్తులన్నీ వర్షం వెలిశాకే యేర్పడ్డాయి. కానీ హత్యమాత్రం వర్షం కురుస్తున్నప్పుడే జరిగింది."

"బాలస్టిక్ రిపోర్టు?"

"హత్య జరిగింది ఈ రివాల్వర్ తోటే. కిటికీ అద్దంలో బుల్లెట్ రంధ్రం కూడా దీని క్యాలిబర్ దే."

"వేలిముద్రలు?"

"రెండు రకాలవి దొరికాయి. మొదటివి హతుడివి. రెండవది-ఇంకా తేలలేదు. బహుశ రోహిణివి కావచ్చు. రివాల్వర్ మీద వేలిముద్రలు లేవు."

"ఇంటిముందు మోటార్ సైకిల్ వుంది. అదెవరిది?"

"రిజిస్ట్రేషన్ దీపక్ కుమార్ పేరుతో వుంది."

"దీపక్ కుమార్ చరిత్రేమిటి?"

"చెప్పుకోదగ్గ చరిత్ర—క్రైంబ్రాంచ్ ఫైల్సులో వున్నాడు. దొంగనోట్ల కేసులో మూడేళ్ళు జైల్లో వుండి ఆర్నెల్ల క్రితం తిరిగివచ్చాడు.అప్పటినుంచి కంప్లెయింట్స్ లేవు."

"హత్య జరిగిన యింటిని పూర్తిగా సోదా చేశారా?...."

కృష్ణన్ తలూపాడు, "మేడమీద, క్రిందా మొత్తం గాలించాం. క్రింద యిల్లు ఖాళీగా వుంది. పైన గది మీరు చూశారు."

"సరే, హంతకుడు మొత్తం ఆరు గుళ్ళు ప్రేల్చాడు. దాని శబ్దం హైవేమీద గానీ, పరిసరాల్లోగానీ ఎవరికీ విని పించలేదా?"

"వినిపించలేదనుకుంటాను. రెండు కారణాలున్నాయి. ఒకటి: పరిసరాలన్నీ రెండు కిలోమీటర్ల వరకూ నిర్జనంగా వున్నాయి. హైవేమీద ఆ సమయానికి వాహనాలేమీ వుండకపోవచ్చు. రెండు: రాత్రంతా ఉరుములు, మెరుపులతో పరిసరాలన్నీ ప్రతిధ్వనించాయి. రివాల్వర్ షాట్స్ ఎవరికీ వినిపించే అవకాశంలేదు."

లాల్ నిట్టూర్చి అన్నాడు:

"ఓకే! ఈ రివాల్వర్ సమస్యను మరింత క్లిష్టం చేసింది. హత్య చేసి హంతకుడు రివాల్వర్‌ను రాళ్ళలో దాచాడు. బాగానే వుంది. అయితే రోహిణి ఆ రాళ్ళ కుప్పవైపుకే పరిగెత్తి ఎందుకు పారిపోవాలి? కాకతాళీయమా? లేక యీ హత్య ఆమే చేసిందా? రాళ్ళకుప్ప మీద నిలబడి, దీపక్‌ను షూట్ చేసి, మిగతా బుల్లెట్స్ గాల్లో ప్రేల్చి, రివాల్వర్‌ని రాళ్ళలో దాచి పారి పోయిందా? ఆ తర్వాత రావ్ స్లీప్ వాకింగ్ చేస్తూ కార్లో వచ్చాడా?"

"ఇందులో వొక వీక్ పాయింట్ వుంది" జాన్ అన్నాడు.

"ఏమిటది?"

"ఇంతవరకు హత్య చేసింది హంతకుడనుకున్నాం. కానీ నువ్విప్పుడు హంతకురాలంటున్నావు. సౌలభ్యం కోసం యిక్కడ 'హంతకుడు'గానే వ్యవహరిద్దాం."

"వెల్! హంతకుడు రాళ్ళమీద నిలబడి కిటికీ అద్దం మీద దీపక్ నీడకేసి షూట్ చేశాడు. అంతమాత్రాన బుల్లెట్ దీపక్‌కు తగిలిందా? హంతకుడు ఎలా నమ్మాడు? నీడను చూసి షూట్ చేస్తే లక్ష్యానికి తగలాలని లేదు. లక్ష్యం దీపానికి ఎంత కోణంలో, యే ఎత్తులో, యెంత దూరంలో వుందో కచ్చితంగా అంచనా వెయ్యందే బుల్లెట్ తగలడం అసంభవం. మరి యీ కేసులో హంతకుడు ఒక్కటే బుల్లెట్ షూట్ చేశాడంటే, అది తగిలిందని నమ్మి మిగతా బుల్లెట్స్ గాల్లో ప్రేల్చాడా?"

లాల్ అడ్డంగా తలూపాడు. "లేదు. నీడకేసి షూట్ చేశాక అతను మేడమీదకు వురికాడు—అనుమానం తీర్చుకునేందుకు. అప్పుడు దీపక్ సజీవంగా వుంటే మరో బుల్లెట్‌తో చంపేవాడు. కానీ ఆ అవసరం లేకుండా అతని మొదటి షాట్ ప్రాణాలు తీసింది. అప్పుడు లాంతర్ వూదేసి, క్రిందికి వచ్చి, మిగతా బుల్లెట్స్ గాల్లో షూట్ చేశాడు."

"ఆల్‌రైట్. మరి టైర్ ప్రింట్స్ గురించేమిటి? మెడికల్ రిపోర్టు ప్రకారం హత్యా సమయాన్నిబట్టి చూస్తే హత్య వర్షం కురుస్తున్నప్పుడు జరిగింది. కానీ కారు వర్షం వెలిశాక వచ్చిందని ఆధారాలు చెప్తున్నాయ్. దీన్నిబట్టి నాకు రెండే రెండు అవకాశాలు కనిపిస్తున్నాయి. డాక్టర్ రిపోర్టు తప్పు. హత్య వర్షం వెలిశాక జరిగింది. రివాల్వర్ గురించి రావ్ స్టేట్‌మెంటులో వాసవ ముంది. దాన్ని రోహిణి తీసికెళ్ళింది. రాత్రి దీపక్‌తో

ఆమెకు తగవు వచ్చింది. దీపక్ ఆమెను తరిమివేశాడు. ఆమె బయటికివచ్చి రాళ్ళకుప్పమీద నిలబడి దీపక్ నీడను షూట్ చేసింది. ఆ బుల్లెట్ దీపక్‌కు తగలడం కేవలం యాదృచ్ఛికం. రోహిణి మిగతా గుళ్ళు గాల్లో ప్రేల్చి రివాల్వర్ రాళ్ళలో దాచి వెళ్ళిపోయింది. ఆ తర్వాత రావ్ కార్లో వచ్చి రోహిణి అంతు తేల్చాలని పైకి వెళ్ళాడు. కాని అక్కడ దీపక్ శవాన్ని చూసి కిక్కురు మనకుండా తిరిగి వచ్చేశాడు."

లాల్ సాలోచనగా తలూపి అన్నాడు:

"రావ్ పైకి వెళ్ళాలంటే కారు దిగాలి. అంటే పైరు ప్రింట్సుతో బాటు అతని అడుగుజాడలు కూడా వుండాలి. కాని లేవు. కాబట్టి అతను కారు దిగలేదు— నిద్రావసలో అలా డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళి యిలా తిరిగి వచ్చేశాడు. దట్సాల్. ఇక రెండవ అవకాశ మేమిటి?"

జాన్ అన్నాడు, "హత్య వర్షం కురుస్తున్నప్పుడే జరగాలి—అంటే డాక్టర్ రిపోర్టు సరయినది. రావ్ అదే వర్షంలో అక్కడికెళ్ళాడు. కాని కారును రోడ్డు మీదే మార్గంగా ఆపాడు. లేకపోతే దాని శబ్దానికి పిట్ట లెగిరిపోవచ్చు. అతను వర్షంలో కాలినడకన వెళ్ళి రాళ్ళ కుప్ప చేరుకొని దీపక్ నీడను షూట్ చేశాడు. ఆ తర్వాత మిగిలిన బుల్లెట్స్ గాల్లో ప్రేల్చాడు. రివాల్వర్‌ను డ్యామేజి చేసి, రాళ్ళలో దాచి తిరిగి వచ్చేశాడు. వర్షం వెలిశాక కారును యింట్లోకి పోనిచ్చి, తిరిగి బయిటికి తెచ్చి వెళ్ళిపోయాడు. అలా చేస్తే హత్య వర్షం వెలిశాక జరిగిందని భావిస్తారని అతని ఉద్దేశ్యం కావచ్చు."

"కాని రివాల్వర్‌ను పోలీసులకు సులభంగా దొరికే

చోట యెందుకు దాచాడు? గోపిీణి అదే మార్గంలో పరిగెత్తడానికి కారణమేమిటి?" కృష్ణన్ అడిగాడు.

జాన్ యేదో తీవ్రంగా ఆలోచించి, "హత్యాస్థలంలో తీసిన ఫోటోలు చూపించండి....!" అని గబుక్కున అన్నాడు.

అతని కళ్ళు మెరుస్తున్నాయి.

కృష్ణన్ వికమకపడుతూ ఫోటో లందించాడు.

లాల్ అన్నాడు. "రాత్రి రావ్ తొడుక్కున్న దుస్తుల్ని పరిశీలించాను. లుంగీకి బురద మరకలున్నాయి. అనుమానంతో అతని కారు గ్యారేజిని చెక్ చేశాను. తలుపుదగ్గర అతను జారిపడినట్లు గురకలు చెప్తున్నాయి. బట్టలు తడిసిలేవు. అంటే అప్పుడు వర్షం వెలిసిందికాబట్టి అతను వర్షం తగ్గాక గోడవున్ కెళ్ళాడు. కానీ అక్కడ కారు దిగకుండానే తిరిగివచ్చేశాడు. అంటే అతను మనసు మార్చుకొని వుండాలి, లేదా స్లీప్ వాకింగ్ చేసి వుండాలి."

ఫోటోల్ని చూస్తున్న జాన్ అకస్మాత్తుగా, "యురేకా! గుడ్ ఆయిడియా!" అని అరిచాడు.

"ఏమిటి?" కృష్ణన్ అడిగాడు.

"కిటికీ అద్దంలో బుల్లెట్ రంధ్రం బయటినుంచి యెందుకు కేర్పడాలి? లోపలి నుంచి యెందుకు కాకూడదు?...."

## 7

అప్పటికి సమయం రాత్రి ఒంటిగంటయింది. డిటెక్టివ్ లు తిరిగి ఏజెన్సీ ఆఫీసుకొచ్చారు.

ప్రొఫెసర్ సాడర్ మాన్ — 'మోడరన్ క్రైమ్

యిన్వెస్టిగేషన్' గ్రంథంలో 217వ పేజీ తీసి చూపించాడు జాన్.

"ఈ చిత్రం చూడు. అద్దంలో బుల్లెట్ దూసుకెళ్ళినప్పుడు యేర్పడే పగుళ్ళను సూచిస్తుంది—బుల్లెట్ వెళ్ళే దిశతో సహా. ఆ తర్వాత ఈ చిత్రం గురించి వివరణ చదువు. బుల్లెట్ అద్దాన్ని 90 డిగ్రీల కోణంలో తాకినప్పుడు యేర్పడే పగుళ్ళన్నీ దాదాపుగా ఒకే పరిమాణంలో వ్యాపించి వుంటాయి. ఆ కోణం తగ్గుతున్న కొద్దీ బుల్లెట్ యే దిశలో తాకితే దానికి పైవైపు పగుళ్ళ పరిమాణం క్రిందివాటికంటే ఎక్కువ వుంటుంది."

లాల్ తలూపాడు.

"ఆ తర్వాత ఈ కిటికీ అద్దాన్ని తీసిన ఫోటో చూడు. ఈ రంధ్రం చుట్టూ పగుళ్ళన్నీ ఒకే సైజులో వ్యాపించి వున్నాయి. దాదాపుగా అంటే బుల్లెట్ సుమారు 90 డిగ్రీల కోణంలో తాకిందన్నమాట."

"అవును."

"ఈ రంధ్రం బయటినుంచి యేర్పడివుంటే 90 డిగ్రీల సమీపకోణంలో వుండదు. ఎందుకంటే హంతకుడు ముప్ఫై అడుగుల దూరాన, ఈ కిటికీకి సుమారు పాతిక అడుగుల క్రింద నిలబడి షూట్ చేశాడు. కాబట్టి, జామెట్రీ లెక్కల ప్రకారం బుల్లెట్ అద్దాన్ని తాకిన కోణాన్ని సుమారు 50 డిగ్రీలుగా అంచనా వేయవచ్చు.

ఈ కోణంలో బుల్లెట్ తాకితే రంధ్రానికి పైవైపు పగుళ్ళన్నీ పొడవుగా వ్యాపించి వుండేవి. కానీ అలా జరగలేదు. అంటే బుల్లెట్ ఆ కోణంలో తాకలేదు. దానికి దాదాపు రెట్టింపు కోణంలో తాకింది. కోణం పెరిగితే హంతకుడు నిలుచున్న ఎత్తు కూడా పెరగాలి.

ఈ రంధ్రంచుట్టూ పగుళ్ళనిబట్టి చూస్తే ఆ ఎత్తు కిటికీకి సమానంగా వుంటుంది. అంటే బుల్లెట్ ప్రయోగించిన మనిషి గదిలోపల వుండాలి."

లాల్ మళ్ళీ తలూపాడు.

జాన్ అన్నాడు, "ఆ తర్వాత ఈ ఫోటోలో శవం ఏం చెబుతోందో చూడు. తల కిటికీవైపు, కాళ్ళు మంచం వైపు. తలలో బుల్లెట్ రంధ్రం. బుల్లెట్ తలలో దూరితే చావడానికి క్షణం పట్టదు. అందులోనూ .38 కాలిబర్ బుల్లెట్ దూరితే చావు వూహించలేనంత వేగంగా కబళిస్తుంది. అంటే హతుడు వున్నచోటే కుప్పకూలిపోతాడు. ఈ కేసులో బుల్లెట్ కిటికీలోంచి వచ్చివుంటే దీపక్ వెనక్కి విరుచుకుని పడిపోయేవాడు. అంటే తల మంచం వైపు—కాళ్ళు కిటికీవైపు. కానీ అలా జరగలేదు. కిటికీకి ఆరడుగుల దూరంలో శవ స్థితి పూర్తిగా వ్యతిరేకంగా వుంది."

"దటీజ్ రైట్!"

"ఆ తర్వాత మరొక పాయింట్. బుల్లెట్ బయటి నుంచి వచ్చివుంటే గదిలో గాజుపెంకులు పడాలి. కానీ గదిలో గాజుపెంకులు లేవు."

లాల్ తలూపాడు. "యూ ఆర్ కరెక్ట్."

"ఈ ఆధారాలు చాలు—కిటికీ అద్దంలో బుల్లెట్ రంధ్రం బయటినుంచి కాకుండా లోపలినుంచి యేర్పడిందని తెలుసుకోవడానికి. అదెలా యేర్పడిందో చెప్తాను. వర్షం కురుస్తున్నప్పుడు దీపక్ కిటికీలోంచి రాళ్ళకుప్ప దగ్గర ఆగంతకుడ్ని చూశాడు. దీపక్‌కు అతను పోలీసో, లేక డిటెక్టివో అయివుంటాడన్న అనుమానం వచ్చింది.

అతనిదగ్గర రివాల్వరుంది. ప్రమాదాన్ని తప్పించడానికి ఆ ఆగంతకుడికేసి కిటికీ అద్దంలోంచి షూట్ చేశాడు. కానీ గురి తప్పింది. దీపక్ లాంతర్ వెలుగులో నిలబడి వున్నాడు. బయట చీకట్లో స్పష్టంగా చూడలేడు.

"బుల్లెట్ గురి దప్పడంతో ఆగంతకుడు అక్కడ నుంచి తప్పుకుని మేడమీదకు వురికి, హఠాత్తుగా దాడి చేసి దీపక్‌ను షూట్ చేశాడు."

"పోలీసులూ, డిటెక్టివ్‌లూ అలా షూట్ చెయ్యరు" అన్నాడు లాల్.

"అయితే అతను ఎదురు ముఠాకు చెందిన దీపక్ శత్రువు కావచ్చు. కానీ హత్య రావ్ రివాల్వర్‌తో జరిగింది, కాబట్టి ఆ ఆగంతకుడు రావ్ కావాలి" జాన్ అన్నాడు.

"నీ కథనం బాగానే వుందిగానీ, కొంత సవరణ చెయ్యాలి" అన్నాడు లాల్, "రావ్ ఆ ఇంటికి వెళ్లాడు నిజమే. కానీ హత్య చేయలేదు. హత్యకు అనుగుణంగానే థియరీ ఆలోచించినా దానికి దుస్తుల కథ అన్వయించదు. రావ్ నిర్దోషి అనడానికి అతని దుస్తులు చక్కటి ఎక్స్‌ప్లనేషన్.

"అతను హత్యాస్థలానికి వర్షంలో వెళ్ళి వుంటే పూర్తిగా తడిసిపోయి వుండేవాడు. అంతేగాక గ్యారేజి దగ్గర అతను జారిపడ్డ మరకలు కొట్టుకుపోయేవి."

"అతను తిరిగివచ్చాక జారి పడివుండవచ్చు. అప్పుడు వర్షం లేదు" అన్నాడు జాన్.

"ఓ. కే. తిరిగివచ్చాకే పడ్డాడనుకుందాం. మరి దుస్తుల విషయమేమిటి? నువ్వన్నట్లు అతను గోడ్డుమీద

కారాపి వర్షంలో నడిచివెళ్ళి షూట్ చేస్తే పూర్తిగా తడిసిపోతాడు. తిరిగి వచ్చి ఆవే దుస్తుల్లో నిద్ర పోతాడా?"

"రెయిన్ కోటు తొడుక్కున్నాడేమో? లేకపోతే ఆ దుస్తులు తీసేసి—అతను బయటి కెళ్ళాడుగనుక పేంటు, షర్ట్‌లో వుండాలి—వాటిని తీసేసి లుంగీ, మరో షర్టు తొడుక్కొని, కారు గ్యారేజిలో పెడుతూ జారి పడ్డాడేమో?"

లాల్ జుత్తు పీక్కున్నాడు.

"మరి రాళ్ళకుప్పలో రివాల్వర్‌కు ఎక్స్‌ప్లనేషన్ యేమిటి? రావ్ దాన్ని అక్కడ ఎందుకు దాచాడు? అన్ని జాగ్రత్తలు తీసుకున్న మనిషి రివాల్వర్‌ను హత్యాస్థలంలో ఎందుకు పారేశాడు? దీపక్ కిటికీ లోంచి షూట్ చేశాక, రావ్ మేడమీదకు వురికి షూట్ చేస్తే, అక్కడేవున్న రోహిణి యేం చేసింది? తక్షణం పారిపోలేదా? పారిపోతే వర్షంలో ఆమె అడుగుజాడలెలా ఏర్పడ్డాయి? చెప్పు పార్ట్‌నర్!"

లాల్ అరుపులు విని జాన్ నెమ్మదిగా లేచి లోనికెళ్ళిపోయాడు. రెండు నిమిషాల తర్వాత భూటాన్ విస్కీ, గ్లాసులతో తిరిగివచ్చాడు.

"రిలాక్స్ పార్ట్‌నర్. ఒక హత్యను పరిశోధించబోయి మరో హత్య చేసేలా వున్నావు—నన్ను! ఈ విస్కీ తాగి విశ్రాంతి తీసుకో! రేపు ఆలోచిద్దాం."

జాన్ అందించిన గ్లాసందుకొని గడగడ తాగేసి సిగరెట్ వెలిగించాడు లాల్.

"ఈ వ్యవహారం యిప్పుడే తేలిపోవాలి....! రోహిణి

అడుగుజాడలు, రాళ్ళకుప్పలో రివాల్వర్—వీటివల్ల నీకేమర్థమవుతోంది?"

"వర్షం వెలిశాక రోహిణి పారిపోయిందని. కానీ, రివాల్వరే వున్న దిశలోనే ఎందుకు వురికిందో అర్థం కావడంలేదు!"

"యెందుకు వురికిందంటే ఆమె వురక లేదు—గనుక!"

"అదేమిటి? పిచ్చిగా మాట్లాడుతున్నావు! విస్కీ-"

లాల్ తటాలున లేచి కిటికీదగ్గర కెళ్ళాడు. ఒక క్షణం బయటకు చూసి గిరుక్కున వెనక్కి తిరిగాడు..

"అవును, జాన్. రాళ్ళకుప్పవైపు రోహిణి యెందుకురకాలి? ఆ అడుగుజాడలు సృష్టింపబడ్డవి యెందుకాకూడదు? హంతకుడు లోనికివచ్చి షూట్ చేస్తే, రోహిణి అదే క్షణంలో బయట వర్షంలోకి వురకాలి-నోట్టి పాదాలతో! ఆమె భయంకొద్దీ తిన్నగా గేటుగుండా రోడ్డుమీదకు వురికి, ఏ వాహనంలోనో లిఫ్ట్ సంపాదించాలి!"

"ఆ తర్వాత?" ఆశ్చర్యంగా అడిగాడు జాన్.

"హంతకుడు రావ్ కావడానికి వీల్లేదు. దీపక్ కిటికీలోంచి షూట్ చేశాక హంతకుడు తప్పకుని మేడమీద కొచ్చాడు. దీపక్ చేతిలో రివాల్వర్ ప్రతాప్ రావ్ దే-రోహిణి తెచ్చింది. హంతకుడిదగ్గర రివాల్వర్ లేదు. బలిష్టుడై వుండాలి. దిపక్ లాంటి యిరవైఏళ్ళ కుర్రాడ్ని యెదుర్కోవడం కష్టం కాదు.

అతని గదిలో జారబడి దీపక్ తో ప్రత్యక్షంగా తలపడ్డాడు. దీలక్ చేతిలో రివాల్వర్ లాక్కొని షూట్ చేశాడు. ఈలోపు రోహిణి పారిపోయింది. దీపక్ చనిపోయాక హంతకుడు వెంటనే ఒక వుపాయం ఆలోచిం

చాడు. హత్య రోహిణిమీద బనాయించాలనుకున్నాడు.

కాబట్టి వర్షం తగ్గేవరకు ఆగి, లాంతరు వూది ఆర్పేసి, తన పాదరక్షలు-అవి చెప్పులు కావచ్చు లేక బూట్లు కావచ్చు-వాటిని తీసేసి చేతిలో పట్టుకొని, అక్కడ వున్న రోహిణి చెప్పులు తొడుక్కొని క్రిందికి వచ్చాడు. భూమిలో బాగా దిగేలా నడిచి, అంతకుముందు తాను నిలబడ్డ రాళ్ళకుప్పదగ్గరికొచ్చాడు. అక్కడ నిలబడి మిగతా బుల్లెట్స్ గాల్లో షూట్ చేసి, రివాల్వర్ చిత గొట్టి శుభ్రంగా తుడిచి రాళ్ళలో దాచాడు.

ఆ తర్వాత రోహిణి పారిపోయిన దిశను సూచించడానికి మొక్కల్లోంచి గోడదగ్గరకు వురికాడు. సరిపోని చెప్పులతో మొక్కల్లో వురకటం కష్టం కాబట్టి వాటిని కూడా చేతిలో పట్టుకుని వురికాడు. గోడ దూకి రోహిణి చెప్పుల్ని దూరంగా విసిరేసి, రోడ్డెక్కి తన కార్లో పారిపోయాడు."

"మరి రావ్ గురించి ఏమిటి?"

"ఈ హత్య రావ్ చేసివుంటే కూతురిమీద సాక్ష్యాలెందుకు సృష్టిస్తాడు? స్వభావసిద్ధంగా మనిషి మనస్తత్వాన్నిబట్టి యే తండ్రీ కూతుర్ని హంతకురాలు చెయ్యాలనుకోడు!

"రాత్రి రావ్ వర్షం వెలిశాక గోడవున్ కెళ్ళి ఏమీ చెయ్యకుండానే తిరిగివచ్చాడు. అంటే మనసు మార్చుకొనివుండాలి, లేదా స్లీప్ వాకింగ్ చేసివుండాలి. అతను స్పృహలో వుండి అక్కడికెళ్ళివస్తే-అతనేమీ చెయ్యలేదు, చూడలేదు గనుక-ఆ విషయం యాదృచ్ఛికంగా ఒప్పుకునేవాడు. కానీ అక్కడికెళ్ళినట్లు అతనికి

జ్ఞాపకం లేదు. అందువల్ల కచ్చితంగా అతను స్లీప్ వాకర్!"

"అయితే రోహిణి విషయమేమిటి? ఆమె ఎక్కడికి వెళ్ళింది?"

"అది రేపు తెలుసుకుందాం. విష్యూ గుడ్ నైట్ అండ్ స్వీట్ డ్రీమ్స్!"

# 8

బొంబాయి హైవేమీద కూకట్ పల్లి దగ్గర, సనత్ నగర్-బాలానగర్ రోడ్లు కలిసే జంక్షన్ లో ఒక సర్వీస్ స్టేషన్ వుంది. దాని ముందు విశాలమైన ఆవరణ వుంది. ఆవరణనిండా వాహనాలున్నాయి. ఆ ప్రదేశమంతా హడావుడిగాను, అటెండర్ బిజీగానూ వుండటం డిటెక్టివ్ లు గమనించారు. రోహిణి ఆచూకీ తెలుసుకోవాలంటే స్టార్టింగ్ పాయింట్ అనుకున్నారు. కాబట్టి కారు దిగి కేబిన్ లోకి నడిచారు.

లోనికివెళ్ళిన డిటెక్టివ్ లను చూసి అటెండర్ కలవర పడ్డాడు. ఛటుక్కున లోనికి వురికి ఎగాదిగా చూశాడు. డిటెక్టివ్ లు అతన్ని కుదుటపడమని చెప్పి తాము కూర్చున్నారు. ఆ తర్వాత తామెవరో చెప్పారు. అటెండరు కంగారుపడి వచ్చిన పనేమిటని అడిగాడు. లాల్ వివరించి చెప్పాడు. మొన్నరాత్రి తొమ్మిది ప్రాంతాల స్టేషన్ కొచ్చిన వాహనాల వివరాలడిగాడు. చెబితే నగదు బహుమతి వుంటుందన్నాడు.

అటెండర్ ముఖం విచ్చుకుంది. లాల్ అడిగిన ప్రశ్నలకు సమాధానాలిస్తూ యిలా అన్నాడు:

"ఎన్నిగంటలకన్నారూ? తొమ్మిది ప్రాంతాలా?

మొన్న రాత్రి వర్షం పడింది కదూ? నేను తలుపు బిగించి లోపలకూర్చున్నాను. చలి కోటు తొడుక్కున్నానను కోండి. అయినా ఆ వెంటిలేటరు వుంది చూశారా, అందు లోంచి చల్లటి గాలి ఈడ్చి కొడుతోంటే తాళలేక ఆ స్టవ్ వెల్గించి అక్కడ కూర్చున్నాను. ఇంతలో నామీద యెక్కడ? - నా ముఖంమీద హెడ్ లైట్స్ పడ్డాయి. కళ్ళు నలుముకునేంతలో అవి ఆరిపోయాయి.

అప్పుడు బయట కారాగడం చూశాను. అందులోంచి యిద్దరు మనుషులు దిగి, తడుస్తూ పరిగెత్తి వచ్చారు. దబ దబమని తలుపు బాదారు. వర్షంలో పెట్రోలు లేద న్నాను. వాళ్ళు తలుపు తెరవమని అరిచారు. ఎవరి మాటలు యెవరికీ విన్పించడంలేదు! తలుపు తెరిచాను. వాళ్ళిద్దరు లోనికి జారబడ్డారు!"

లాల్ వాళ్ళని వర్ణించమన్నాడు.

"వాళ్ళిద్దర్లో ఒకామె యిరవై యేళ్ళ అమ్మాయి సుమండీ! అతనికి ముప్ఫై యేళ్ళుంటాయి. ట్రిమ్‌గా వున్నాడు. అతనికంటే ఆమె యెక్కువ తడిసిపోయింది. ఎందుకో తెలియదు. తలనుంచి కాళ్ళవరకు తడిసి ముద్ద యింది. ఆమె కాళ్ళకు చెప్పుల్లేవు. చాలా గాభరాగా కన్పించింది!"

వాళ్ళెందుకొచ్చారో అడిగాడు జాన్.

"అతను పెట్రోలు అవసరం లేదన్నాడు. కారు వైపర్స్ చెడిపోయాయట. వర్షంలో డ్రైవింగ్ కష్టంగా వుందన్నాడు. వర్షం తగ్గేవరకు ఆగి వెళ్తామని చెప్పాడు. ఒప్పుకున్నాను. ఆ తర్వాత అతనెక్కడికో ఫోన్ చేశాడు నెంబరు నేను చూడలేదు."

జాన్, రోహిణి బస్ పాస్ చూపించి గుర్తించమన్నాడు.

"అవును. నమ్మకంగా ఈమే! క్షమించండి....ఆమె తడిసివుండటంవలన బాగా ఆకర్షించింది. ఆమె రూపం మనసులో ముద్రపడిపోయింది. కచ్చితంగా ఈ ఫోటో ఆమెదే!"

లాల్ ఆ తర్వాత కారుగురించి అడిగాడు.

కారు నెంబరు నేను సరిగా చూడలేదు. వాళ్ళు వెళ్తున్నప్పుడు ఒక్క-క్షణం దానివేపు చూపులు సారించి తిప్పుకున్నాను-నెంబరు ఎ.బి.సి. తర్వాత మూడు సున్నాలు వరుసగా కన్పించాయి. కానీ అలాంటి నెంబరు వుండదు. బహుశ మొదటి సున్నా స్థానంలో 9 అంకె లాగా కన్పించినట్లు జ్ఞాపకం. మిగతా రెండంకెలు మాత్రం సున్నాలే. అంటే నెంబర్ ఎ.బి.సి. 900 కావచ్చు. గ్రీన్ అంబాసిడర్ ....వాళ్ళు సిటీలోకెళ్ళిపోయారు."

లాల్ బహుమతి యిచ్చాడు.

ఆ తర్వాత బయటికొచ్చి కారెక్కారు.

"రోహిణికి ఆ కార్లో లిఫ్ట్ దొరికింది. కారు యజమానితో ఆమె సురక్షిత స్థలానికెళ్ళిపోయింది. బహుశ ఆమె అతనికంతా చెప్పే వుంటుంది. కానీ హంతకుడి భయంతో పోలీసులదగ్గరికెళ్ళకుండా అజ్ఞాతంగా వుంది," అన్నాడు లాల్.

"ఎవరికి తెలుసు! ఆమె హంతకుడికి చిక్కలేదని నమ్మకమేమిటి?" జాన్ అన్నాడు.

"చిక్కలేదనే నమ్ముదాం. చిక్కకూడదని ప్రార్థిద్దాం. కృష్ణన్ ఎ.బి.సి. 900 వివరాలు మనకందిస్తాడు. వెంటనే రంగంలోకి దిగాలి!"

సిటీకెళ్ళగానే లాల్ ఆ కారును ట్రేస్ చెయ్యమని కృష్ణన్‌ని కోరాడు. గంట తర్వాత కృష్ణన్ నుంచి ఫోన్ వచ్చింది. ఆ నెంబరు గల కారు వివరాలు ట్రాఫిక్ కంట్రోల్ రూంలో లేవన్నాడు. ఎ.బి.సి. అనేది హైదరాబాద్‌కు చెందిన రిజిస్ట్రేషనేననీ, అయితే నెంబర్స్ 900 వరకు ఇంకా యివ్వలేదనీ అన్నాడు.

కృష్ణన్ మాటలు విని లాల్ ఆలోచనల్లో పడ్డాడు.

"ఒకవేళ అ నెంబర్ 900 గాక 800 అయితే?" అడిగాడు జాన్.

లాల్ కళ్ళు మెరిశాయి. "అవును! చీకట్లో 8-9 లాగ కన్పించవచ్చు. అంతేగాక ఏ కొద్దిగా ఆ అవకాశ ముంది. 9, 8, 3, ఈ మూడంకెలకూ చాలా దగ్గర సంబంధం వుంది కదూ?"

"కాబట్టి ఎ.బి.సి. 300, 800 నెంబర్లను చెక్ చెయ్యాలి" అని ఫోన్ అందుకున్నాడు జాన్.

గంట తర్వాత కృష్ణనుంచి ఫోన్ వచ్చింది. ఆ రెండు నెంబర్లు గల కార్లు సిటీలోనే వున్నట్లు చెప్పాడు. ఎ.బి. సి. 300 బ్లాక్ ఫియట్ అనీ, ఎ. బి. సి. 800 గ్రీన్ అంబాసిడర్ అనీ చెప్పాడు. డిటెక్టివ్‌లకు కావలసింది గ్రీన్ అంబాసిడర్ కాబట్టి ఎ.బి.సి. 800 వివరాలడిగారు. కృష్ణన్ చెప్పాడు.

వెంటనే డిటెక్టివ్‌లు బయులుదేరారు. అయిదు నిమిషాల్లో సోమాజిగూడలో సతీష్‌కుమార్ యిల్లు చేరుకున్నారు. గ్రీన్ అంబాసిడర్ యింటిముందే వుంది. డిటెక్టివ్‌లు కారు దిగుతుండగా సతీష్‌కుమార్ బయటకొచ్చి ఆశ్చర్యంగా చూశాడు.

"వాట్ ఎ సర్ప్రైజ్! మీరిక్కడికి రావడమేమిటి!"

లాల్ నవ్వి కరచాలనం చేశాడు. "మీరొక అభాగ్యురాలికి ఆశ్రయమిచ్చి చాలా సహాయం చేశారు. థాంక్స్"

"మీరు థాంక్స్ చెప్పడమేమిటి! యేమిటి మీరనేది!"

"లోనికెళ్ళి మాట్లాడుకుందాం" లాల్ చొరవగా లోనికెళ్ళిపోయాడు. సతీష్ అయోమయంగా అనుసరించాడు. జాన్ డ్రాయింగ్ రూమ్ నుంచి వెళ్ళాడు.

"మిస్టర్ లాల్ మీరు వింతగా ప్రవర్తిస్తున్నారు!" సతీష్ అన్నాడు.

లాల్ యింటిని కలియజూస్తూ అన్నాడు "అపాయంలో వున్న ఒక మనిషిని ఆదుకొని మీ వంతు బాధ్యత తీర్చుకున్నారు. ఇప్పుడు మేం స్వీకరించాలి. మిస్ రోహిణి యెక్కడ వుంది?"

"రోహిణీ!"

"అవును. మొన్న వర్షపు రాత్రి సిటీ వెలుపల మీరు లిఫ్ట్ యిచ్చిన రోహిణి."

సతీష్ గాఢంగా చూశాడు. అంతలోనే కఠినంగా చూస్తూ అన్నాడు:

"ఆమె యెవర్నీ చూడదు! ప్లీజ్ గెటవుట్. లేదా పోలీసులకు ఫోన్ చేస్తాను!"

"చెయ్యండి. యింతకాలం యెందుకాగారు?"

సతీష్ కలవరంగా అన్నాడు: "ఏమిటి మీరనేది, మిస్టర్ లాల్?"

"రోహిణిని గాలించడానికి హంతకుడు మనుష్యుల్ని నియమించాడని అనుకుంటున్నారు మీరు. అందుకే భయ

పడి పోలీసులకి ఫోన్ చేస్తానన్నారు. క్యారీ ఆన్!
చెయ్యండి."

"అంటే పూరు పోలీసుల తరఫున వచ్చారా?"

"మేం ఎక్కడికి వెళ్ళినా చట్టం తరఫునే వెళతాం. కమాన్, హెడ్క్వార్టర్స్‌లో కృష్ణన్‌కు ఫోన్ చేసి కనుక్కోండి!" అని నెంబర్ చెప్పాడు లాల్.

సతీష్ ఫోన్ చేసి కృష్ణన్‌ని రమ్మని చెప్పాడు.

# 9

లాల్ గబగబ మెట్లెక్కి పైకి వెళ్ళాడు. అతని వెనక సతీష్, జాన్‌లతో బాటు కృష్ణన్ వెంబడించాడు.

లాల్ ఒక గదిముందాగి తలుపు తట్టాడు.

"తలుపు తెరువ్. రోహిణీ!" సతీష్ అన్నాడు.

మరుక్షణం తలుపు తెరుచుకుంది. లాల్ ఛటుక్కున లోనికెళ్ళాడు. రోహిణి కెవ్వుమని కేకపెట్టి వెనక్కి కూకింది.

మిగతావాళ్ళంతా లోనికొచ్చేశారు.

సతీష్ రోహిణి దగ్గరకెళ్ళి అన్నాడు. "సిస్టర్! ఇప్పుడు భయం లేదు. నేను ముందే చెప్పాను పోలీసులకు చెప్పొద్దామని. నువ్వు భయపడ్డావు. ఇప్పుడు వాళ్ళే యిక్కడకొచ్చేశారు. నువ్వింకేమీ సందేహించకుండా జరిగింది చెప్పేయ్!"

సతీష్ చెప్పడం ఆపి, గబగబ అతిథుల్ని రోహిణికి పరిచయం చేశాడు.

రోహిణి ముఖం పీక్కుపోయి వుంది. భయం ఆమెను సగం మనిషిని చేసింది.

ఆమె లాల్ చేతులు పట్టుకొని వర్షిస్తున్న కళ్ళతో

అంది:

"లాల్ గారూ! నేనేమీ చెయ్యలేదు! దీపక్‌ని నేను చంపలేదు! నంబియార్ నన్ను చంపకుండా రక్షించండి!"

"నిన్నెవరూ అలా చెయ్యరు. అర్థమైందా? జరిగిందే మిటో ప్రశాంతంగా చెప్పు!" అన్నాడు లాల్.

రోహిణి మంచంమీద కూర్చొని కళ్ళు తుడుచుకుంది. ఆ తర్వాత గాద్గిక స్వరంతో అంది:

"నేను చట్టవిరుద్ధమైన పనుల్లో పాల్గొన్నాను. చివరకు నాకీ దుస్థితి యేర్పడింది! రెండు నెలల క్రితం నేను దీపక్‌తో స్నేహం చెయ్యడం, ఆ తర్వాత నంబియార్‌తో చేతులు కలపడం-అంతా విచిత్రంగా జరిగిపోయింది! దీపక్ నన్ను మోసం చేశాడు. మొదట అతని వేష భాషలు చూసి ఆకర్షింపబడ్డాను. అతని నిజస్వరూపం తర్వాత తెలిసింది. అతను గూండా! అప్పటికి నేను జ్ఞానం కోల్పోయాను. అతను నన్ను మత్తుమందులకు అలవాటు చేసి గుప్పెట్లో పెట్టుకున్నాడు. చూస్తుండగానే నాకు నేనుగా మారకద్రవ్యాలకు బానిసనయ్యాను!"

"దీపక్ గురించి చెప్పు."

"ఒకరోజు దీపక్ నాకో విషయం చెప్పాడు. స్మగ్లర్ నంబియార్‌తో అతనికో ఒప్పందం కుదిరిందట. నంబియార్ నగరంలో మత్తు పదార్థాల్ని సరఫరా చెయ్యడానికి గోవా యేజంట్లతో ఒప్పందం చేసుకున్నాడు. సరుకు దిగుమతి చేసుకుని, నిల్వ చేసి దాన్ని కాపాడే బాధ్యత దీపక్‌కు అప్పగించాడు. నంబియార్ చేతిలో లోకల్ గూండాలు చాలామంది వున్నారు. వాళ్ళు సరుకు అమ్మకం వ్యవహారాలు చూస్తారు.

"దీపక్ యిలాంటి పనుల్లో ఆరితేరినవాడు. నంబి యార్‌తో అతనికి పాతపరిచయం వుంది. నంబియార్ అతనికి మంచి హోదా కల్పించి లాభాల్లో ఇరవై శాతం కమీషన్ యిస్తానన్నాడు. దీపక్ ఈ వివరాలన్నీ నాకు చెప్పాడు. సరుకును దాచడానికి అనువైన స్థలంకోసం నంబియార్ గాలించమన్నాడు. దీపక్ ఈ మాట చెప్పి నప్పుడు నాకో విషయం స్ఫురించింది. కూకట్‌పల్లిలో మాకో గోడవున్ వుంది. దాన్ని నాన్న పదేళ్ళ క్రితం ఎప్పుడో కొన్నాడు. కానీ ఆర్నెల్లుగా నిరుపయోగంగా పడివుంది. దీపక్‌కు దాన్ని చూపించి ఎలా వుంటుందని అడిగాను. అంతకంటే అనువైన స్థలం దొరకదన్నాడు. అయితే నంబియార్‌కు చెప్పమన్నాను."

"ఆ యిల్లు నంబియార్ కొన్నాడా?"

"అవును. నాన్నదగ్గరికి మనిషిని పంపి నలభైవేలకు రహస్య వొప్పందం మీద కొన్నాడు. నాన్న ఈ విష యంలో యెక్కువ ఆసక్తి చూపించలేదు. ఆ యింటి ఛాయలకు వెళ్ళి వాళ్ళెవరో తెలుసుకోనే ప్రయత్నం కూడా చెయ్యలేదు. ఆయన కంత తీరికలేదు"

"ఏర్పాట్లన్నీ పూర్తయ్యాక నాకో ఆలోచన వచ్చింది. దీపక్‌ను నేను ప్రేమించానని గానీ, లేదని గానీ చెప్పలేను—మత్తుమందుల ప్రభావంవల్ల నా యిష్టా యిష్టాలతో నిమిత్తం లేకుండా పోయింది. కానీ ఒక్కటి మాత్రం నిజం—నేనతనికి శ్రేయోభిలాషి నయ్యాను. అదే అతని ప్రాణాలు తీసింది! నంబియార్ గురించి నేను క్రమంగా చాలా తెలుసుకున్నాను. అతను ఘరానా స్మగ్లర్—అంతే గాక మహా పిసినారి! యెందరో

డబ్బుకోసం మోసం చేసి దగా చేశాడు! అతన్ని నమ్మడానికి వీల్లేదు!

అందుకే ఈ ఒప్పందం కాయితాల్లో వుంటే బాగుంటుందని దీపక్‌తో చెప్పాను. నంబియార్ ఏదో మూడ్‌లోనో, లేక దురాలోచనతోనో వాటాలేదూ గీటాలేదూ నువ్వెవరో నాకు తెలియదు పొమ్మంటే ఏమవుతుంది!"

"అవును. మీరు బాగా ఆలోచించారు."

"దీపక్ కూడా యిలాగే అన్నాడు. వెంటనే నంబియార్ దగ్గరికెళ్ళి కాయితం వ్రాయించి, సంతకం పెట్టించుకొని తెచ్చాడు. అప్పటికీ నంబియార్ మోసంచేస్తే ఆ కాయితం పోలీసులకు పంపమన్నాను.

"నెలరోజుల క్రితం వ్యాపారం ప్రారంభమైంది— అర్థరాత్రివేళ రెండు కార్లలో సరుకు వచ్చింది. దాన్ని ఆ యింట్లో దాచారు. నంబియార్ గూండాలు రెండు రోజుల్లో సరుకంతా అమ్మేశారు. దీపక్ కమీషన్ అడిగితే నంబియార్ ప్రతి నెలా మొదటి తారీఖున యిస్తానన్నాడు.

"అలాగే వారంరోజుల తర్వాత మళ్ళీ సరుకువచ్చింది. ....ప్రతివారం వస్తూనేవుంది. దీపక్ ఆ యింట్లోనే మకాం వేసి కాపలా వుండేవాడు. అంతేగాక సిటీలో పెద్దపెద్ద బ్రోకర్లతో పరిచయం చేసుకొని అమ్మకాలు మరింత అభివృద్ధి చేశాడు. ఈ నెలరోజుల్లో మొత్తం అయిదులక్షల వ్యాపారం జరిగింది. ఆ లెక్కన అతనికి చాలా కమీషన్ రావాలి. యీ మొత్తం చూసి నంబియార్ కళ్ళు తిరిగాయి.

"మొన్న శనివారం మొదటి తేదీన కమీషన్ అడిగితే అనుకొన్నదే జరిగింది! నంబియార్ కుంటిసాకులు చెప్పాడు.

స్మగ్లింగ్ అంటే పైనుంచి క్రిందివరకు లంచాలు, కమీషన్ల బిజినెస్ అనీ—ఆ రకంగా చాలా ఖర్చయిందనీ—అనుకొన్నంత లాభాలు రాలేదనీ—కేవలం పాతిక వేలే పైన కనిపిస్తున్నాయనీ అన్నాడు!"

"ఆ తర్వాత?"

"దీపక్ నంబియార్ ఉద్దేశ్యం అర్థం చేసుకొని కాయితం గురుచేశాడు. నంబియార్ ఆ కాయితం మర్చిపొమ్మని చెప్పి పది శాతం కమీషన్ యిస్తానన్నాడు. అతను తప్పుడు లెక్కలు చూపెడుతున్నాడని దీపక్‌కు తెలుసు. నంబియార్‌కు కనీసం లక్షరూపాయలు లాభం వచ్చింది! పాతిక వేలని అబద్ధం చెపుతున్నాడు! ఈ విషయంలో యిద్దరిమధ్య వాగ్వివాదం జరిగింది.

"నంబియార్ యెంతకూ వొప్పుకోకపోవడంతో దీపక్ వొక హెచ్చరిక చేసి తిరిగి వచ్చాడు. మర్నాడు ఉదయంకల్లా పాతికవేలు యివ్వకపోతే ఆ కాయితం పోలీసులకిచ్చి బండారం బయటపెడతానన్నాడు.

"ఈ విషయాలన్నీ విని నా మనసు యేదో కీడు శంకించింది. దీపక్‌కు యేదో ప్రమాదం రాబోతుందని గ్రహించాను. నంబియార్‌ను నమ్మ వీల్లేదు. డబ్బుకోసం ప్రాణాలు తీయడానికి సందేహించడు! పైగా దీపక్ హెచ్చరిక చేసి వచ్చాడు. నంబియార్ దాన్ని ఎట్టి పరిస్థితిలోనూ పాటించడు! దీపక్‌కు రక్షణ కావాలి.

"అందుకే మొన్న ఉదయం ఇంటినుంచి నాన్న రివాల్వర్ తీసుకొని వెళ్ళిపోయాను.

"దాన్ని దీపక్‌కు యిచ్చి జాగ్రత్తగా వుండమన్నాను. దీపక్ ఆరోజు అక్కడే వుండిపొమ్మన్నాడు. ఈ వారం యింకా సరుకు రాలేదు. గోడవున్ ఖాళీగా వుంది. నంబి

యార్ హెచ్చరిక పాటించకపోతే, దీపక్ పోలీసుల దగ్గరికి వెళ్ళాలనుకోలేదు. అతని దృష్టిని మళ్ళించడానికి అలా హెచ్చరించాడు. సరుకు వచ్చాక దాన్ని అమ్మి డబ్బుతో పారిపోవాలనుకొన్నాడు.

"ఆ ఉదయం నంబియార్ దగ్గరికె ళ్ళి అతను అదే ధోరణిలో పాతిక వేలుకి ఇరవై శాతం కమీషన్ అయిదు వేలు చేతిలో పెట్టాడు. దీపక్ లక్షరూపాయలకు కమీషన్ కట్టమన్నాడు. విన్లేదు. దీపక్ మౌనంగా తిరిగి వచ్చేశాడు."

"ఆ తర్వాత?"

"ఆ సాయంత్రంవరకు యేమీ జరగలేదు. మేం ఇద్దరం గోడవున్‌లోనే వున్నాం. ఆ కాయితం సూట్‌కేసులో వుంది. దీపక్ రివాల్వర్‌ను జేబులో సిద్ధంగా వుంచుకొన్నాడు. యే క్షణంలో నంబియార్ గూండాలు వచ్చి పడతారోనని నాకు రవంత భయంవేయలేదు! బాగా రాత్రయ్యాక వర్షం ప్రారంభమవుతున్నప్పుడు హఠాత్తుగా నంబియార్ వచ్చాడు. అతను లోనికి వచ్చేంతవరకూ మాకు తెలియలేదు....! కారును గోడౌను మీదే ఆపాడు...."

"అప్పుడేం జరిగింది?"

"నంబియార్ సూటిగా దీపక్‌ను అడిగాడు—యేం ఆలోచించుకొన్నావని. యేమీ లేదని దీపక్ అన్నాడు. అయితే ఆ కాగితం యిచ్చేసి దూరంగా పారిపొమ్మని నంబియార్ చెప్పాడు. జేబులోంచి ఒక నోట్లకట్ట తీసి మంచంమీద విసిరాడు. ఆ పదివేల రూపాయలు తీసుకొని పారిపొమ్మన్నాడు. దీపక్ నవ్వి, ఆ కట్టతీసి తిరిగి నంబియార్ మీదికి విసిరి, తక్షణం పరిగెత్తకపోతే వారి

ల్వర్ తీస్తానన్నాడు. నంబియార్ భయపడ్డాడు. రివాల్వర్ చూపించి, ఒప్పందం అంతటితో అంతం కావాలంటే యాభై వేలు యిమ్మన్నాడు. కొనసాగాలంటే ఇరవై వేలు యిమ్మన్నాడు."

"నంబియార్ యేమన్నాడు?"

"రెండూ కావన్నాడు. ఇప్పుడు తన మాట వినకపోతే ఆవతల దీపక్‌ను చంపడానికి మనుషులు సిద్ధంగా వున్నారన్నాడు. దీపక్ అతనికి రివాల్వర్ గురి పెట్టాడు. కాయితం ఇచ్చేసి పారిపోవడానికి యాభై వేలు కావాలన్నాడు. అలా కాని పక్షంలో అతని గూండాలు వచ్చే లోపున చంపేస్తానన్నాడు.

"నంబియార్ ముఖంలో రంగులు మారాయి. దాన్నిబట్టి నా కర్థమైంది—బయట గూండాలు లేరని—నంబియార్ దగ్గర అసలు రివాల్వరే లేదని! అంతే, దీపక్ ఆ మాట చెప్పడంతో అతను మెరుపులా దూకి రివాల్వర్ లాక్కొని, దీపక్‌ను వెనక్కి నెట్టేశాడు.

"నేను భయపడ్డాను! నంబియార్ రివాల్వర్ గురిపెట్టి కాయితం ఇమ్మన్నాడు. దీపక్ నెమ్మదిగా లేచి, నంబియార్ యెంత వేగంగా దాడిచేశాడో, దానికి రెట్టింపు వేగంతో అతనిమీద దాడిచేశాడు. కానీ రివాల్వర్ చిక్కలేదు! ఇద్దరికీ పెనుగులాట ప్రారంభమైంది. బయట జోరుగా వర్షం పడుతోంది. అప్పుడప్పుడు పిడుగులు కూడా పడుతున్నాయి....

"దీపక్, నంబియార్ చెయ్యి మెలేసి తిప్పుతున్నాడు. నంబియార్ మరో చెయ్యితో దీపక్ జుత్తు పీకుతున్నాడు,

దీపక్ బాధ భరించలేక నంబియార్ చెయ్యి కోరి కాడు....!

"ఏం జరిగింది?"

"నంబియార్ అరిచాడు. అరుపుతో పాటు అతని చేతిలో రివాల్వర్ పేలింది! బుల్లెట్ కిటికీగుండా బయట వర్షం లోకి దూసుకెళ్ళింది-ఈలోపు-రివాల్వర్ పేలిన మరు క్షణం నంబియార్, దీపక్ జుత్తు వదిలేసి రివాల్వర్‌తో అతని తలమీద కొట్టబోయాడు. కానీ-దీపక్ చెయ్యిపట్టు కోవడంతో ట్రిగ్గర్ లాగేశాడు. ఈసారి బుల్లెట్ దీపక్ తల్లోకి దూసుకెళ్ళింది-ఓహ్ అనుకోని చావు!"

లాల్ వివర్ణమైన జాన్, కృష్ణన్‌ల ముఖాలు చూసి పేలవంగా నవ్వాడు.

"ఆతర్వాత ఏం జరిగింది?"

రోహిణి అంది, "భయంతో గజగజ వణికాను! దీపక్ చనిపోయాడు! కళ్ళు మూసుకుని గట్టిగా కేక పెట్టి ఒక్క క్షణం అక్కడ వుండకుండా బయటికి వురికాను. ఆ సమ యంలో నా చెప్పులు, బ్యాగు అన్నీ మర్చిపోయాను. బయట వర్షం బాగా పడుతోంది. ఏమీ తెలియని స్థితిలో మెట్లుదిగి వురికాను. ఇంతలో వెనకనుంచి హెడ్ లైట్లు పడ్డాయి-"

"ఎవరివి?"

"ముదట నంబియార్ కారనుకున్నాను. అతను నా వెంటపడ్డాడనుకొని రోడ్డు దిగి పొదల్లో వురికాను. ఆ పొదల్లో తేళ్ళున్నాయో, పాములున్నాయో! బిక్క చచ్చిపోయాను. తర్వాత-ఆ హెడ్‌లైట్స్ దాటి పోయాక తెలిసింది, అది కారు కాదు లారీ. పొదల్లోంచి మళ్ళీ రోడ్డుమీదకు వురికాను. ఈ సారి లైట్లు కనిపిస్తే

అలా వురకవద్దనుకున్నాను. వచ్చిన వాహనం నంబియా ర్ది కాకపోతే లిఫ్ట్ సంపాదించవచ్చు.

"రోడ్డుమీద చాలా దూరం నడిచాను. ఇంతలో మళ్ళీ లైట్లు కనిపించాయి. ఈసారి జాగ్రత్తపడి అది నంబి యార్ కాదని తెలుసుకుని కారును ఆపాను."

"ఆ కార్లో యెవరున్నారు?"

"సతీష్. ఆయన నన్ను చూసి వెంటనే కారెక్క మన్నాడు. నమ్మి యెక్కేశాను. గాభరాగా వున్న నన్ను ఆయనేమీ ప్రశ్నించలేదు. తన సమక్షంలో భయపడ వద్దన్నాడు. నేను అపాయంలో వున్నానని ఆయనకు తెలుసు. నేను భయపడుతూనే వున్నాను - నంబియార్ కార్లో ఎక్కడవస్తాడోనని-కానీ రాలేదు. యెందుకో తెలియదు.

"మేం సిటీకి వచ్చేశాం. సతీష్ ఈ యింట్లో ఆశ్రయ మిచ్చారు. జరిగినదంతా ఆయన బలవంతంమీద చెప్పాను. నంబియార్ నన్ను గాలిస్తున్నాడనీ, కన్పిస్తే చంపుతా డనీ భయపడి పోలీసులదగ్గరికి గూడా వెళ్ళలేదు!"

"కానీ ఇప్పుడు మేమే యిక్కడకొచ్చేశాం!"

"ఎలా వచ్చారో నా కర్థంగావడం లేదు!" అంది రోహిణి, లాల్ని ప్రాధేయపూర్వకంగా చూస్తూ, "దీపక్ చావుకు నా బాధ్యతవుంది. కానీ అతన్ని నేను చంపలేదు! నన్ను నంబియార్ బారినుండి రక్షించండి!"

# 10

ఆ రోజు మధ్యాహ్నం డిటెక్టివ్ల సూచనమేరకు పోలీసులు హత్య జరిగిన పరిసరాల్లో గాలింపు ప్రారం భించారు.

కృష్ణన్ ప్రత్యేకంగా బైనాక్యులర్స్ పెట్టుకుని గాలించాడు. ఇంటికి పడమర వైపు పెద్ద పెద్ద రాళ్ళు, గుంటలు, వాటిలో పొదలు, చాలా వున్నాయి.

మొత్తం పన్నెండుమంది పోలీసులు జాగ్రత్తగా వెదుక్కుంటూ దాదాపు 100 గజాల దూరం వెళ్ళారు.

కానీ కృష్ణన్‌కు అంతదూరం వెళ్ళనవసరం లేకుండానే దూరంలో పొదల్లో చిక్కుకొనివున్న ఒక చెప్పు కన్పించింది.

"ఆపరేషన్ హాల్ట్!" అని పెద్దగా అరిచి, ఆ పొద కేసి వురికాడు.

అక్కడ రోహిణి చెప్పులు, హాండ్ బ్యాగు లభించాయి. వేలిముద్రలు చెడిపోకుండా వాటిని స్వాధీనం చేసుకొని, వెనక్కి తిరిగి అప్రయత్నంగా నేలమీద చూశాడు.

ఆ పొదకు పదడుగుల దూరంలో, ఏటవాలుగా వున్న చోట, యెవరో జారి పడినట్లు నేల చెబుతోంది. అదే క్షణంలో అక్కడొక పర్సు కూడా కన్పించింది.

పర్సులో కొన్ని కరన్సీ కాగితాలు, చిల్లర నాణాలు, ఇంకేవో కాయితాలు, ఒక విజిటింగ్ కార్డు వున్నాయి.

విజిటింగ్ కార్డు చూసి కృష్ణన్ సంతోషంగా ఘరానా స్మగ్లర్ నంబియార్ దగ్గరకు వెళ్ళి, పరిచయం చేసుకొని, అతని వేలి ముద్రలు తీసుకొని, అవి రోహిణి చెప్పులమీద వేలిముద్రలతో సరిపోవడంతో చేతులకు బేడీలు తగిలించాడు.

ఆ రాత్రి ప్రతాపరావు కూతురి తోడ్పాడుతో డిటెక్టివ్‌లకు గొప్ప విందు ఏర్పాటు చేశాడు.

—: అయిపోయింది :—

# దురాశ దుఃఖానికి చేటు

వాణిశ్రీ

ఇన్‌స్పెక్టర్ అజీజ్ లంచ్ వేళయిందని సీటులోంచి లేచి నిలుచునేసరికి యెవరో ఒక యువకుడు వస్తూనే విష్ చేశాడు.

ఏదో గిరాకీ తగిలేసట్టుంది అనుకుని కూలబడ్డాడు.

"చెప్పండి," అన్నాడు అజీజ్ హేట్ తీసి ప్రక్క పెట్టి.

"నా పేరు జైపాల్. రైల్వేలో గార్డుగా పని చేస్తున్నాను."

అజీజ్ తల వూపాడు.

"నేనొక చిక్కులో పడ్డాను. మీరు హెల్పు చెయ్యాలి." ప్రాధేయపూర్వకంగా అన్నాడు జైపాల్

"ఫర్వాలేదు సందేహించకుండా చెప్పు!" అన్నాడు అజీజ్ చిన్నగా నవ్వుతూ.

"నన్ను చంపడానికి రామ్‌కుమార్ ప్రైచేస్తున్నాడు" అన్నాడు జైపాల్.

"అతను యెవరు?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"ఫిలిం జర్నలిస్టు."

"కారణం ఏమిటీ? మీ ఇద్దరికీ అంత బద్ధ వైరం ఎందుకు కలిగింది?"

"నాకు అతనికీ పెద్ద పరిచయం గూడ లేదు."

"ఈజిట్ ....?" అజీజ్ ఆశ్చర్యపోయాడు.

"యస్."

"పరిచయం లేనివాడిని యెందుకు చంపాలనుకుంటాడు? విచిత్రంగా వుందే?" అన్నాడు అజీజ్.

"దానికి కారణం వుంది. సినీస్టార్ గీతావాణి మీకు తెలుసా?"

"తెలియకేం. ఆమె సినిమాలు కొన్ని చూశాను. సపోర్టింగ్ క్యారెక్టర్స్ వేస్తూ వుంటుంది."

"ఎస్. ఈ మధ్యనే 'మరో పార్వతి' సినిమాలో హీరోయిన్‌గా వేసింది. ఇప్పుడిప్పుడే పైకి వస్తూవుంది," అన్నాడు జైపాల్.

"షీ ఈజ్ యె టాలెంటెడ్ ఆర్టిస్ట్. షి గాట్ బ్రైట్ ఫ్యూచర్," మెచ్చుకోలుగా అన్నాడు అజీజ్.

"గీతరాణి నా భార్య."

ఉలిక్కిపడ్డాడు ఇన్‌స్పెక్టర్ అజీజ్.

"గీతరాణికి పెళ్ళయిందా?" ఆశ్చర్యంతో ప్రశ్నించాడు అజీజ్.

"మూడు సంవత్సరాలైంది."

"నేను రెగ్యులర్‌గా ఫిలిం జర్నల్స్ ఫాలో అవుతూంటాను. అఫ్‌కోర్సు ఈ వుద్యోగంలో చేరకముందు హీరో కావాలని పిచ్చితో పాండిబజార్‌లో తిరిగేవాణ్ని. కాని గీతరాణిని కుమారి అని రాస్తూవుంటారే పత్రి

కలలో" అన్నాడు అజీజ్.

"ఆ విషయం సీక్రెట్‌గా వుంచాలని కోరింది నా భార్య."

"ఎందుకని?"

"మీకు తెలియంది ఏముంది? సినీఫీల్డుతో మీకు టచ్ వుంది కదా!"

"ఎస్....ఎస్....అయినా పెళ్ళైన ఆవిడ ఆ విషయం రహస్యంగా వుంచాలనుకోవడం యెందుకో నాకు అర్థం కావడం లేదు."

"పెళ్ళైన అమ్మాయి అంటే ఫీల్డులో గ్లామర్ వుండదని, కాస్త పైకి వచ్చేవరకూ సీక్రెట్‌గా వుంచాలనుకుంది."

"ఐ. సీ...."

"ఆ సలహా యిచ్చింది రామ్‌కుమారే."

"అటువంటివి జర్నలిస్టులకి బాగా తెలుస్తాయి." అన్నాడు అజీజ్.

"రామ్‌కుమార్ చాలా డేంజరస్ ఫెలో అని నాకు అనిపిస్తూ వుందిప్పుడు."

"అసలు సంగతి మర్చిపోయాం. చెప్పండి," అన్నాడు అజీజ్.

"నన్ను చంపి, గీతారాణిని పెళ్ళి చేసుకోలనుకుంటున్నాడు రామ్‌కుమార్." అన్నాడు జైపాల్.

అజీజ్ దిమ్మెరపోయాడు.

"అలా అని ఎలా అనుమానించారు? అటువంటి సంఘటనలు ఏవైనా జరిగాయా?"

"జరిగాయి. ఒకసారి నేను గూడ్సు ట్రైన్‌లో వెళ్తూ వుండగా యెవడో రౌడీ నా గార్డు పెట్టెలో దాక్కొని

సమయం చూసి కత్తితో పొడవబోయాడు. ఎలాగో తప్పించుకుని వాడిని బండిసుంచి కిందకు నెట్టేశాను. చూడండి కత్తిపోటు." అంటూ షర్టు బటన్సు విప్పి జబ్బమీద గాయం చూపించాడు.

"ఊఁ....తర్వాత."

"ఒకరోజు నాభార్య దగ్గర్నుంచి వస్తూవుండగా యెవరో పెద్ద రాయి విసిరారు. అదృష్టవశాత్తు అది నా వీపుమీద తగలబట్టి సరిపోయింది. లేకపోతే తలకి తగిలి వుంటే నా ప్రాణం పోయివుండేది." బాధగా అన్నాడు జైపాల్.

"ఇదంతా రామ్‌కుమార్ చేయిస్తున్నాడని ఎలా అనుకుంటున్నారు మీరు?"

"నన్ను చంపాలని యింకెవరు అనుకుంటారు సార్! నేను చస్తే వాడు నా భార్యని పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాడు."

"ఐ. సీ....మరి నీ భార్య వుద్దేశం ఎలా వుంది?"

"ఆమెకు అటువంటి వుద్దేశ్యం వున్నట్లు నాకు అనుమానం రాలేదు. కాని.... నేను చనిపోతే ఆమె మారిపోవచ్చును గదా. ఆ తర్వాత ట్రైచేసి తనవైపు తిప్పుకోగలనని అతనికి ధైర్యం వుందేమో!"

అజీజ్ తల వూపాడు.

"గీతారాణి గురించి రామ్‌కుమార్ తరచుగా పబ్లిసిటీ చేస్తున్నాడనీ, ఆమె యింట్లో చనువుగా మసలుతున్నాడనీ ఫైల్డులో రూమర్స్ గూడా పుట్టాయి."

"రూమర్సది ఏవుందిలెండి. వాటికి పనీ పాటా ఏమీ లేదు. ఆటోమాటిక్‌గా పుడుతూ, చస్తూ వుంటాయి." అన్నాడు అజీజ్.

"అవునసుకోండి. నిప్పులేనిదే పొగ రాదు గదా?" అన్నాడు జైపాల్.

"ఆ విషయం అలా వుంచండి. మీరు భార్యాభర్తలు గదా! నాకు పెళ్ళి కాలేదని ఆమె అంటూవుంటే మీరు ఎలా ఒప్పుకున్నారు?"

"ఆమె ఫ్యూచర్ కోసం."

"కాని అది మిమ్మల్ని చిక్కుల్లోకి నెడుతుంది గదా? మీరు స్వతంత్రంగా యింటికి వెళ్ళలేరు గదా? అసలు మీరిద్దరూ ఒక యింట్లోనే వుంటున్నారా? అని అనుమానం వస్తోంది."

"ఉండడం లేదు. నా హెడ్ క్వార్టర్స్ విజయవాడ. అప్పుడప్పుడూ వచ్చిపోతూవుంటాను."

"మీరు వచ్చిపోతుండే విషయం ఇక్కడి వాళ్ళకు తెలియదా. అంటే నా వుద్దేశ్యం చుట్టుపక్కల వాళ్ళకి. సొసైటీలో కాస్త పాపులర్ అయిన వాళ్ళంటే మిగిలిన వాళ్ళకి ఆసక్తి వుంటుంది. అందులోనూ సినీస్టార్ అంటే చెప్పేపని లేదు."

"నేను అప్పుడప్పుడూ వచ్చిపోయే సంగతి చాలా మందికి తెలుసు ఆ వీధిలో. ఎవరైనా నా గురించి అడిగితే మా బావ అని చెపుతుంది నా భార్య." నవ్వుతూ అన్నాడు జైపాల్.

"ఈ విషయం మీరు ఎవరికైనా చెప్పారా?"

"ఏ విషయం?"

"అదే మిమ్మల్ని రాంకుమార్ హత్య చేయించాలని ట్రై చేస్తున్న విషయం."

"ఎవరికీ చెప్పలేదు."

"మీ భార్యకి కూడా....?"

"చెప్పలేదు."

"ఏం? చెప్పొచ్చుగా."

"గిల్టీగా ఫీలయ్యాను."

"అఫ్‌కోర్స్. కాని విషయం తెలిపోయేది గదా! అవి డకు రామ్‌కుమార్ దురుద్దేశ్యం తెలిసిపోతే మంచిది. తగు జాగ్రత్తలో వుంటుంది."

"అయితే చెప్పమంటారా?"

"చెప్పండి," అన్నాడు అజీజ్.

"నాకు ఏదైనా ప్రమాదం జరిగితే అది రామ్‌కుమార్ ద్వారా మాత్రమే అని గుర్తుంచుకోండి."

అజీజ్ నవ్వాడు.

"గుర్తుంచుకోపడం కాదు. రిపోర్టు రాసివ్వండి. అంతే కాదు. ఈసారి మిమ్మల్ని చంపడానికి ఎవరైనా ట్రై చేస్తే వాడిని వదలకండి. పట్టుకోవడానికి ప్రయత్నించండి. వెంటనే పోలీసు రిపోర్టు ఇవ్వండి. ఎవడైనా దొరికితే వాడిని నాలుగు తంతే వాడే చెప్తాడు సంగతంతా" అన్నాడు అజీజ్.

జైపాల్ రిపోర్టు రాసి ఎస్. ఐ. అజీజ్ చేతికి ఇచ్చాడు.

## 2

"ఆటో ఎక్కడికి ఇటు పోతున్నది? సినిమాకి వెళ్దామని ఎక్కడికి తీసుకెళ్తున్నావు?" అనుమానంగా అడిగింది గీతారాణి.

జైపాల్ నవ్వాడు.

"నవ్వుతావెందుకు?"

"ఇప్పుడా నీకు అనుమానం వచ్చింది? స్టేషన్ దగ్గరకి వచ్చేస్తున్నాం" అన్నాడు.

"స్టేషన్ కా? ఏ స్టేషన్?" గాబరాగా అడిగింది.

"భయపడకు—పోలీస్ స్టేషన్ కి కాదులే. రైల్వే స్టేషన్ కి" అన్నాడు.

"ఎందుకూ?" ఆశ్చర్యంగా ప్రశ్నించింది.

"మనం విజయవాడ వెళ్తున్నాం."

"విజయవాడా? ఇప్పుడా! మరి సూట్ కేస్ తెచ్చుకోలేదేం?"

"సూట్ కేస్ తెస్తే నువ్వు బయిల్దేరవని భయపడ్డాను."

భయంగా చూసింది గీతారాణి.

"నే నెందుకూ?"

"ఎన్నిసార్లు చెప్పాలి గీతా! ఇప్పటికైనా నా మాట విను. ఇక సినిమాఫీల్డుకి గుడ్ బై కొట్టేసెయ్."

"నో...." దాదాపు అరిచినట్లు అంది గీత.

ఆటో డ్రైవర్ తిరిగిచూశాడు.

పోనివ్వమని సైగ చేశాడు జైపాల్.

స్లో చేసిన ఆటోని స్పీడెక్కించాడు డ్రైవర్.

"ఆవేశపడకు గీతా! ఇప్పటికి జరిగింది చాలు. హాయిగా మన వూరెళ్ళిపోదాం!"

"నేను రాను."

"ఎందుకు రావు? నేను నీ భర్తని. నువ్వేం చెయ్యాలో చెప్పేది నేను. నీ యిష్టంవచ్చినట్లు చెయ్యడానికి వీల్లేదు."

"నా భర్తవైనంతమాత్రాన నన్ను కీలుబొమ్మని చేసి ఆడించలేవు. ఆ రోజులు పోయాయి." ఆవేశంతో అంది గీత.

"నే నేం కీలుబొమ్మలా ఆడమని చెప్పడంలేదు,

భర్తతో కాపురం చెయ్యమని మాత్రమే చెప్తున్నాను"
గట్టిగా అన్నాడు జైపాల్.

"ఆ బుద్ధి ముందే వుండాలి. ఒక్కసారి ఆ ఫీల్డులోకి అడుగుపెట్టిన తర్వాత వెనక్కిరావడం అంత సులభం కాదు."

"మనిషి తల్చుకుంటే ఏ పనైనా సులభంగా చెయ్యొచ్చు"

"అవన్నీ నాకు అనవసరం. నేను రాను. ఇప్పుడిప్పుడే నాకు ఛాన్సులు వస్తున్నాయి. అరవంలో, మళయాళంలో గూడా ఆఫర్స్ వచ్చే సూచనలు కన్పిస్తున్నాయి. ఒకటి రెండేళ్ళల్లో నేను పెద్ద హీరోయిన్ అయ్యే అవకాశం వదులుకోవడం మూర్ఖత్వం."

"మొగుణ్ణి ఎదిరించి ఒంటరిగా వుండడం మూర్ఖత్వం కాదా?"

"సంవత్సరంనుంచీ వుంటున్నాను. ఇప్పుడు క్రొత్తగా వుండడం లేదు." రోషంగా అంది గీత.

"సంవత్సరం క్రితం గీతవి కావు నువ్వు. చాలా మారి పోయావు."

"అవును. మారాను, మార్పు సహజం."

"మాటలు నేర్చావు."

"అవును."

"ఇంతకీ నువ్వు ఎందుకు రానంటావు?"

"ఎందుకు రావాలి? ఎందుకో యీ రొంపిలోకి దించావు నువ్వు. ఎందుకో దిగాను నేను. ఇలాగే వుండనీ నన్ను. కావాలంటే నువ్వు వేరే పెళ్ళి చేసుకో. నాకేలాంటి అభ్యంతరం లేదు."

"యూ రాస్కెల్" అంటూ చాచి లెంపకాయ కొట్టాడు జైపాల్.

గీతారాణి యేడుస్తూ "ఎందుకు నన్ను కొడతావు? నేనేం తప్పుమాట అన్లేదు," అంది.

"నాకు తెలుసు నీ వుద్దేశ్యం ఏమిటో? నన్ను వదిలించుకోవాలని చూస్తున్నావు. ఫీల్డులో వున్నవాడిని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నావు."

"నో....అన్నీ అబద్ధాలు....ఎవరో నామీద దుష్ప్రచారం చేస్తున్నారు. అవన్నీ నమ్మి నన్ను ఫీల్డు వదిలెయ్యమంటున్నావు."

"అబద్ధాలు కావు. నిజాలు. నువ్వు ఆ రామ్‌కుమార్ గాడితో సంబంధం పెట్టుకున్నావు. అందుకే వాడు తన ఇనూప్లూయన్సు వుపయోగించి అన్ని పత్రికలలోనూ నీ గురించి గొప్పగా రాయిస్తున్నాడు. నన్ను వదిలించుకుని వాడిని పెళ్ళి చేసుకుంటానని మాట యిచ్చివుంటావు."

"అన్నీ అబద్ధాలు.... డ్రైవర్....ఆటో వెనక్కి తిప్పు" డ్రైవర్ వీపు తట్టి గట్టిగా అంది గీతారాణి.

"వద్దు....పోనియ్!" అన్నాడు జైపాల్.

గీత గట్టిగా అరిచి "వెనక్కి తిప్పకపోతే యిందులోనుంచి దూకుతా!" అని ముందుకు జరిగింది.

జైపాల్ ఆమెను గట్టిగా పట్టుకున్నాడు.

"ఆటో వెనక్కి తిప్పు. ఇంటికి పోనివ్వు" పిచ్చిదానిలా అరిచింది గీత.

ఆటో డైవర్ స్లో చేస్తున్నాడు.

జైపాల్‌కి భయం వేసింది గీత గోల చేస్తుందేమోనని. ఆమె ధోరణి గూడా అలాగే వుంది. పరువుపోతుందేమోనని ఆటో డ్రైవర్‌ని వెనక్కి పోనివ్వమన్నాడు.

# 3

గ్రాండ్ హోటల్ పదమూడో నెంబరు రూమ్ ముందు ఆగి "సార్! సార్!" అని తలుపు తడుతూ పిలుస్తున్నాడు బాయ్.

అతను అప్పటికి మూడుసార్లు ట్రై చేశాడు ఆ గదిలో కస్టమర్ని నిద్రలేపుదామని.

కాని అతను యెంత తలుపుకొట్టినా లేవడంలేదు. కిటికీ తలుపులు మూసివున్నాయి.

ఇక లాభంలేదని వెళ్ళి మేనేజర్కి చెప్పాడు.

మేనేజర్ విజిటర్స్ రిజిష్టర్ తెరచి చూశాడు ఆ ఆసామి యెవరా అని.

హనుమంతప్ప, అనంతపురం. వ్యాపారంకోసం విజయవాడ వచ్చినట్లు అందులో వుంది.

మేనేజర్ పదమూడో నంబర్ రూమ్ ముందు ఆగి "హనుమంతప్పగారూ!.....సార్! హనుమంతప్పగారూ!" అని కేకలు పెట్టాడు.

రెస్పాన్సు రాలేదు.

వాచీ చూసుకున్నాడు.

ఉదయం పది దాటుతోంది. ఇప్పటిదాక లేవలేదంటే అతగాడు రాత్రి ఫుల్ డోస్ పట్టించివుండాలి. లేదా సూసైడ్ చేసుకొని వుండాలి.

'సూసైడ్' అనగానే అతని గుండె జలదరించింది.

బాయ్ని కేకేశాడు. రాగానే అడిగాడు. "ఏరా బాబూ, రాత్రి ఈ రూమ్లో వాళ్ళకి బ్రాందీ, విస్కీలాంటివేవైనా సప్లై చేశావా?" అని.

కాని వాడు లేదు సార్ అన్నాడు. చికన్ బిర్యాని

మటన్ ఫ్రై వగైరా సర్వ్ చేశాననీ ఆ తర్వాత వాళ్ళు తాగారో తందనాలాడారో తనకి తెలియదని ఆ సర్వరు అన్నాడు.

మేనేజరుకి అనుమానం వచ్చింది.

"వాళ్ళు అంటున్నావు యిద్దరా." అని.

"ఇద్దరే."

మేనేజర్ కి మతిపోయింది. రిజిష్టర్ లో ఒక్కడి పేరే వుంది. ఇద్దరంటే ఆ రెండో మనిషి హనుమంతప్ప కాక మరెవరో వుండాలి.

లోపల యిద్దరుంటే కనీసం ఒక్కరైనా నిద్రలేవరా!

ఒకవేళ ఆ రూమ్‌లో సూసైడ్ జరిగివుంటే హోటల్ కి అప్రతిష్ట.

తాగిన మత్తులో ఒకళ్ళనొకళ్ళు పొడుచుకుంటే. మేనేజర్ గుండె ఆగినట్లయింది.

క్షణం గూడా ఆలస్యం చెయ్యకుండా పోలీస్ స్టేషన్ కి ఫోన్ చేశాడు.

అరగంట తర్వాత పోలీసులు వచ్చారు.

బద్దలు కొట్టారు తలుపులు.

ఒక్కడే వున్నాడు బెడ్ మీద.

టీపాయ్ మీద యెంగిలి ప్లేట్లు చిందర వందరగా వున్నాయి. రెండు గ్లాసులు వున్నాయి. మెక్ డోల్ బ్రాంది ఫుల్ బాటిల్ కూడ వుంది. అడుగున మూడు నాలుగు పెగ్గుల బ్రాంది వుంది.

ఎస్. ఐ. మూర్తి అతన్ని పరీక్షగా చూశాడు.

ప్రాణం లేదు అతనిలో.

"సూసైడ్ ఏమో!" అన్నాడు ఎస్. ఐ.

మేనేజర్ తెల్లముఖం వేసి చూస్తున్నాడు. భయంతో అతని నోట మాట రావటం లేదు.

"మీకేం ఫరవాలేదండి. భయపడకండి" అని హామీ ఇచ్చాడు ఎస్.ఐ.

అతను పేలవంగా నవ్వాడు.

"ఇతనేనా హనుమంతప్ప?" ప్రశ్నించాడు ఎస్.ఐ.

"కాదు సార్! రూమ్ తీసుకొన్నది ఇతను కాదు" అన్నాడు బాయ్.

మేనేజర్ ఆశ్చర్యంగా చూశాడు.

"మరి ఇతను ఎవరు?"

"ఏమో సార్! రాత్రి తొమ్మిది దాటాక ఇద్దరూ కలిసి వచ్చారు. తినడానికి తెప్పించుకొని తలుపులు వేసుకొన్నారు సార్!" అన్నాడు బాయ్.

"మరి అతను ఏడి?"

"ఏమో సార్!" అన్నాడు బాయ్.

"అతను ఎప్పుడు వెళ్ళిపోయాడో ఎవరూ చూళ్ళేదన్నమాట" అన్నాడు ఎస్.ఐ.

బాయ్ తల వూపాడు.

ఎస్.ఐ. రూమ్ అంతా పరీక్షగా చూశాడు. టేబులు మీద సూట్‌కేసు వుంది. కాని దాన్ని ముట్టుకోక ముందే ఫింగర్ ప్రింట్స్ తీయిస్తే నయంగదా అనుకొన్నాడు.

ఫోన్ చేసి ఫింగర్ ప్రింట్స్ ఎక్స్‌పర్టుని పిలిపించాడు.

"మీరేం భయపడకండి. మార్చురీ రిపోర్టులో అన్ని విషయాలూ తెలుస్తాయి. ఇది ఆత్మహత్యగాని హత్యగాని కానవసరంలేదు. హార్టు ఫెయిల్యూరయి గూడా పోయి వుండవచ్చు. త్రాగుబోతులకు హార్టెటాక్‌లు రావడం సర్వసాధారణం" అన్నాడు ఎస్.ఐ.

ఫింగర్ ప్రింట్స్ తీసుకొన్నాక రూమ్ సెర్చి చేశారు. సూట్ కేస్‌లో యేమీ లేదు. ఖాళీ. హతుడి జేబులో ఒక పోస్టుకార్డు వుంది. ఆ కార్డుమీద అడ్రస్‌నిబట్టి అతని పేరు జైపాల్ అనీ, రైల్వేగార్డుగా పని చేస్తున్నాడని తెలిసింది.

ఎస్.ఐ. రైల్వేస్టేషన్‌కి ఫోన్ చేశాడు.

కాసేపటికి రైల్వేస్టాఫ్ చాలామంది వచ్చారు. అతని తల్లిదండ్రులు ఏలూర్లో వున్నారు. టెలిగ్రాం యిచ్చారు ఏలూరు. ఎవరో చెప్పారు అతని భార్య సినీస్టార్ గీతా రాణి అని. కాని అడ్రస్ ఎవరికీ తెలియలేదు.

శవాన్ని పోస్టుమార్టమ్‌కి పంపించారు.

## 4

శవాన్ని తీసుకెళ్ళటానికి జైపాల్ తండ్రి వచ్చాడు. టాక్సీ మాట్లాడుకొన్నారు ఏలూరు వరకు శవాన్ని తీసుకెళ్ళడానికి. జైపాల్ బావ, అక్క విజయవాడలోనే వున్నారు. వాళ్ళుగూడ ఏలూరు ప్రయాణమయ్యారు.

గీతారాణిని ఏలూరు రమ్మని టెలిగ్రాం ఇచ్చారు.

"నేను యెంతో చెప్పిచూశాను సార్—దాన్ని పెళ్ళి చేసుకోవద్దురా అని. వాడు వినలేదు. ఎవరికీ చెప్పకుండా రజిష్టర్ మ్యారేజి చేసుకున్నాడు" అన్నాడు జైపాల్ తండ్రి.

ఇన్‌స్పెక్టర్ అజీజ్ మౌనంగా వుండిపోయాడు.

జైపాల్ గురించి యెన్నో సంగతులు చెప్పాడు అతని తండ్రి. గీతారాణికి ముందూ వెనకా యెవరూ లేరట. నాటకాలు ఆడుకొంటూ వుండేదట. ఆమెది ఏలూరే

నట. జైపాల్‌కి యెలాగో పరిచయమైందట. పెద్దవాళ్ళని యెదిరించి పెళ్ళి చేసుకున్నాడట.

"వాడు దాన్ని పెద్ద సినీమాస్టార్‌ని చేసి డబ్బు సంపాదించాలని దురాశపడ్డాడు సార్. దురాశ వాడి ప్రాణాలు తీసింది" అన్నాడు జైపాల్ తండ్రి.

ఇన్‌స్పెక్టర్ అజీజ్‌కి జైపాల్ తెలుసు.

నెలరోజుల క్రితం అతన్ని కలుసుకొని తనని రామ్‌కుమార్ చంపడానికి ట్రై చేస్తున్న సంగతి చెప్పాడు. తనకి యేదైనా ప్రమాదం జరిగితే దానికి కారణం రామ్‌కుమారేనని రిపోర్టు రాసిచ్చాడు.

అదంతా జ్ఞాపకం వచ్చింది అజీజ్‌కి.

విషప్రయోగంతో జైపాల్ మరణించినట్లు పోస్టుమార్టమ్ రిపోర్టులో తేలింది.

జైపాల్ తనని అనుమానించి పోలీసులకు రిపోర్టు యిచ్చిన సంగతి రామ్‌కుమార్‌కి తెలిసివుండదు.

అందుకే ధైర్యంగా జైపాల్‌ని తను మారుపేరుతో తీసుకొన్న రూమ్‌కి తీసుకెళ్ళి బాగా త్రాగించి అందులో విషం కలిపి చంపాడు.

అయితే రామ్‌కుమార్ తనని చంపడానికి ప్రయత్నిస్తున్న సంగతి జైపాల్ మర్చిపోయాడా?

అది ఎలా సాధ్యం.

ఆలోచిస్తూ కూర్చున్నాడు అజీజ్.

ఫింగర్ ప్రింట్స్ రిపోర్టుగూడ వచ్చింది.

ఆశ్చర్యకరమైన విషయ మేమిటంటే అందులో జైపాల్ వేలిముద్రలు తప్ప అవతలి వ్యక్తి ముద్రలు దొరకలేదు. బ్రాందీబాటిల్ మీద, ప్రింట్స్ రాలేదు. ఒక గ్లాసుమీద మాత్రమే వచ్చాయి.

అంటే రామ్‌కుమార్ యెంతో తెలివిగా చేశాడు ఈ హత్య. తన వేలిముద్రలు యెక్కడా పడకుండా జాగ్రత్త పడడమో, లేక పడిన వేలిముద్రలు గుడ్డతో తుడిచి వెళ్ళిపోవడమో చేసివుంటాడని అనుకొన్నాడు.

టెలిఫోన్ రింగైంది.

రిసీవర్ ఎత్తి "హలో!" అన్నాడు.

"..........."

"ఎస్. ఎస్సార్. ఇప్పుడే వస్తున్నా సార్!" అని హడావుడిగా బయల్దేరాడు ఇన్‌స్పెక్టర్ అజీజ్.

"రిపోర్టు తెచ్చావా?" అన్నాడు ఎస్.పి.

"ఎస్సార్!" అంటూ ఫైల్ ముందు పెట్టాడు.

"మనం యీ రామ్‌కుమార్‌ని యెంతవరకూ అనుమానించవచ్చు? యెందుకంటే అతను మన వూరివాడు కాదు గదా?" అన్నాడు ఎస్.పి. సందేహంగా.

"దానేముంది సార్! హత్య చెయ్యదల్చుకొన్నవాడు ఇక్కడకు రావచ్చుగదా!"

"అఫ్‌కోర్స్!...."

"రామ్‌కుమార్ హత్యజరిగిన రోజు ఇక్కడ వున్నాడా లేడా? అనేది తెలుసుకోవాలి మనం" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"రామ్‌కుమార్ ఫిలిం జర్నలిస్టుగదూ?"

"ఎస్సార్!"

"ఈమధ్య ఇక్కడ ఒక పిక్చర్ అవుట్‌డోర్ షూటింగ్ జరిగింది. మనం పోలీసు బందోబస్తుగూడ యేర్పాటుచేశాం. రామ్‌కుమార్ వాళ్ళతోపాటు వచ్చాడేమో తెలుసుకో ముందు. మనకి మేఖల పిక్చర్స్‌వాళ్ళు అప్లికేషన్ పెట్టారు బందోబస్తు కావాలని. వాళ్ళ ఆఫీసు

గాంధీనగర్‌లో వుంది. యింక్వయిరీ చెయ్యి. అతను గనుక యిక్కడికి వచ్చి వుంటే వెంటనే ఫోన్ చెయ్యి."

ఇన్‌స్పెక్టర్ అజీజ్ వెళ్ళిపోయాడు.

## 5

"గుడ్‌మార్నింగ్!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ అజీజ్ యెక్కౌంట్సులో మునిగిపోయి వున్న అతన్ని చూసి.

అతను తలెత్తి చూస్తే ఇన్‌స్పెక్టర్ కన్పించాడు. పోలీసులకి తనతో యేం పనో అర్థంకాక ఆశ్చర్యంగా చూశాడు.

"గుడ్‌మార్నింగ్! ప్లీజ్ టేక్ యువర్ సీట్" అన్నాడు మేఖల పిక్చర్స్ మేనేజర్.

"ఈమధ్య హోటల్ గ్రాండ్‌లో హత్య జరిగింది. ఆ కేసు యెంక్వయిరీ చేస్తున్నాము. మీ దగ్గర కొంచెం ఇన్ఫర్మేషన్ కావాలి" అన్నాడు అజీజ్.

"ఆ హత్య గురించి పేపర్లో చదివాను. కాని మాకు ఆ హత్యతో సంబంధం యేముంది?" గాభరాగా అన్నాడు మేనేజర్.

"మీకు సంబంధం వుందని కాదు. అసలు విషయం చెప్పనివ్వండి. ఈమధ్య ఒక పిక్చర్ అవుట్‌డోర్ షూటింగ్ ఇక్కడ జరిగింది కదా!"

"అవును."

"షూటింగ్‌కి అంతరాయం కలగకుండా పోలీస్ బందోబస్తు కావాలని మా డిపార్టుమెంటుకి మీరు అప్లికేషన్ పెట్టారు."

"అవును. ఆ పిక్చర్ మేము డిస్ట్రిబ్యూషన్ తీసు

కున్నాను. అందుకే వాళ్ళకి కావల్సిన ఫెసిలిటీస్ చూపించాము."

"అవుట్ డోర్ షూటింగ్ కి కొందరు ఫిలిం జర్నలిస్టులు గూడా వచ్చినట్లు తెలిసింది."

"అవును. ప్రొడ్యూసర్ రాసిన లెటర్ లో అందరి పేర్లూ వున్నాయి. ఎవరు కావాలి మీకు?"

"రామ్ కుమార్ అనే ఫిలిం జర్నలిస్టు అందులో వున్నాడేమో చూడండి!"

మేనేజర్ డ్రాయర్ సొరుగు తెరిచి ఫైలు తీసి చూశాడు.

"ఎస్. వున్నాడు సార్! రామ్ కుమార్ ఫిలిం జర్నలిస్టు."

లెటర్ తీసి చూపించాడు.

"ఇది ప్రొడ్యూసర్ రాసింది. ఎవరెవరు వస్తారో రాశాడు. కాని ఇందులో రాసినవాళ్ళందరూ రాకపోవచ్చుగదా! అలాగే రామ్ కుమార్ వచ్చాడా? వస్తే యే హోటల్లో బసచేశాడు? యెప్పుడు వచ్చాడు? ఎప్పుడు వెళ్ళాడు? ఆ వివరాలన్నీ కావాలి" అన్నాడు ఇన్ స్పెక్టర్ అజీజ్.

ఫైలు చూసి ఆ వివరాలన్నీ చెప్పాడు మేనేజర్.

హత్య జరిగింది ఏడో తేదీ రాత్రి. రామ్ కుమార్ వెళ్ళింది ఎనిమిదో తేదీ మధ్యాహ్నం. అంటే హత్య జరిగినప్పుడు అతను విజయవాడలోనే వున్నాడన్న మాట....!

'గుడ్' అనుకొన్నాడు ఇన్ స్పెక్టర్ అజీజ్.

# 6

"నాకు అరెస్టు వారెంటా?" ఆశ్చర్యపోతూ అన్నాడు రామ్‌కుమార్.

"ఎస్!" ఇన్‌స్పెక్టర్ అజీజ్ చూపించాడు.

"నాకు అంతా అయోమయంగా వుంది" ఖిన్నుడై అన్నాడు.

"ఇప్పుడు అలాగే వుంటుంది" వ్యంగ్యంగా అన్నాడు అజీజ్.

"ప్రామిస్ ఇన్‌స్పెక్టర్. నాకేం తెలియదు."

"అదంతా స్టేషన్‌లో చెప్పకుందురుగాని" హెడ్ కానిస్టేబుల్‌కి సంజ్ఞ చేశాడు అజీజ్.

రామ్‌కుమార్ కోసం పోలీస్ వ్యాన్ వచ్చిందని ఆ ఫ్లాట్‌లో వున్న వాళ్ళందరికీ తెలిసిపోయింది.

కొందరు అతని పోర్షన్ ముందు గుమిగూడారు.

రామ్‌కుమార్ హత్య కేసులో యిరుక్కున్నాడని ఆ వీధిలో అందరికీ తెలిసిపోయింది.

రామ్‌కుమార్‌కి యింకా పెళ్ళి కాలేదు. ఇంట్లో అతనొక్కడే వున్నాడు.

తను పనిచేసే పత్రిక ఎడిటర్‌కి ఫోన్ చేసి ఈ సంగతి చెప్పమని ప్రక్క పోర్షన్ వాళ్ళకి చెప్పాడు రామ్‌కుమార్.

అతన్ని పోలీస్ వ్యాన్ యెక్కించి స్టేషన్‌కి తీసుకు వెళ్ళారు.

# 7

గ్రాండ్ హోటల్ బాయ్ గాని, మేనేజర్ గాని రామ్‌కుమార్‌ని గుర్తించలేదు.

హత్య జరిగిన రోజు జైపాల్‌ని హోటల్‌కి తీసు

కొచ్చింది రామ్‌కుమార్ కాదు. అంతేకాదు అందులో పదమూడో రూమ్ బుక్ చేసింది రామ్‌కుమార్ కాదు. అతను ఎవరో? రామ్‌కుమార్ కంటే లావుగా వుంటాడనీ, కొంచెం యెత్తుగానే వుంటాడనీ బాయ్ స్టేట్‌మెంటు ఇచ్చాడు.

మేఖల డిస్ట్రిబ్యూటర్స్ అరేంజ్ చేసిన హోటల్లోనే బస చేసినట్లు, హత్య జరిగిన రోజు రాత్రంతా అదే హోటల్లో రామ్‌కుమార్ వున్నట్లు, ఖచ్చితమైన ఎలిబీ వుంది. తోటి జర్నలిస్టులు, కొందరు ఆర్టిస్టులు, ప్రొడక్షన్ వాళ్ళు అతనికి సాక్ష్యం వున్నారు.

అంటే రామ్‌కుమార్‌కి ఈ కేసులో డైరెక్టు ఇన్వాల్వ్‌మెంట్ లేదు. జైపాల్‌ని హత్య చేయించడానికెవర్నో నియోగించడానికి ప్రయత్నించినప్పుడు గూడ వేరే మనిషిని నియోగించాడు.

లోగడ జైపాల్ పోలీసులకు ఆ విషయం రిపోర్టు చేశాడు.

జైపాల్ యిచ్చిన రిపోర్టు తప్ప రామ్‌కుమార్ అతన్ని చంపించాడనడానికి ఏ యితర ఆధారమూ దొరకలేదు.

రామ్‌కుమార్‌ని బెయిలుమీద విడిచిపెట్టారు.

కేసు యిన్వెస్టిగేట్ చేసి బలమైన సాక్ష్యం సేకరించడానికి, జైపాల్‌ని హత్య చేసిన వ్యక్తి హనుమంతప్ప పేరుతో గ్రాండ్ హోటల్లో రూమ్ బుక్ చేసిన అతని ఆచూకీ కనిపెట్టడానికి క్రైం బ్రాంచి నుంచి ఇన్‌స్పెక్టర్ కన్నారావుకి అప్పగించారు.

ఐడెంటిటీ కార్డు చూపించాక కూర్చోమని సోఫా చూపించింది గీతారాణి.

ఆమె చాల విచారంగా కనిపించింది.

"నేను విజయవాడ క్రైంబ్రాంచినుంచి వచ్చాను. ప్రత్యేకంగా." అన్నాడు కన్నారావు.

ఆమె తల వూపింది.

"మీరు మీకు తెలిసిందంతా చెప్పాలి."

"అలాగే."

"మీ భర్తని రామ్‌కుమార్ హత్య చేయించాడని మీరు నమ్ముతున్నారా?"

"ఆ విషయం నాకు అర్థంకావడంలేదు. నేనేం చెప్పలేకుండా వున్నాను." అంది గీతారాణి.

"రామ్‌కుమార్ బాచ్‌లర్. అవునా?"

"అనుకుంటాను. ఆ విషయం నాకెప్పుడూ చెప్పలేదు అతను."

"సినీ ఫీల్డులో చేరాక మీరు మారిపోయారనీ, మీ మనసు రామ్‌కుమార్ వైపు మొగ్గిందనీ, తనని వదిలించుకుని అతన్ని పెళ్ళిచేసుకోవాలని అనుకుంటున్నారనీ, మీ భర్త అనుమానించేవారు."

"అవును. ఆయన నాతో ఆ విషయం అనేకసార్లు అన్నారు. ఎవరో నా మీద లేనిపోనివి కల్పించి చెప్పి ఆయన మనసు పాడుచేశారు. అందుకే ఆయన ఫీల్డు వదిలిపెట్టి యింటికి రమ్మని గొడవ పెట్టారు. రామ్‌కుమార్‌కీ నాకు సంబంధం వుందని పుకారు పుట్టించిన వాళ్ళెవరో నాకు అర్థం కావడం లేదు." అంది గీతారాణి.

"రామ్‌కుమార్ యెటువంటివాడు?"

"మంచివాడేనని అనుకుంటున్నాను. చెడ్డవాడనుకునేందుకు నాకు ఏమీ ఆధారం దొరకలేదు."

"రామ్‌కుమార్ తరచుగా మీ కోసం వస్తుంటాడని, మీరంటే అతనికి ప్రత్యేకమైన అభిమానం వుందనీ,

అందుకే మీకు పత్రికలలో ప్రచారం చేస్తున్నాడనీ అతని మీద ఆరోపణ వుంది. మీరేం చెప్తారు."

"అతను నాకు మంచి స్నేహితుడు. నేను నాటక రంగంనుంచి ఫీల్డుకి వచ్చినదాన్ని. నాలో ఎంతో టాలెంట్ వుందనీ, కొంతకాలానికి అగ్రస్థానంలోకి వచ్చే అవకాశంవుందని అతను నన్ను ప్రోత్సహిస్తూ వుండేవాడు. నేను మంచి నటిని అని అతనికి అభిమానం వుంది."

"అంతేనా?"

గీతారాణి సీరియస్‌గా చూసింది.

"ఇంకేం వుంటుంది?"

"బాగా ఆలోచించి చెప్పండి. ఈ రోజుల్లో ఏ స్వార్థం లేకుండా మరొకర్ని పైకి తీసుకురావాలనే తపన ఎవరికి వుంటుంది? టాలంట్‌ని అభిమానించేవాళ్ళు వన్ పర్సెంట్ వుంటారేమో?"

"ఆ వన్ పర్సెంట్ రామకుమార్ యెందుకు కాగూడదు?" సూటిగా ప్రశ్నించింది.

"అఫ్‌కోర్స్ కావచ్చును. నేను అడిగేది కేవలం మీ కోణం నుంచే జవాబు చెప్పమని కాదు. ఒక టాలెంట్ ఆర్టిస్టు నావల్ల పైకి వచ్చింది అనే తృప్తికోసం అతను మిమ్మల్ని ప్రోత్సహిస్తే మంచిదే. అదే స్వార్థం కోసం చేశాడనుకోండి. దాని ఫలితమే జైపాల్ హత్య."

గీతారాణి వులిక్కిపడింది.

"మీ భర్త మరణించకముందు అతన్ని ఎవరో హత్య చెయ్యడానికి ప్రయత్నించేవారన్న సంగతి మీకు అప్పుడు తెలియదా?"

"తర్వాత తెలిసింది." అంది ఆమె,

"ఇప్పుడు చెప్పండి రామ్‌కుమార్‌తో మీ పరిచయం యెంతవరకు?"

అర్థం కానట్లు చూసింది గీతారాణి.

"మీకు ఎలా చెప్పాలో అర్థం కావడం లేదు. వేరే విధంగా భావించుకోకండి. ఎవర్నో యీ విషయాలు అడిగే బదులు మిమ్మల్నే అడిగితే మంచిదని అడుగుతున్నాను. మీ భర్తని హత్య చేసిందెవరు? చేయించిన దెవరు? అని తెల్సుకోవాల్సిన కుతూహలం మీకూ వుంటుంది గదా?"

ఆమె తల వూపింది.

"రామ్‌కుమార్ రాత్రిళ్ళు మీ యింట్లో గడిపే వాడా?"

పిడుగుపడిన కొబ్బరిచెట్టులా వణికిపోయింది గీతారాణి.

"నో...." గట్టిగా అరిచినట్లు అంది.

"దట్సాల్ రైట్. మీరు బాధపడకండి. ఆ విషయం తెలుసుకోవడం వలన నాకు యెంతో వుపయోగముంది."

ఆమె బాధతో తల వంచుకుంది. కనుకొలుకుల్లో నిండిన నీరు చీర చెంగుతో తుడుచుకొంది.

"మీకు పెళ్ళికాలేదని చెప్పమని రామ్‌కుమారే సలహా యిచ్చాడని మీ భర్త ఒకసారి మావాళ్ళకి స్టేట్‌మెంట్ ఇచ్చాడు. నిజమేనా?"

"నిజమే."

"ఎందుకు?"

"పెళ్ళయిన నటికి పరిశ్రమలో గుర్తింపు వుండదనీ, ప్రేక్షకులలో గ్లామర్ వుండదనీ చెప్పాడు. నాకూ నిజమే ననిపించింది. నా భర్తతో ఆ విషయం చెప్పాను గూడా,

నేను పైకి రావడమే అతనికి కావాలి. అందుకే ఒప్పు కున్నారు. అప్పుడప్పుడూ వస్తూండేవాడు యిక్కడికి. మా బావ అని రిఫర్ చేస్తుండేదాన్ని."

"ఐ. సీ...."

"ఇప్పుడు అనిపిస్తూవుంది తప్పు చేశానేమోనని."

తల వూపాడు కన్నారావు.

"అలా నాటకం ఆడడంవల్ల ఎన్నో అనర్థాలు కలి గాయి. రాజ్‌కుమార్ మీద అనుమానం కలగడం. నన్ను యింటికి తిరిగిరమ్మని బలవంతం చెయ్యడం....అవన్నీ...."

"పెళ్ళయిన నటికి పరిశ్రమలో గుర్తింపువుండదని అను కోవడం సరైనది కాదేమో?"

"వచ్చిన క్రొత్తలో ఏమీ తెలిసేది కాదు. అంతా అయోమయంగా వుండేది. ఎవరేం చెప్పినా నిజమే నేమో అనిపించేది. రాజ్‌కుమార్ మాట పాటించకుండా వుంటే బాగుండేది. నా భర్త నా వెంట తిరిగేవాడు. అతనికి ఏవిధమైన అనుమానాలు వచ్చివుండేవి కావు." బాధ పడింది గీతారాణి.

"మీ భర్తని హత్యచెయ్యడానికి యింకెవరికైనా అవసరం వుందా? అంటే ఆయన చనిపోతే వాళ్ళకే దైనా లాభం వుందా అని?" ప్రశ్నించాడు కన్నారావు.

గీతారాణి ఆలోచనలో పడింది.

"మీరు బాగా ఆలోచించుకోండి. మళ్ళీ కలుస్తాను." అన్నాడు కన్నారావు.

పనిమనిషి కాఫీ తెచ్చి టీపాయ్‌మీద పెట్టింది.

"తీసుకోండి," అంది.

కాఫీ తీసుకుని వచ్చేశాడు కన్నారావు.

# 8

తనని కేకేసిన అతన్ని చూసి అటు కదిలాడు షణ్ముగం.

"నన్నేనా సామీ పిలిచింది" అన్నాడు.

"నిన్నే. నీ పేరు షణ్ముగం కదూ!"

"అవు సామీ."

"నువ్వు బ్రోకరు వటగా."

"అవు."

"నాకో పోర్షన్ కావాలి."

"ఫ్యామిలీ పోర్షనా?"

"ప్రొడక్షన్ ఆఫీసుకి."

"మీరుదా ప్రొడక్షన్ చేస్తురా!"

"చేద్దామనే గదా యింతదూరం వచ్చింది."

"బాడుగ యెంత యిస్తురు?"

"వెయ్యి వరకూ ఫరవాలేదు. కార్లు వచ్చి వెళ్ళడానికి వీలుండాలి. సందుల్లో గొందుల్లో పనికిరాదు. మంచి వీధిలో కావాలి."

షణ్ముగం ఆలోచనలో పడిపోయాడు.

రాత్రి ఎనిమిది దాటింది.

రోడ్డు జనసమ్మర్దంగా వుంది.

"నా రూంలో మాట్లాడుకుందాం రా."

ఇద్దరూ ఉదయ్ లాడ్జి మెట్లెక్కి పైకి వెళ్ళారు.

కన్నారావు రూమ్ తాళం తీసి లోపలికి అడుగుపెట్టి లైటు వేశాడు.

"రా కూర్చో!"

షణ్ముగం సంశయిస్తూ వెళ్ళి కుర్చీమీద కూర్చున్నాడు.

"నీ యిల్లెక్కడ?"

షణ్ముగం చెప్పాడు.

"సినీస్టార్ గీతారాణి మీ వీధిలో నే నన్నమాట."

"అను సామి!" నవ్వాడు షణ్ముగం.

కన్నారావు సూట్ కేస్ తీసి రమ్ బాటిల్ పైకి తీసి టేబుల్ మీద పెట్టాడు.

షణ్ముగం కళ్ళు మెరిశాయి.

బట్టలు విప్పుకొన్న ఆడదాన్ని చూసినట్లు కళ్ళార్పకుండా చూశాడు.

కన్నారావు బెల్ నొక్కాడు.

కాసేపటికి బాయ్ వచ్చాడు.

"రెండు చికెన్ బిర్యాని మటన్ ఫ్రై ప్లేట్లు రెండు, పావుకిలో మిక్చర్ తీసుకురా!"

బాయ్ వెళ్ళిపోయాడు.

"ప్రొడక్షన్ కి మంచి పోర్షన్లు ఏవైనా నీ ఎరికలో వున్నాయా? కొంచెం ఆలస్యమైనా ఫర్వాలేదు. తొందరేం లేదు." అన్నాడు కన్నారావు.

"ఎందుకు లేవు సామి. బోలెడు వుండాయి. తమరుదా వచ్చి చూసుకోవాలి."

"అట్లాగే చూద్దాం. మీ వీధిలో ఏం లేవా?"

"లేవు సామి."

"మీ వీధిలో అయితే బాగుండేది." విచారంగా అన్నాడు కన్నారావు.

"ఏం? సామి."

"నేను తియ్యబోయే పిక్చర్లో గీతారాణిని హీరోయిన్ గా బుక్ చేద్దామనుకొంటున్నాను."

షణ్ముగం మాట్లాడలేదు.

"గీతారాణి అంటే నాకెంతో ఇష్టం."

బాయ్ వచ్చాడు. అన్నీ ప్లేట్లలో సర్ది వెళ్ళి పోయాడు.

షణ్ముగం ఆసక్తిగా చూస్తున్నాడు.

"అలవాటుందా?" బాటిల్ వంపి గ్లాసులోకి పోస్తూ అన్నాడు కన్నారావ్.

షణ్ముగం నవ్వాడు. కొంచెం సిగ్గుపడ్డాడు.

"ఫరవా లేదు చెప్పు. నీ వల్ల నాకు పని కావాలి గదా!"

"ఎప్పుడన్నా!" అన్నాడు పళ్ళన్నీ బైటపెట్టి.

"ఆహా!....అయితే ఫరవాలేదు" అంటూ రెండో గ్లాసులోకి వంచి నీళ్ళు పోశాడు.

"తీసుకో!....ఛీర్స్....చెప్పు" అన్నాడు కన్నారావు నవ్వుతూ.

షణ్ముగం మొగమాటపడుతూనే అందుకున్నాడు. త్రాగి చాలా రోజులైందేమో రెండు పెగ్గులు వేసుకునే సరికి యెక్కింది అతనికి. కుర్చీలోంచి లేచి బెడ్ మీద నడుం వాల్చాడు.

అతన్ని చూసి నవ్వుకొన్నాడు కన్నారావు.

"ఏవోయ్ షణ్ముగం. నాకు ఇక్కడంతా క్రొత్త. నువ్వు అన్నీ చెప్పాలి."

"తమకేం భయంవద్దు సామి"ముద్దముద్దగా వున్నాయి షణ్ముగం మాటలు.

"నాకు సినిమా ఫీల్డులో ఏ,బి,సి,డీలు రావు. అయినా పిక్చర్ తీద్దామని బయల్దేరాను. యెందుకో తెలుసా? గీతా రాణికోసం. ఐ లైక్ హెర్ టూ!"

షణ్ముగం ఆశ్చర్యంగా వింటున్నాడు.

"నీకు గీతారాణి తెలుసా?"

తలవ్రాతను షణ్ముగం తెలుసునన్నట్లు.

"నన్ను పరిచయం చేస్తావా? నీకు యెంత డబ్బు కావాలంటే అంత ఇస్తాను."

ఇబ్బందిగా చూశాడు.

"నాకు అంత చనువులేదు."

"ఆ వీధిలో వుంటున్నావు. పైగా బ్రోకర్‌వి. ఆ మాత్రం చనువులేదా?" నవ్వాడు కన్నారావు.

షణ్ముగం మాట్లాడలేదు.

"నాకు డబ్బుంది. మా ఫాదర్‌కి ఒక్కణ్ణే కొడుకుని. పది లక్షలు మా ఆస్తి. ఎందరో బోలెడు కట్నం యిచ్చి పెళ్ళి చేస్తామంటున్నారు. బోర్. నాకు గీతారాణిని పెళ్ళి చేసుకోవాలని వుంది" అన్నాడు కన్నారావు.

ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేశాడు షణ్ముగం.

"ఆవిడకి పెళ్ళైపోయింది గదా సామి!"

"నాకూ తెలుసు ఆ సంగతి. కాని ఇప్పుడు ఆమె భర్త లేడుగదా! ఆమె విడో. అయితేనేం? సినీస్టార్ గదా! విడో అయినా ఫరవాలేదు."

షణ్ముగానికి యేం చెప్పాలో అర్థంకాక చూస్తూ వుండిపోయాడు.

"ఎవరిద్వారానైనా ఫర్వాలేదు. చెప్పు. ఆవిడకు బాగా దగ్గరవాళ్ళు నీ కెవరూ తెలియదా?"

"గుర్నాథం తెలుసు సామి."

"ఎక్కడుంటాడు?"

"గీతారాణి వుంటే ఫ్లాట్‌లోనే ఔట్‌హౌస్‌లో వుంటాడు."

"ఐ. సీ. ఏం చేస్తుంటాడు?"

"ఆడూ వేషాలు వేస్తుంటాడు."

"నీకు తెలుసా?"

"ఆఁ.... తెలుసు సామి. సారాయికొట్లో తగిలేవాడు. నాకు ఫ్రెండు బాగా!"

కన్నారావు కళ్ళు మెరిసాయి.

"అలాగా. గుర్నాధానికి గీతారాణి బాగా తెలుసన్న మాట. అయితే అతని మాట వింటుందంటావా?"

"డబ్బు సామీ!....డబ్బుకోసం వింటది" నవ్వాడు షణ్ముగం.

"డబ్బుకోసమైనా యెవరికి బడితే ఆడికి వింటదా? గుర్నాధానికి గీతారాణి యిక్కడే తెలుసా? వాళ్ళూరు నుంచీ తెలుసా?"

"ఇద్దరిదీ ఒక వూరే సామీ!"

"అలాగా."

"కాని గుర్నాథం ఎవర్నీ ఆవిడ దగ్గరికి జేరనీడు."

"ఏం?...."

"ఇద్దరూ కలిసి నాటకాలు ఏసేవాళ్ళట. అందుకని ఫ్రెండ్‌షిప్‌గా వుంటారు."

"అయితే మనం వెంటనే గుర్నాధాన్ని కలుసుకోవాలి. గీతారాణిని పెళ్ళి చేసుకోవడానికి ఎంత డబ్బు అయినా ఖర్చుపెడతాను."

"ఇప్పుడా?"

"ఏం?"

"వాడు వుంటాడో లేదో? రేపు నేను పట్టుకొస్తాను సామీ."

కన్నారావు "సరే....సరే...." అన్నాడు సంతోషంగా.

కన్నారావు కాఫీ త్రాగుతూ వుండగా గుర్నాథాన్ని వెంటబెట్టుకొని వచ్చేశాడు షణ్ముగం.

"నమస్తే! గురునాథంగారూ! రాత్రే మిమల్ని కలుసుకుందామని అనుకొన్నాను. మన షణ్ముగం ఏమో మీరు వుంటారో వుండరో! యెక్కడికైనా వెళ్ళారేమో అన్నాడు" అన్నాడు కన్నారావు.

గుర్నాథం ప్రతినమస్కారం చేసి కూర్చున్నాడు.

"తమరు మాట్లాడతా వుండండి సామి! నాకుగా వేరే పని వుందాది. మళ్ళీ వస్తును" అని వెళ్ళిపోయాడు షణ్ముగం.

"షణ్ముగం మీకు అన్నీ చెప్పి వుంటాడనుకుంటాను. మీరు నాకు సహాయం చెయ్యాలి" అన్నాడు.

"అలాగే!" అన్నాడు గుర్నాథం తల త్రిప్పుతూ.

కాలింగ్ బెల్ నొక్కి బాయ్‌తో కాఫీ తెప్పించాడు కన్నారావు.

"నా కోరిక తీరుతుందంటారా?"

"ఎందుకు తీరదు? కాని కాస్త టైమ్ తీసుకుంటుంది. ఎందుకంటే భర్త చనిపోయాడని విచారంలో వుంది కదా! ఐదారు నెల్లు గడిస్తే మళ్ళీ మనుష్యుల్లో పడుతుంది. సమయం చూసి నేను ఏర్పాటు చేస్తాను గదా!" అని నవ్వాడు గుర్నాథం.

"హమ్మయ్య ఆ మాత్రం హామీ యిస్తే చాలు నాకు. ఎందుకంటే ఇది నా ప్రెస్టేజి విషయం. గీతారాణిని పెళ్ళిచేసుకుంటానని ఫ్రెండ్స్‌తో ఛాలెంజీ చేసివచ్చాను. మనకి ఓటమి వుండగూడదు."

గుర్నాథం విస్తుపోయి చూశాడు.

"నిజమేసార్ నేను చెప్పేది. డాడీతో తెగేసి చెప్పాను. నేను సినీఫీల్డుకి వెళ్ళిపోతున్నానని. ఫోర్ లాక్స్ యివ్వడానికి ఒప్పుకున్నాడు. ఈ లోపల గీతా రాణిని హీరోయిన్ చేసి పిక్చర్ తీద్దాం. ఏమంటారు?"

"షేష్! బ్రహ్మాండంగా తియ్యొచ్చు."

"షణ్ముగానికి చెప్పాను. ప్రొడక్షన్ ఆఫీస్ మంచి లొకాలిటీలో చూడమని."

"చూద్దాం. లైన్ ప్రొడక్షన్ వాళ్ళు ఖాళీ చేస్తున్నారు. మనం అది తీసుకుందాం."

"వెరీగుడ్! గుర్నాథంగారూ! నాకు ఏమీ తెలియదు ఫీల్డు గురించి. అన్నీ మీరే చూసుకోవాలి. అసలు పిక్చర్ తియ్యడానికి యెంత టైము పడుతుంది?"

"డబ్బుంటే నెల" అన్నాడు గుర్నాథం.

"నెల.... నెలలో ఐపోద్దా?"

"మరీ మాట్లాడితే పదిహేను రోజులు. కొందరు వారంలో తీసినవాళ్ళున్నారు."

"అవి ఒకరోజైనా ఆడతాయా?" నాలిక్కరుచుకొన్నాడు కన్నారావు.

"కథలో దమ్ముంటే రెండొందల రోజులు ఆడుతుంది."

"కథలో దమ్ము. అదెక్కడ దొరుకుతుంది?"

"పిక్చర్‌కి మంచి కథ కావాలి గదా! నా దగ్గరే బోలెడున్నాయ్!"

"మీరు కథలు రాస్తారా?" ఆశ్చర్యపోయాడు కన్నారావు.

"ఇక్కడ డబ్బుంటే అన్నీ మనమే చేసుకోవచ్చు."

"అలాగా? కథలు రచయితలు రాస్తారనుకొంటున్నా యిన్నాళ్ళూ."

"మీరు భలే జోక్ చేస్తున్నారే. ఇక్కడ ప్రొడ్యూ సరే కథలు, స్క్రీన్ ప్లేలూ రాసుకొంటూంటాడు. పోనే ఏడ్చిపోతారని డైలాగ్స్, పాటలు, రాయడానికి రచ యితల్ని అప్పుడప్పుడూ పిలుస్తుంటారు."

"భలే గమ్మత్తుగా వుందే."

"అంతా గమ్మత్తే ఇక్కడ."

"అయితే నాకు కథ రాయడం రాదే ఎట్లా?" విచా రంగా అన్నాడు కన్నారావు.

గుర్నాథం పకపక నవ్వి "మీ బదులు నేను లేనూ? నా దగ్గర బోలెడున్నాయి, సూపర్ హిట్ కథలు" అన్నాడు.

"మీరు గీతారాణితో కలిసి నాటకాలు వేశా రంటగా!"

"ఆఁ.... నేను హీరోగా వేసేవాణ్ణి. ఆమె హీరో యిన్‌గా వేసేది. నాకు బాగా పరిచయం. తర్వాత పెళ్ళి చేసుకొని వెళ్ళిపోయింది. యీ మధ్యనే ఫీల్డుకు వచ్చింది."

"అయితే పాత పరిచయమే నన్నమాట."

"అన్నమాటే" నవ్వాడు గుర్నాథం.

"మీరు ఎప్పట్నుంచో ఫీల్డులో వుంటున్నారు గదా! మీకు గుర్తింపు రాలేదే ఇంకా?"

"దురదృష్టం."

" 'మొద్దు రాముడు'లో మీరు బ్రహ్మాండంగా చేశారు."

"ఆఁ....ఆ తర్వాతే నాకు పెద్ద వేషాలు వస్తున్నాయి."

"ఎందుకు రావ్రూ? మీకేం తక్కువ? ఆర్. నాగేశ్వరరావు తర్వాత అంత పర్సనాల్టీ వుంది గదా."

సత్యారావు సూర్యాహ్లాదం.

"నాకో సందేహం వుంది సుధాగారూ!"

"ఏమిటది?"

"గీతారాణి భర్తని ఎవడో రామ్‌కుమార్ హత్య చేశాడని పోలీసులు అరెస్టు చేశారుగా."

"ఆఁ.... చేశారూ! వదిలేశారు."

"నేను ఆమెని పెళ్ళి చేసుకోబోతున్నానని తెలిసి నా భరతం పట్టి స్తే?"

"వాడి మొఖం?"

"ఏమిటంత తేలిగ్గా అనేశారు?" ఆశ్చర్యపోయాడు.

"మీకేం భయంలేదు."

"అదికాదు. గీతారాణి అతన్ని పెళ్ళి చేసుకోవాలనే వుద్దేశ్యంతో వుంటే మనకి డబ్బు వేస్తుగదా?"

"ఆవిడకి అటువంటి వుద్దేశ్యం లేదు."

"మీకెలా తెలుసు?"

"నాతో క్లోజ్‌గా వుంటుంది గదా! చెపుతూ వుంటుంది ఆ సంగతి. రామ్‌కుమారే పూసుకొని రాసుకొని తిరుగుతూంటాడట. షూటింగ్‌లకు స్టూడియోలకి వెళ్తే కుక్కలా వెంటబడతాడట. చూసేవాళ్ళు తమ ఇద్దరికీ ఏదో సంబంధం వుందనుకోవాలని అతని వుద్దేశ్యమట...."

"ఐ.సీ....అయితే వన్ సైడ్ లౌ అన్నమాట."

"అంతే....అంతే...."

"అయితే గీతారాణి ఒప్పుకోకముందే ఆవిడ భర్తని హత్య చేశాడన్న మాట. వట్టి ఫ్రూల్ లాగ వున్నాడే."

"దద్దమ్మ."

"ఇప్పుడు గీతారాణి ఇంటికి వస్తున్నాడా?"

"ఇంకేం వస్తాడు నా మొఖం. హాడిలి ఛ స్తున్నాడు పోలీసులు అరెస్టు చేశాక" పకపక నవ్వాడు గుర్నాథం.

"అయితే ఆవిడని పెళ్ళి చేసుకోవాలనే వుద్దేశ్యం మానేశాడన్నమాట" అన్నాడు కిన్నారావ్ తృప్తిగా.

"అంత తేలిగ్గా వదిలేస్తాడా? కాని వాడికి లాభం లేదు" అన్నాడు గుర్నాథం.

"కొంచెం కనిపెడుతూ వుండండి. గీతారాణి ఇంటికి రామ్‌కుమార్ వస్తుంటాడేమో?"

"ఆఁ.... వెయ్యికళ్ళతో చూస్తుంటాను."

"మిమ్మల్నే నమ్ముకున్నాను. నా ప్రిస్టేజ్ కాపాడాలి."

"అలాగే. మరి ప్రొడక్షన్ ఎప్పుడు మొదలు పెడదామంటారు?"

"మీదే ఆలస్యం. ముందు కథ చూపించండి. దానికి స్క్రీన్ ప్లే, డైలాగ్స్ రాసుకోవాలిగదా!"

"అవునవును...."

"నేను వూరెళ్ళి మళ్ళీ వస్తాను. ఈ లోపల మీరు కథమీద కూర్చోండి."

"ఓ.... రెడీ చేస్తాను. ఒక వారంలో వస్తారా?"

"వారంగూడ అనవసరం. డాడీ కాటన్ అమ్మిన డబ్బు నాకే ఇస్తానన్నాడు."

"ఆలస్యమైనా ఫరవా లేదు. క్యాష్ పట్టుకొని రండి...."

"అలాగే. షూటింగ్ మా వూళ్ళో చెయ్యాలి. పల్లెటూళ్ళో జరిగిన కథ కావాలి."

"మీ ఇష్టం."

"ఔట్‌డోర్‌లో తీస్తే చీప్‌గా అయిపోతుందని ఎవరో చెప్పారు."

"అందులో కొంత నిజం లేకపోలేదు. కాని మీరు అందరి మాటలూ వినగూడదు. ఏదేదో చెపుతుంటారు."

"అలాగే....ఆ మధ్య బెజవాడలో షూటింగ్ తీశారు చూడండి...."

"ఏమిటబ్బా!....అది."

"మిమ్మల్ని ఆ షూటింగ్‌లో చూశాను గూడా!"

"ఓ....అదా! 'దొంగల గుహ!' "

"ఎస్....మొత్తం పిక్చర్‌కి ఎంతయింది వాళ్ళకి?"

"బ్లాక్ అండ్ వైట్ గదా! ఎనిమిది లక్షలైంది."

"అంత డబ్బు మనకి లేదుగా. మహా అయితే డాడీ ఫోర్ లాక్స్ ఇస్తాడు."

"అంతగూడ అవసరంలేదు. డిస్ట్రిబ్యూటర్ ఇస్తాడు గదా?"

"అయితే ఫరవాలేదు."

"మన పిక్చర్లో విలన్ వేషం మీరే వెయ్యాలి" అన్నాడు కన్నారావు.

"మీరు చెప్పాక తప్పుతుందా?...." నవ్వాడు గుర్నాథం.

"మీరు విలన్ వేషానికి బాగా సూట్ అవుతారు."

గుర్నాథం వుబ్బిపోయాడు.

"బెజవాడలో మిమ్మల్ని చూశాను మీరు షూటింగ్‌కి వచ్చినప్పుడు."

"ఏదో చిన్న వేషం. ఒకరోజు షూటింగ్ కి వారం రోజులుంచి చంపారు."

"మీరు అక్కడ చాలా లీజర్ గా వుండేవాళ్ళను కొంటాను."

"ఆఁ....అంతా లీజరే."

"మీతో పాటు యెవరో వున్నారు ఆ రోజు. యిద్దరూ కలిసి గ్రాండ్ హోటల్లో వెళ్తుంటే చూశాను."

గుర్నాథం వులిక్కిపడ్డాడు.

"గ్రాండ్ హోటల్లోనా?"

"ఆఁ...."

"కాదు, మేము వేరే హోటల్లో వున్నాం."

"గ్రాండ్ హోటల్ అని నాకు గుర్తుందే...."

"ఎవరైనా ఫ్రెండ్ కలిస్తే వెళ్ళివుంటాను."

"అంతే అయివుంటుంది."

"నాకు షూటింగ్ కి వేళయింది."

"వెళ్ళిరండి...."

"నమస్తే!...."

"నమస్తే!...." అన్నాడు కన్నారావు.

గుర్నాథం వెళ్ళిపోయాక రూమ్‌లోపల తలుపు వేసుకున్నాడు కన్నారావు.

# 10

"గీతా! నా కలలు నిజమవబోతున్నాయి యిన్నాళ్ళకు."

"ఏం? ఎవరైనా విలన్ వేషం ఇచ్చారా?"

"ఒకళ్ళిచ్చేదేమిటి? నేనే కథ రాసి, విలన్ వేషం వేసి పిక్చర్ కి డైరెక్షన్ చెయ్యబోతున్నాను."

"కల కాదుగదా!"

"నాన్సెన్స్. నేనంటే నీకు చిన్న చూపు. చూడు ఈ దెబ్బతో మన స్టార్ తిరిగిపోతుంది. సంవత్సరం తిరిగే లోపు మనం పెద్ద బంగళా కొనేస్తాం."

"కలలు కంటూ వుండు."

"కలకాదు గీతా! ఒక బంగారు బాతు దొరికింది. వాడికి నువ్వంటే చచ్చే ప్రేమ. నిన్ను హీరోయిన్ గా పిక్చర్ తియ్యాలని తహతహలాడి పోతున్నాడు."

"ఎవరో పాపం అమాయకుడు."

"అవుననుకో. వాడి సంగతి మనకెందుకు? మన పబ్బం గడుపుకోవాలిగాని."

"నీ కోరిక తీర్చుకో విలన్ వేషం వేసి."

"నాకున్న అనుభవంతో పిక్చర్ డైరెక్టు చేసి వంద రోజులు ఆడిస్తాను."

"ముందు తియ్యి. ఆడడం తర్వాత సంగతి గదా!"

"అంటే నా ప్రతిభమీద నీకు నమ్మకం లేదన్న మాట."

"ఆ మాట నేను అనలేదే!"

"నీ వుద్దేశ్యం నాకు తెలుసు. పరిస్థితులు అనుకూలంగా లేనప్పుడు యెంత తెలివైనవాడైనా ఒదిగి వుండాలి. స్వశక్తితో తనకు అనుకూల పరిస్థితులు కల్పించుకో గలగాలి. అప్పుడే పైకి రాగలుగుతాడు."

"కావచ్చు. నాకు నీ అంత అనుభవం లేదుగదా!"

"అందుకే నేను చెప్పిన మాట విను."

"చెప్పు."

"నేను రేపు గొప్ప డైరెక్టర్ని కాబోతున్నాను. నిన్ను హీరోయిన్ గా సూపర్ హిట్ పిక్చర్స్ తీస్తాను."

"మంచిదే గదా!"

"మన యిద్దరి కాంబినేషన్‌తో ఫీల్డు గడ గడలాడి పోవాలి."

"ఎలా?"

"నేను డైరెక్టు చెయ్యాలంటే నువ్వు హీరోయిన్. నువ్వు హీరోయిన్‌గా వుండాలంటే నేను డైరెక్టు చెయ్యాలి. ప్రొడ్యూసర్‌కి మన కండిషన్ అది."

"మనకి అంత డిమాండు వచ్చినప్పుడు చూద్దాం."

"తప్పకుండా వస్తుంది."

"వస్తే డిమాండు చేద్దాం."

"మనం యిద్దరం కలవాలి ముందు."

"కలిశాం గదా!"

"అలా కాదు. మనం పెళ్ళి చేసుకుందాం."

"ఘర్నాథం...."

"ఎందుకు అలా కేకలు పెడతావు?"

"వళ్ళు దగ్గర పెట్టుకుని మాట్లాడు?"

"ఏం నేనేం తప్పుమాట అన్నాను."

"ఒకవైపు నా భర్త చనిపోయి నేను ఏడుస్తుంటే, పెళ్ళిచేసుకోమని అడుగుతావా? నీకు బుద్ధిలేదు."

"అవును. బుద్ధిలేకే నీకు బోలెడు ఛాన్సులు యిప్పించాను."

"నువ్వు కాకపోతే నీ బాబు యింకొకడు యిప్పించే వాడు."

"అంతేలే. ఏరుదాటాక తెప్ప తగలేస్తేనేం?"

"నా కిప్పట్లో పెళ్ళిచేసుకునే వుద్దేశ్యం లేదు. దయ చేసి ఆ విషయం ఎత్తకు. ఏదో మొదట్నించి తెలిసిన

వాడవని చనువుగా వుంటున్నందుకు యింత విషం మన
సులో వుంచుకున్నావన్నమాట."

"నిన్ను పెళ్లి చేసుకోవడం విషం వుంచుకోవడమా? భలే.... మొన్న మొన్నటిదాకా నీ పరిస్థితి ఏమిటో గుర్తుకు తెచ్చుకో. నువ్వూ, నీ మొగుడూ వేషాలు ఇప్పించమని నా వెంట యెలా పడ్డారో అప్పుడే మర్చిపోయా రన్నమాట."

"అదంతా యిప్పుడు అనవసరం. నువ్వు చెప్పింది నాకు యిష్టం లేదు. నువ్వు యికముందు నాకేం ఛాన్సులు యిప్పించవలసిన అవసరం లేదు. అంతేకాదు నా ఇంటికి కూడా రావద్దు."

"అంతేలే. కష్టం ఒకడిదీ ఫలితం మరొకడిదీ అని సామెత వూరికే రాలేదు. తోటి ఆర్టిస్టి గదా అని ప్రొడ్యూసర్ల కాళ్ళూ గడ్డాలు పట్టుకుని ఛాన్సులు యిప్పించినవాడిని నేను. పత్రికల్లో ఫోటోలు వేశాడని గొప్పగా రాశాడనీ ఆ రామ్‌కుమార్ గాడు నీకు దేవుడు."

"మధ్యలో అతని ప్రస్తావన ఎందుకు?"

"నీ మనసులో వున్న సంగతే చెప్పాను."

"నాకు అతనికీ ఏమీ సంబంధం లేదు. నన్ను పెళ్ళి చేసుకోమని అతను యెప్పుడూ అడగలేదు."

"మరి నన్ను పెళ్ళిచేసుకోవడానికి నీకు అభ్యంతరం యెందుకు?"

"అతన్నిగాని, నిన్నుగాని చేసుకోవాలని రూలుందా? నేను యిప్పట్లో ఆ వుద్దేశ్యం పెట్టుకోలేదు. బహుశా అసలు పెళ్ళే చేసుకోనేమో?"

"పెళ్ళి చేసుకోకుండా పైకి రాలేవు. ఎవరో ఒక మగాడు అండ వుండాలి."

"అవసరం లేదు. వచ్చినంతవరకూ చాలు."

"గీతా! నాకు నిరాశ కలిగించకు. అది నీకు మంచిది కాదు. నేను నీమీద యెంతో ఆశ పెట్టుకున్నాను. మనం ఒకరిద్వారా మరొకళ్ళం పైకి రావాలి. లేకపోతే ఎన్నాళ్ళున్నా యెక్కడ వేసిన గొంగళి అక్కడలాగే వుండిపోతాం."

"నేను నీకు చెప్పలేదు నామీద ఆశ పెట్టుకోమని."

"బాగా ఆలోచించి చెప్పు. నన్ను కాదంటే నీకు ఫ్యూచర్ లేదు. నిన్ను గొడవచెయ్యడం ఎంతో తేలిక నాకు. అసలు నీ భర్తని నువ్వే చంపించావని పుకారు పుట్టిస్తాను."

"అయితే దురుద్దేశ్యంతో నువ్వే నా భర్తని చంపించావన్నమాట...."

* * *

పోలీస్ స్టేషన్లో టేప్ రికార్డు తిరుగుతోంది.

లాకప్ లో వున్న గుర్నాథం తలవంచుకుని నిల్చున్నాడు.

ఇంతలో హెడ్ కానిస్టేబుల్ లోపలకు వచ్చి "సార్! గ్రాండ్ హోటల్ మేనేజర్, బాయ్ వచ్చారు" అన్నాడు.

"రమ్మను" అన్నాడు ఇన్స్పెక్టర్ అజీజ్.

గ్రాండ్ హోటల్ మేనేజర్, బాయ్ వచ్చారు లోపలికి.

అజీజ్ లాకప్ లో గుర్నాధాన్ని చూపించి "వీడేనా" అన్నాడు.

బాయ్ వెంటనే గుర్తుపట్టాడు.

"సార్! వీడే సార్ హనుమంతప్ప అని చెప్పి మా హోటల్లో దిగింది."

మేనేజర్ కూడా నిజమే అన్నాడు.

"అసలు నీకు గుర్నాధం మీద అనుమానం యెలా కలిగింది?" అడిగాడు ఇన్ స్పెక్టర్ అజీజ్.

కన్నారావు చెప్పసాగాడు.

"రామ్‌కుమార్ తనని చంపించడానికి ప్రయత్నిస్తున్నాడని జైపాల్ కి ఎవరో అనుమానం కలిగించారని నాకు ఐడియా వచ్చింది. అంత అవసరం ఎవరికి? గీతారాణిమీద ఆశ పెట్టుకొని జైపాల్ ని చంపించవలసిన అవసరం ఎవరికి వుంది? అని ఆలోచించాను. ఆమెతో చనువుగా మసలే మగవాళ్ళు ఎవరా అని ఇన్వెస్టిగేట్ చేశాను. ఆమె ఫ్లాట్ లోనే ఔట్ హౌస్ లో వుండే గుర్నాధం మీద నా దృష్టి పడింది. వల వేసి పట్టాను. అతని ముఖం కూడా చూడు విలన్ ముఖం."

కన్నారావు నవ్వాడు.

"బంగారు బాతు సినీస్టార్. ఆ బంగారు బాతుకోసం దురాశతో ప్లాన్ వేసి కటకటాల వెనుకకు పోయాడు పూర్ ఫెలో" నవ్వుతూ అన్నాడు ఇన్ స్పెక్టర్ అజీజ్.

—:ఐపోయింది:—

# కాలాంతకురాలు!

## వి. ఎస్. చెన్నూరి

బస్సు చాలా రద్దీగా వుంది. బస్సులో నిల్చుని ప్రయాణం చేస్తున్న ప్రయాణీకులు ఊపిరి సలపడానికి వీల్లేకుండా వుక్కిరిబిక్కిరై పోతున్నారు.

మూర్తి ఒంటికాలిమీద నే నిల్చునివున్నాడు. రెండో కాలు ఎక్కడ పెట్టాలో తెలీక, ఒంటికాలిమీద బాలెన్స కుదరక, చేతికి పట్టందక నానా యాతన పడుతున్నాడు.

పంజాబీ డ్రెస్సు వేసుకున్న ఓ యువతి ఆసాంతం అత గాడిమీద వాలిపోయింది. ఆమె సున్నితమైన అవయ వాలు అతగాడి వీపుని నొక్కుతున్నయ్. పాపం పట్టు చిక్కక కాబోలు ఆమె ఎడంచెయ్యి అతగాడి నడుముని వాటేసుకుంది.

"ఆహా! ఏం సుఖం! ఏం సుఖం! ఇంద్రభోగం అంటే యిదే కాబోలు!" అనుకున్నాడు మూర్తి.

మన పూర్వులు రంభ ఊర్వసుల పొందుకోసం

యజ్ఞాలూ యాగాలూ చేసేవారు. ఈనాడు యజ్ఞాలూ, యాగాలూ అవసరంలేకుండా బస్సు ప్రయాణాలు కని పెట్టారు ఆధునికులు!-

కదుల్తోన్న బస్సు తిన్నగా, వెళ్ళక చిన్నగా ఓ హై జంపు చేసింది. పక్కనున్న పంజాబీ డ్రెస్సు పడతి మూర్తి కణతకు తలతో ఓ 'డీ' కొట్టింది. 'అమ్మ' అనబోయి సభ్యతగా వుండదని మానేసి పక్కకి తిరిగాడు మూర్తి.

పంజాబీ డ్రెస్ పడతి "అయాం సారీ" అనేసి ఓ చిలిపి చూపూ ఓ చిరునవ్వూ విసిరేసి, సిగ్గుతో తల వాంచేసు కుంది.

"వా బెబ్యూటీ!" బోలెడు ఆశ్చర్యపోయాడు మూర్తి గుడ్లప్పజెప్పి ఆమెకేసే చూస్తూ.

అంత అందగత్తెను అతనెప్పుడూ చూళ్ళేదు. అంత మందిలో అలా చూడ్డం సభ్యతగా వుండదని దృష్టి మర ల్చాడు.

"అబిడ్స్! అబిడ్స్!" గంటకొట్టి గట్టిగా అరిచాడు కండక్టర్. ఆ అరుపుతో బస్సు ఆగిపోయింది.

బస్సులో తోపులాట ప్రారంభమైంది. వెనకనున్న జనం ముందున్న వాళ్ళని తోస్తున్నారు. దిగేవాళ్ళని దిగ నివ్వకుండా ఎక్కేవాళ్ళు ఎక్కేస్తున్నారు. అంతా కంగారు కంగారుగా వుంది.

ఆ కంగారులో అతగాడి పాంటుజేబులోకి ఏదో సున్నితమైన చెయ్యి ప్రాకింది. అనుకోకుండానే అతని కుడిచెయ్యి ఆ చేతిని పట్టుకుంది. కాని చెయ్యి ఇతగాడి చేతికి చిక్కకుండా జర్రున లాగేసుకుంది. ఆ చేతిలోంచి ఏదో చిన్న వస్తువు పాంటుజేబులోకి జారిపోయింది.

ఆకుపచ్చ పంజాబీ డ్రెస్ యువతి బస్ దిగింది.

అనుకోకుండానే మూర్తి కూడా అక్కడే దిగి పోయాడు. ఆ యువతిని వెంటాడుతూ జనంలో కలిసి పోయాడు.

ఎంత వెదికినా ఆ యువతి కనిపించలేదతని కంటికి. షేవ్ మెంటుమీదికి చేరి, పాంటు జేబులోంచి ఎర్రరాయి పొదిగిన ఓ చిన్నసైజు వుంగరాన్ని బైటికి తీసి చూసి ఆశ్చర్యపోయాడు.

ఎంత సున్నితమైన చెయ్యది!- మెత్తగా పట్టుకుచ్చులా యెంత మృదువుగా వుందని! తామర తూడు ల్లాంటి వ్రేళ్ళు-ఆ వ్రేలికి అలంకరించిన ఈ వుంగరం ఎంత ముద్దొస్తోందని!

ఎవరూ తన్ను గమనించడంలేదని తెలుసుకొని ఆ వుంగ రాన్ని ముద్దెట్టుకొన్నాడు.

ప్రక్కకి తిరగ్గానే దర్శనమిచ్చింది ఆకుపచ్చ సిల్కు పంజాబీ డ్రెస్ పడతి. ఇంతసేపూ తన్నే గమనిస్తోంది కాబోలు అనుకొన్నాడు మూర్తి.

ఆమె చకచకా వాయ్యారం వొలకబోస్తూ, వానిటీ బాగ్ని వూపుకొంటూ, ఎత్తుమడమల జోళ్ళు టకటక లాడిస్తూ, ఎదురుగా వున్న హోటల్లో దూరింది.

మూర్తి తన చేతినున్న ముద్దుటుంగరాన్ని పాంటు జేబులో కుట్టించుకొన్న సీక్రెట్ పోకెట్లో దాచి, చక చకా బూట్లు చప్పుడు చేసుకొంటూ ఆమె వెళ్ళిన హోటల్ కేసే నడిచాడు. హాల్లో ఆమెకోసం వెతికాడు. కాని ఆమె కనిపించలేదు. ఎదురుగా 'లేడీస్' అన్న బోర్డు తగిలించిన రూము కనిపించింది.

"హతోస్మి!" అనుకొంటూ అక్కడే ఖాళీగావున్న

ఓ కుర్చీలో కూలబడి, కాఫీకి ఆర్డరిచ్చి కౌంటర్ కేసి కళ్ళప్పగించి కూర్చున్నాడు.

ఐదు నిముషాలు దొర్లిపోయినయ్. పదినిమిషాలు - పావుగంట గడిచిపోయింది! కాఫీ తేవడానికి వెళ్ళిన వాడే తిరిగి రాలేదు.

'అరి వీడిల్లు బంగారంగానూ! కాఫీగింజలకోసం ఆర్డరివ్వడానికి వెళ్ళాడు కాబోలు కాఫీతోటలికి-' అనుకొన్నాడు మూర్తి.

"కాఫీ తయారుగా లేదుసార్! చాయ్ తెమ్మంటారా" అంటూ వచ్చాడా సర్వర్.

"ఏదో ఒకటి తగలెట్టు!" అన్నాడు మూర్తి.

సర్వర్ వెంటనే పట్టుకొచ్చాడు టీ. మూర్తి టీ సిప్ చేస్తూ కౌంటర్ కేసే చూస్తున్నాడు. ఆకుపచ్చ రంగు పంజాబీ యువతి చకచకా కౌంటర్ దగ్గరకొచ్చి బిల్లు పే చేసి వయ్యారం వొలకబోసుకొంటూ వెళ్ళిపోయింది.

మూర్తి కప్పులోని టీ కప్పులోనే వుంచేసి, కుర్చీలోంచి గబగబా కౌంటర్ కేసి పరిగెత్తాడు. కౌంటర్లో బిల్లు పే చేసి పేవ్ మెంట్ మీదికి చేరుకొన్నాడు. ఆమెకోసం కళ్ళతోనే గాలించసాగాడు. కాని ప్రయోజనం కనిపించలేదు. ఆమె ఎటు మాయమైందో ఎక్కడా ఆమె జాడ కనిపించలేదు.

మూర్తి బరువుగా నిట్టూర్పు విడిచి, కాళ్ళీడ్చుకొంటూ పరధ్యానంగా పేవ్ మెంటుమీద నడుస్తున్నాడు.

అకస్మాత్తుగా ఢీకొనడంతో అమాంతం బోరగిలా పడబోయి, సంబాళించుకొని చతికిల పడ్డాడు. ఏవో రెండు సున్నితమైన చేతులు ఆసరా యివ్వడంతో లేచి నిల్చుని బట్టలు దులుపుకొని పక్కకి తిరిగాడు.

"అయాం వెరీ సారీ మిస్టర్, తొందర్లో చూశ్శేదు" ఆకుపచ్చరంగు పంజాబీ దుస్తుల పడతి ఓ చిరునవ్వు, ఓ చిలిపి చూపూ చిలకరించి, అతి స్పీడుగా వెళ్ళిపోయింది ముందుకి.

ఈ ఆకస్మాత్ సంఘటనకి తల దిమ్మెక్కిన మూర్తి అందులోంచి బైటపడేసరికి ఆమె అల్లంతదూరం వెళ్ళి పోయింది. ఏదో గుర్తుకి రాగా పాంటుజేబు తడుము కొన్నాడు. జేబులో పర్సు మాయమైంది.

"ఎంత అందగత్తో అంత చలాకీ పిల్ల!" అను కొన్నాడు.

వెంటనే అతనికి నవ్వొచ్చింది. ఆ పర్సు విప్పి చూడ గానే ఆమెకు చిర్రెత్తుకొస్తుంది. తనమీద కసి పెరుగు తుంది. తాను వెంటపడకపోయినా,ఆమె తనవెంట పడడం ఖాయం!—

ఎందుకైనా మంచిది ఆమె వెంటపడి, ఆమె వునికిని తెలుసుకోవాలి!—అనుకొన్నాడు.

అల్లంతదూరంలో ఆమె ఓ ఆటోలోకి చేరడం కంట బడింది. వెంటనే పక్కన ఆగివున్న ఆటోలోకి చేరుకొని ముందు వెళుతున్న ఆటోని వెంబడించమన్నాడు మూర్తి.

ఆమె యెక్కిన ఆటో తిన్నగా వెళ్ళి, కోటీలో ఓ కాంపౌండు ముందు ఆగింది. ఆమె అందులోంచి దిగి ఆటో డ్రైవర్‌కి ఫేర్ చెల్లిస్తోంది.

మూర్తి తన ఆటోని ముందున్న ఆటోకి వందగజాల దూరంలో ఆపి, డ్రైవర్‌కి ఫేర్ చెల్లించి కాలినడకన కాంపౌండు కేసి బయలుదేరాడు.

కాంపౌండు గేటు మూసివుండడంవల్ల ఆమె ఎవరి కోసమో ఎదురుచూస్తూ గేటుముందు నిల్చొంది. మూర్తి ఆమెను సమీపించేసరికి గేటు కవతల కాపలావాడు గేటు తెరవడం, ఆమె లోపలికి వెళ్ళడం జరిగిపోయింది.

మూర్తి గేటు గోడపక్కన చీకట్లో నక్కాడు.

"నీకోసం రాజయ్య వొచ్చి వెళ్ళాడు బేబీ" అన్నాడు కాపలావాడు.

"ఎంత సేపయింది?" కిన్నెర మీటినట్టుందామె గొంతుక.

"అరగంట క్రితం! మళ్ళీ వొస్తానన్నాడు."

"వొస్తే వెంటనే పైకి పంపించు!"

"అలాగే బేబీ!"

ఆమె చకచకా నడిచి వెళ్లిపోయింది. మూర్తి అక్కడే నిల్చుని రాజయ్యకోసం ఎదురుచూడసాగాడు. పది నిమిషాల్లో రాజయ్య కూడా అక్కడికి చేరుకొన్నాడు.

"బేబీ యిప్పుడే వచ్చిందయ్యా! మీదిదెళ్ళు!" అన్నాడు కాపలావాడు మూసిన గేటు తెరుస్తూ.

రాజయ్య సన్నగా పొడుగ్గా గడకర్రలాగా వున్నాడు. తెల్ల లాల్చీ, తెల్ల పైజామా తొడుక్కొన్నాడు. గిరిజాల జుట్టు, రొయ్యమీసాలు. అతని కళ్ళు ఎర్రగా మండుతున్నయ్. బాగా తాగాడేమో తూలుతూ నడుస్తున్నాడు.

రాజయ్య లోపలికి వెళ్ళిం తరువాత మూర్తి చిన్నగా నిట్టూర్పు విడిచి మెల్లగా అక్కడ్నించి కదిలాడు.

## 2

మూర్తి పూర్తి పేరు సుందరమూర్తి. యువకుడు. అందగాడు. బాగా చదువుకొన్నవాడు. ఇంతక్రితం ఓ

ప్రైవేట్ కంపెనీలో అసిస్టెంటు మేనేజరుగా పనిచేసి అనుభవం గడించినవాడు. ప్రస్తుతం ఓ పేరుమోసిన ప్రైవేటు సంస్థనుండి మేనేజరుగా, ఎపాయింటుమెంటు ఆర్డర్స్ అందుకొని, డ్యూటీలో జాయిన్ అవడానికి విజయవాడనుండి హైదరాబాద్ చేరుకొని ఓ మధ్యరకం హోటల్లో గది తీసుకొన్నాడు.

నిన్ననే ఆఫీసుకెళ్ళి రిపోర్టు చేశాడు. కాని తనకి డ్యూటీ హేండోవర్ చెయ్యవలసిన వ్యక్తి టూర్లో ఉండడంవల్ల డ్యూటీలో జాయిన్ కాలేకపోయ్యాడు. అతడు టూర్లోంచి హెడ్‌క్వార్టర్స్‌కి తిరిగిరావడానికి వారంరోజులు పడుతుందట. అంతవరకు అతను ఖాళీ. ఖాళీగా వుండడం ఎందుకని జంటనగరాల్లోని వింతలూ విశేషాలూ కవర్ చేస్తున్నాడు.

మూర్తికి ఒక్క ఆడవాళ్ళ విషయంలో కాస్త బలహీనత వుండడం నిజమేగాని, యితర దుర్వ్యసనాలేవీ లేవు. ఆడవాళ్ళ విషయంలోకూడా ఆవిడ అలాంటిదని తోస్తే తప్ప ఆ ప్రయత్నానికి పూనుకోడు.

పైసల విషయంలో అతడు జాగ్రత్తగా వుంటాడు. ఎప్పుడూ అతను తనదగ్గర ఎక్కువ పైకం వుంచుకోడు. నోట్లన్నీ పాంటు బెల్టులో కుట్టించుకొన్న సీక్రెట్ పాకెట్లో దాస్తాడు. చిల్లర పైసలుతప్ప పాంటు జేబులో నోట్లు వుండవు. ఓ అందమైన పర్సు మాత్రం పాంటు జేబులో ఎప్పుడూ వుంటుంది. అందులో అడ్రెస్ కార్డులూ, అవసరమైన కాగితాలు మాత్రమే వుంటయ్.

అతడు వూళ్ళోని వింతలూ విశేషాలూ చూడ్డానికి బయలుదేరిన మొదటిరోజే యీ సంఘటన జరిగింది.

యీ సంఘటనతో అతని ప్రోగ్రాం పూర్తిగా మారి పోయింది.

ఊళ్ళోని విశేషాలు చూడ్డం కట్టిపెట్టి, ఆమె యెక్కడైనా కనిపిస్తుందేమోనని గాలించసాగాడు. రెండు మూడుసార్లు ఆమె వుంటోన్న కాంపౌండు పరిసరాల్లో కూడా కాలుగాలిన పిల్లిలా తెగ తిరిగాడు. కాని ప్రయోజనం కనిపించలేదు.

అలా రెండు రోజులు అతి నీరసంగా దొర్లిపోయినాయ్.

మూడవరోజు రాత్రి ఎనిమిదింటికే లాడ్జికి చేరుకొన్నాడు మూర్తి. తాళం తీసి గది తలుపులు తెరుస్తుండగా ఏవో ఎత్తుమడమల జోళ్ళ చప్పుడు వినిపించింది. వెనక్కి తిరిగిచూశాడు.

ఎవరో స్త్రీ తనకేసే పరుగెత్తుతోంది. గదుల్లోని వ్యక్తులెవరూ ఇంకా లాడ్జికి చేరుకోకపోవడంవల్ల వరండాలో ఎవరూ నడమాడ్డంలేదు. 'ఎవరీ స్త్రీ? ఎందుకిలా పరుగెత్తుతోంది?' అనుకొంటూండగా ఆమె అతడ్ని చేరుకొంది.

"ప్లీజ్! త్వరగా తలుపు తెరవండి....!" అంది కంగారుగా.

ఆమె భయంతో గజగజలాడుతోంది. చాలాదూరం పరుగెత్తడంవల్ల కాజోలు రొప్పుతోంది.

మూర్తి తలుపు తెరిచాడు. ఆమె గదిలోకి వెళ్ళిపోయింది. అతడు లోపలికి వెళ్ళి తలుపులు దగ్గరికి వేసి గదిలో దీపం వెలిగించాడు.

దీపం వెలుగులో ఆ స్త్రీ ఆకారాన్ని గమనించాడు. వెదుకుతున్న తీగ కాలికి తగిలినట్టయింది.

ఆమె ఎవరో కాదు. పచ్చరంగు పంజాబీదుస్తుల పడతి. కాని ఇప్పుడామె ఆ వేషంలో లేదు. పింక్ కలర్ షిఫాన్ చీర కట్టింది. అదే రంగు జాకెట్టు తొడిగింది. ఆమె చెవుల్లోని జూకాలూ, చేతిలోని వ్యానిటీబాగూ, కాళ్ళకు తొడుక్కొన్న హైహీల్సూ అన్నీ అదే రంగులో వున్నాయ్. దివినుండి భువికి దిగివచ్చిన అప్సరసలా వుంది!—

కాని ఆమె అందమైన కళ్ళల్లో భయాందోళనలు దోబూచులాడుతున్నాయ్. చంద్రబింబంలాంటి ముఖంలో స్వేదబిందువులు ముత్యాల్లాగా మెరుస్తున్నాయ్. ఆపాద మస్తకం గజగజలాడిపోతూ దీనంగా అతని కళ్ళల్లోకి చూసింది.

"ఎందుకలా కంగారు పడిపోతున్నారు? ముందు కూచోండి!" అంటూ పక్కనున్న కుర్చీ చూపాడు.

"మీరు ముందు తలుపులకి గడియపెట్టండి! అతడు నా కోసం వెదుక్కుంటూ యిటు రావచ్చు!" అంది ఆమె పక్కనున్న కుర్చీలో కూలబడుతూ.

అతడు తలుపులకి గడియపెట్టి వెనక్కి తిరిగి తిన్నగా వచ్చి ఆమె కెదురుగా మంచంలో కూచుని "ఇప్పుడు చెప్పండి! యెవడు వాడు? మీ కోసం యెందుకు గాలిస్తున్నాడు?" అని ప్రశ్నించాడు.

"వాడి పేరు రాజయ్య. వాడ్నందరూ రౌడీ రాజిగాడంటారు. వాడు నామీద కన్నేశాడు. నన్నెలాగైనా లొంగదీసుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. నే నింతక్రితం ఒక మిత్రురాలింటికెళ్ళి తిరిగి వస్తోంటే నా వెంట పడ్డాడు. నాకు భయమేసి యిలా పరుగెత్తుకొచ్చాను" అందా యువతి.

"మీ పేరు?"

"మోహిని!"

"మీ కెవరూ లేరా?"

"లేరు! నే నొంటరిదాన్ని! ఓ ప్రైవేట్ కంపెనీలో స్టెనోగా పని చేస్తున్నాను. నే నొంటరిదాన్నని వాడు నామీద యెగబడుతున్నాడు" అంది మోహిని.

"అయితే మీ రిక్కడే వుండండి! అవసరమైతే విశ్రాంతి తీసుకోండి! వాడు వెళ్ళిపొయ్యాడో, లేదో చూచి వస్తాను" అంటూ మూర్తి, ఆమె జవాబుకోసం ఎదురుచూడకుండా గదిలోంచి బైటపడి, తలుపు మూసి, తాళంపెట్టి ముందుకి నడిచాడు.

రాజయ్య గుమ్మంలో నిల్చుని మేనేజర్‌తో కాబోలు మాట్లాడుతున్నాడు.

మూర్తి జేబులోంచి సిగరెట్టు పాకెట్టూ అగ్గిపెట్టే బైటికి తీసి, సిగరెట్టు వెలిగించుకొని దమ్ము లాగుతూ అక్కడే నిల్చుని ఆలోస్తున్నాడు.

రాజయ్య వెళ్ళిపొయ్యాడు. అతని వాలకం చూస్తే మోహినిని తరుముకొచ్చిన వ్యక్తిలా కనిపించలేదు. బహుశా, మోహినీ రాజయ్యా కలిసి యేదో నాటక మాడుతున్నారు కాబోలు అనుకొన్నాడు మూర్తి. తనలో తాను నవ్వుకొంటూ సిగరెట్టుపీకను క్రిందపడేసి, బూటు కాలితో నలిపి, అక్కడ్నించి వెనక్కి తిరిగాడు.

తలుపులు తెరుచుకొని గదిలోకి చేరుకొన్నాడు. మోహినికేసి చూసి ఆశ్చర్యపొయ్యాడు. ఇప్పుడామె వొంటిమీద చీరా, జాకెట్టూ లేదు. వాటి స్థానే స్లాకూ, బెల్ బాటమ్ వున్నయ్.

'వొంకీకి తగిలించిన నా బట్టల్ని ఎంత స్వతంత్రంగా ధరించింది!' అనుకొన్నాడు.

"ఈ వేషంలో నన్నతడు గుర్తుపట్టకపోవచ్చు! నేను వెళతాను! రేపు మీ బట్టలు మీకు పంపుతాను" అంది వానిటీబాగ్‌ని చేతిలోకి తీసుకొంటూ.

మూర్తి చిన్నగా నవ్వాడు, "రౌడీ రాజిగాడు గుమ్మంలోనే కాపలా కాస్తున్నాడు. మీరు ఏ వేషంలో వెళ్ళినా అతడు పసికట్టెయ్యగలడు!" అన్నాడు.

"చచ్చాం పో! అయితే నేను నా రూం చేరుకోవడం యెలా....?" అంటూ మంచం మీద కూలబడిపోయింది మోహిని.

మూర్తి ఆమె కెదురుగా కుర్చీలో కూర్చుని, ఆమె కళ్ళలోకి చూస్తూ "రాజయ్య రౌడీ అంటున్నారు! మీ రా రౌడీగాడ్ని యెంతకాలం యిలా తప్పించుకు తిరగ్గలరు?" అని ప్రశ్నించాడు.

"తప్పించుకు తిరక్క ఏం చెయ్యను?"

"పెళ్ళాడాలి."

"ఎవర్ని? ఆ రౌండాబాంగునా?"

"కాదు. మీకు నచ్చిన మరో వ్యక్తిని."

మోహిని చిన్నగా నవ్వింది. "నాకు నచ్చిన వ్యక్తి నా వెంటపడొద్దూ?" అంది.

"మీరే అతని వెంటపడొచ్చుగా?"

"ఆడది వెంటపడితే అలుసైపోనూ?"

"ఒకర్నొకరు అర్థం చేసుకొన్న తరువాత అలుసైతే మాత్రమేం?" అన్నాడు మూర్తి.

మోహిని వెంటనే జవాబు చెప్పలేదు. తల క్రింద్కి వొంచి, పెదవి ఆదోలా విరిచి, "సుం హౌ, ఐడోన్ట్

లైక్ మారేజస్!" అంటూ కనుగుడ్లు గుండ్రంగా తిప్పి, అతని కళ్ళల్లోకి గుచ్చి చూచి, చిన్నగా నవ్వింది.

"అవును, స్వేచ్ఛ వుండదు" మూర్తి కూడా నవ్వాడు.

"మీ కయిందా పెళ్ళి?"

లేదన్నట్టు తలూపాడు మూర్తి.

"ఎందుకని?"

"జవాబు మీ రింత క్రితమే చెప్పారు" అన్నాడు మూర్తి.

"ఓ, యువార్ క్లవర్!" అంది కళ్ళు గుండ్రంగా తిప్పుతూ.

"మీకంటేనా?"

మోహిని మాట్లాడలేదు. తనలో తాను నవ్వుకుంది. మెల్లగా ఆవులించి గట్టిగా వొళ్ళు విరుచుకొంది. రిస్టు వాచీ చూచుకొని "ఓ మైగాడ్! అప్పుడే పదైంది!" తనలో తాను గొణుక్కొంది.

"ఇంతకీ యిప్పుడు నన్నేం చెయ్యమంటారు?"

"ఏం చేసినా నా కభ్యంతరంలేదు."

"అవును.మీ కెందుకుంటుంది అభ్యంతరం! అభ్యంతరా లన్నీ ఆడవాళ్ళకేగా?" చిలిపిగా నవ్వింది.

"ఇక్కడేమో వున్నది ఒక్కటే మంచం! నాకేమో క్రింద పడుకొంటే నిద్రరాదు. మరి మీకో?"

"నాకూ అంతే!" అన్నాడు మూర్తి.

"మరి యెట్లా....?" చిలిపిగా మూర్తి కళ్ళల్లోకి చూచింది.

"ఉన్న వొక్క మంచాన్నీ చెరో సగం పంచుకోవాలి! అంతకంటే గత్యంతరం లేదు"అన్నాడు మూర్తి

భావగర్భితంగా.

"షరతులేవైనా వున్నాయా?"

"ఎందుకు లేవు?—వున్నయ్."

"ఏమిటవి?" ప్రశ్నించింది మోహిని.

"నిద్రలో మీరు నామీద చెయ్యో కాలో వేశారనుకోండి, నా కాట్టే అభ్యంతరం వుండదు! మీకూ అలాగే వుండకూడదు!" అన్నాడు మూర్తి చిన్నగా నవ్వుతూ.

మోహిని ఆమోదించినట్లు తల వూంచి, అతని కేసి క్రీగంట చూసి, "నాది మరో షరతు" అంది.

"ఏమిటో అది?" క్వొశ్చెన్ మార్కు ముఖం పెట్టాడు మూర్తి.

"గదిలో దీపముంటే నాకు నిద్రపట్టదు. అందుచేత దీపం ఆర్పేయాలి."

"వొప్పుకొన్నాం" అన్నాడు మూర్తి.

మోహిని బట్టలు మార్చుకోవడానికి బాత్ రూంలోకి వెళ్ళింది. మూర్తి మంచంమీద బట్టలు గులిపి సర్దసాగాడు. అతడుకూడా బట్టలు మార్చుకొన్న తరువాత యిద్దరూ మంచానికి చెరోవైపు చేరారు. మంచంమీద వాద్దులు యేర్పరచుకొని, గదిలో దీపం ఆర్పేసి, చెరో వైపు పడుకొన్నారు.

మోహిని శరీరంలోంచి వెదజల్లే సుగంధం అతగాడ్ని మత్తెక్కిస్తోంది. ఆమె కురుల్లోంచి వెలువడే లవెండర్ వాసన అతని ముక్కుపుటాల్ని సోకుతోంది. అతని శరీరంలోని ప్రతి అణువూ వేడెక్కి, కుతకుతలాడి పోతోంది. ఆకలిగొన్నవాడి ముందు మృష్టాన్నం వడ్డించి, చేతులు కట్టేసినట్టుంది అతని స్థితి.

గదిలో చీకటి!—చీకటికి మించిన నిశ్శబ్దం!—

మూర్తి భరించలేక పొయ్యాడు. మెల్లగా పక్కకి తిరిగి, కుడిచేతిని ముందుకి చాచి ఆమె నడుంమీద వేశాడు. ఆమెలో చలనంలేదు. ఉచ్ఛ్వాస నిశ్వాసలకు ఆమె రొమ్ములు అలల్లా పైకెగురుతున్నయ్. అతని గుండెల్ని తోడేస్తున్నయ్. మరింత ధైర్యంచేసి, కుడి చేతి పట్టుబిగించి ఆమెను దగ్గరికి లాక్కొన్నాడు. ఆమె మెల్లగా కదిలింది. పక్కకి తిరిగి మరింత దగ్గరికి జరిగి, అతని చెవిదగ్గర తన పెదాల్ని చేర్చి, "ఏమండోయ్! మీరు హద్దులు దాటుతున్నారు" అంది రహస్యంగా నవ్వుతూ.

"చీకట్లో హద్దులేమిటి?మన షరతులన్నీ వెలుతుర్లోనే" అన్నాడు మూర్తి ఆమెను మరింత దగ్గరికి లాక్కుంటూ.

"అలాగా? ఆ సంగతి ముందుగా తెలిసివుంటే ఇంత కాలం వృధా అయివుండేదే కాదు" అంటూ మోహిని తన బాడీలోంచి కర్చీఫ్ తీసి అతని ముఖానికి అదిమి పెట్టింది. రెండే రెండు క్షణాలు! స్పృహ కోల్పోయి నిర్జీవంగా పక్కకి వొరిగిపొయ్యాడు.

అతనికి వొళ్ళు తెలిసి కళ్ళు తెరిచేసరికి గదిలో దీపం వెలుగుతోంది. పక్కమీద మోహిని మాయమైంది. జరిగిన మోసం అర్థం చేసుకున్నాడు. మోహినితో బాటు గదిలోంచి ఏమైనా మాయమైందోనని గదంతా చెక్ చేశాడు.

అతని సూట్ కేసు తెరిచివుంది. బట్టలన్నీ చిందర వందరగా విరజిమ్మబడి వున్నయ్. కాని ఏమీ మాయం కాలేదు.

బహుశ పైకంకోసం కాబోలు గదంతా గాలించబడి వుంది. కాని అది వుంటేగా ఆమె చేజిక్కడానికి?

మూర్తి చిన్నగా నవ్వుకున్నాడు.

మూర్తి తనతోపాటు తెచ్చుకున్న వెయ్యి రూపాయలూ హోటల్ మేనేజర్ చేతికిచ్చి దాచాడు. రోజూ తనకి కావలసినంత మాత్రమే అతనివద్దనుండి పుచ్చుకునేవాడు. ఇరవైయ్యో ముప్పయ్యో తనవద్ద మిగిలిందికూడా పాంటు బెల్టులోని సీక్రెట్ పాకెట్‌లో వుంటుంది. చిల్లర పైసలు మాత్రమే వుంటయ్ తన పాంటు జేబులో. పాపం మోహిని యింత శ్రమపడి ఆడిన నాటకమంతా వృధా అయింది.

మూర్తి తాను రాత్రి విడిచిన పాంటుని వంకీనుండి అందుకొని సీక్రెట్ పాకెట్‌లో గాలించాడు. తాను దాచిన పైసలు అలాగే వున్నయ్. వాటితోబాటు యెర్రరాయి పొదిగిన వుంగరం కూడా బైటపడింది.

పాపం! మోహిని యీ వుంగరంకోసమే గాలించింది కాబోలు-అనుకున్నాడు.

## 3

సాయంత్రం నాలుగైంది.

మూర్తి తన గదిలో కూచుని సిగరెట్టు కాల్చుకుంటున్నాడు. అతని మనసేమీ బాగోలేదు. ఎక్కడికి వెళ్ళడానికి మనస్కరించడం లేదు. రాత్రి జరిగిన సంఘటనే మాటి మాటికీ గుర్తొస్తోంది.

మోహిని యెంత అందంగా వుంటుందో, అంత తెలివైంది. ఎంత తెలివిగా నాటకమాడింది!-యెంత క్లవర్‌గా తప్పించుకుపోయింది!-

నోటిదాకా వొచ్చిన భోజనం ఏ శాకో గ్రద్దో తన్నుకుపోయినట్టు, చిక్కినట్టే చిక్కి తెలివిగా తప్పించుకుపోయింది!-

ఆమె స్నేహాన్ని సంపాయించడం యెలా? ఆమెను ప్రసన్నం చేసుకునే మార్గమేమిటి? ఆమెను పొందే మార్గమే లేదా?-

మూర్తి దీర్ఘంగా ఆలోచిస్తూండిపొయ్యాడు.

అతని బుర్రలో ఏదో ఆలోచన తట్టింది. చేతనున్న సిగరెట్టుని ఆష్ట్రేలో నొక్కి హుషారుగా కుర్చీలోంచి లేచాడు. చక చకా బట్టలు మార్చుకుని గదిలోంచి బైట పడ్డాడు.

ఆటో చేసుకుని కోటీకి బైలుదేరాడు. కోటీలో ఆమె వుంటోన్న కాంపౌండు ముందు ఆటో దిగి డ్రైవర్ కి అద్దె చెల్లించి, కాంపౌడు గేటు కేసి బయలుదేరాడు. గేట్లు బార్లా తెరిచివున్నయ్.

కాపలా వాడు ఆ పరిసరాల్లో యెక్కడా కనిపించ లేదు. ఆ రోజు తాను చూచిన వ్యక్తి నైట్ వాచర్ కాబోలు, అనుకున్నాడు మూర్తి.

గేటు దాటుకుని, మెట్లెక్కి మేడమీదికి చేరు కున్నాడు. మేడమీద వరుసగా ఆరు గదులున్నయ్. ఎదురు వరుసలో మరో ఆరు గదులు. కొన్ని గదులికి తలుపులు మూసి లోపల గడియపెట్టబడి వున్నయ్. కొన్ని గదుల తలుపులు తెరిచివున్నయ్. మరికొన్ని గదుల తలుపులికి తాళం కప్పలు వ్రేలాడుతున్నయ్.

ప్రతి గది గుమ్మంపైనా గోడకి నేమ్ బోర్డు తగిలించి వుంది. మూర్తి ఒక్కో నేమ్ బోర్డూ చూచుకొంటూ ముందుకి నడుస్తున్నాడు. అతని కాళ్ళు 8 వ నంబర్ గదిముందు ఆగిపోయినయ్.

ఆ గది గుమ్మం పైన గోడకి "మిస్ మోహిని" అన్న నేమ్‌బోర్డు తగిలించి వుంది. కాని తలుపులు మూసి

వున్నయ్. మూసిన తలుపులికి తాళం కప్ప వేలాడుతోంది.

మూర్తి బరువుగా నిట్టూర్చాడు.

మోహినిలాంటి వ్యక్తులు రాత్రిళ్ళుమాత్రమే 'బిజీ'గా వుంటారు. పగలంతా తమ గదుల్లో విశ్రాంతి తీసుకొంటారు. ఈ వేళప్పుడు మోహిని తప్పకుండా తన గదిలో దొరుకుతుందన్న ఆశతో బయలుదేరాడు మూర్తి. కాని అతని ఆశ ఫలించలేదు.

మూర్తి తలొంచుకుని దీర్ఘంగా ఆలోచిస్తూ మేడ మెట్లు దిగి క్రిందికి చేరుకున్నాడు. కాంపౌండులోంచి బైటపడి యెదురుగా కనిపిస్తోన్న ఇరానీ హోటల్ కేసి దారి తీశాడు.

తిన్నగా కొంత దూరం నడిచి ఓ పాన్ షాపు దగ్గర ఆగి సిగరెట్ పాకెట్ కొని, సిగరెట్ కాలుస్తూ అక్కడే వున్న బెంచిమీద కూలబడ్డాడు.

"రెండు జరదాపాన్లు కట్టు బాయ్" అంటూ అక్కడికి చేరుకున్నారిద్దరు కుర్రాళ్ళు.

పాన్ షాపు వాడు ఆకులు కత్తిరించి పాన్లు కట్టడంలో మునిగిపోయ్యాడు. కుర్రాళ్ళిద్దరూ మాటల్లో పడ్డారు.

"రాజయ్యామధ్య మంజులా బాంకు మేనేజర్ తో తిరుగుతున్నాడు. ఏమిటో విశేషం?" ఓ కుర్రాడు తన సందేహాన్ని బైట పెట్టాడు.

"విశేషం లేకుండా రాజయ్య ఏ పనీ చెయ్యడు. ఏదో ప్లాను కాబోలు" అన్నాడు రెండవవాడు.

"ఆ మేనేజర్ మోహినిమీద కన్నేశాడేమో!" అన్నాడు మొదటివాడు.

"అది అంత తేలిగ్గా పడేరకం కాదు. పెద్ద చెయ్యి"
అన్నాడు రెండవవాడు.

"మనకెందుకులే భయ్! పెద్దవాళ్ళ వ్యవహారం!" అన్నాడు మొదటివాడు. వెంటనే ముందుకి వొంగి "మోహినికి మినిస్టర్‌తో కూడా పరిచయముందటగా?" అన్నాడు రహస్యంగా.

"అవునట!" రెండవవాడు తలూపాడు!

పాన్‌షాప్‌వాలా పాన్‌లు కట్టడం పూర్తవడంతో పాన్‌లు పట్టుకొని పైసలు చెల్లించి వెళ్ళిపొయ్యారు కుర్రాళ్ళిద్దరూ.

మూర్తి ఆలోచనల్లో పడ్డాడు.

మోహిని పెద్ద చెయ్యి గనుకనే అంత ఘరానాగా వ్యవహరిస్తోంది! అలాంటి వ్యక్తులతో క్లోజ్‌గా మూవ్ కాకూడదు. తాను చేసిన నేరాలన్నీ పక్కవాడిమీదికి నెట్టి జాగ్రత్తగా తప్పుకొంటూరు!—అనుకొన్నాడు.

కాని అతని మనసెందుకో ఆమెను గురించి ఆలోచించకుండా వుండలేకపోతోంది.

ఎంత అందంగా వుంటుంది!—ఒక్క రాత్రి ఆమెతో గడిపితే చాలు! ఆ మధురక్షణాలని నెమరువేసుకొంటూ జీవితాంతం గడిపేయవచ్చు! అలాంటి అందగత్తెను అనుభవించని జీవితం బ్రతికెందుకు?—వొకే వొక్క రాత్రి!—వొక్క రాత్రి చాలు!—

మూర్తి బెంచీమీంచి లేచి నిలుచున్నాడు. రిస్టువాచీ చూచుకొన్నాడు. ఏడు దాటింది. పేవ్‌మెంట్‌మీద జనం రద్దీగా తిరుగుతున్నారు. తారురోడ్డు వాహనాల రాకపోకలతో చాలా బిజీగా తయారైంది.

మూర్తి అక్కడ్నించి మోహిని వుంటోన్న

కాంపౌండు కేసి బయలుదేరాడు. అకస్మాత్తుగా అతని కళ్ళు విప్పారినయ్.

మోహిని నీలంరంగు పంజాబీ డ్రెస్సులో వానిటీబాగ్ వూపుకొంటూ, అతని ముందు వందగజాల దూరంలో, తన కాంపౌండు కేసి నడుస్తోంది.

అంతక్రితం మూర్తి గుండెల్లో పేరుకొన్న నీరసం వొక్కసారిగా ఆవిరై పోయింది. ఉత్సాహం పెల్లుబికింది.

ముందు నడుస్తోన్న మోహిని తన కాంపౌండుని సమీపిస్తోంది. మూర్తి మెల్లగా పరుగు లంకించుకొన్నాడు. తిన్నగా వెళ్ళి ఆమెకు 'డాష్' కొట్టాడు.

మోహిని బేలన్స్ తప్పి బోరగిల పడబోయింది. వెంటనే మూర్తి ఆమెను క్రింద పడకుండా పట్టుకొన్నాడు.

"అయాంసారీ మాడమ్! తొందర్లో చూడలేదు! ప్లీజ్ యెక్స్‌క్యూజ్ మీ....!" అంటూ ఆమె ముఖంలోకి చూశాడు. "ఓహ్! మీరా....?" అంటూ ఆశ్చర్యంగా ఆగిపొయ్యాడు.

మోహిని అతనికేసి ఆపాదమస్తం పరిశీలనగా చూసింది. అతని తల చెదిరివుంది. ఉఛ్వాస నిశ్వాసలతో అతని ఛాతీ యెగిరెగిరి పడుతోంది. అతని కళ్ళల్లో కంగారు, ముఖంలో భయభ్రాంతులు!—

ఆమె అతని భుజంమీద చెయ్యివేసి "ఏమిటి? ఎందుకలా కంగారు పడుతున్నారు? యేమిటా తొందర?" అని ప్రశ్నించింది.

"అతడు—రౌడీ రాజయ్య—నా వెంటపడ్డాడు! అతని చేతిలో కత్తి కూడా వుంది!—ప్లీజ్! నన్నెక్క

దైనా దాచండి! వాడు నన్ను చంపేస్తాడు!" అని తొందరపడసాగాడు.

పరుగెత్తడం వల్ల అలుపుతో మాటలు తిన్నగా రావడంలేదు.

మోహిని ఒక్క క్షణం ఆగింది. చిన్నగా నవ్వింది. "మరేం ఫరవాలేదు. ఇక్కడే నా గది. మీరు నా గదిలో తల దాచుకోవచ్చు! రండి!" అంది అతని చెయ్యి పట్టుకొని.

"ఏమిటి? మీ గదిలోనా....? అమ్మ బాబోయ్! యింకేమానా వుందా? వాడు తిన్నగా గది వద్దకి వచ్చి గోల చేస్తాడేమో! వొద్దు! వొద్దు!" అన్నాడు భయం భయంగా.

"డోన్ట్ వర్రీ మిస్టర్ మూర్తి! వాడు కాంపౌండు లోకి రాడు! నైట్ వాచర్ తాతయ్యను మీరు చూడ లేదు. అతడీ పరిసరాల్లో వొకప్పుడు పేరు మోసిన రౌడీ. తాతయ్యంటే రాజయ్యకి సింహ స్వప్నం!" అంది మోహిని.

ఇద్దరూ కాంపౌండు గేటు దగ్గరికి చేరుకొన్నారు.

"అబ్బాయి ఎవరు బేబీ? బాయ్ ఫ్రెండా? ఇంత క్రితం ఎప్పుడూ చూళ్ళేదే!" అంటూ తలుపు తెరిచాడు నైట్ వాచర్ తాతయ్య.

"బాయ్ ఫ్రెండేమిటి ఖర్మ! నా మేనత్త కొడుకు. వూళ్ళోంచి యీ రోజే వచ్చాట్ట! నా కోసం వెదు క్కుంటూ వస్తోంటే నేనే కనిపించాను. చిన్నప్పుడు మేమిద్దరం కలిసి తిరిగేవాళ్ళం. మాకు వూహ తెలియని వయసులోనే ఆయనకి పెళ్ళి చేశారుగనుక సరిపోయింది.

లేకపోతే ఆయన కిష్టం లేకపోయినా బలవంతంగా లేపు కెళ్ళి తాళి కట్టించుకొని వుండేదాన్ని...." అంది నవ్వుతూ.

"అల్లాగా?—మీ యిద్దరికీ ఈడూ జోడూ సరి పొయ్యేది—చిలకా గోరంకల్లా వుండేవారు" అన్నాడు తాతయ్య తెగ ముచ్చటపడిపోతూ.

మూర్తీ మోహినీ చెట్టాపట్టా లేసుకొని నవ్వుకొంటూ మేడ మెట్లకేసి నడిచారు.

మోహిని గది తాళం తెరుస్తూ "ఇంతకీ మీ రిక్కడి కెలా వచ్చారు?" అని ప్రశ్నించింది.

"ఓ మిత్రుడ్ని కలుసుకొనేందుకు వచ్చాను. తీరా వెళ్ళితే అతడు గదిలో లేడు. వెనక్కి తిరిగి వస్తూండగా రాజయ్య తారసపడ్డాడు, నన్నెలా గుర్తుపట్టాడో తెలీదు. నా వెంటపడ్డాడు. మీకు ఆ రాత్రి షెల్టరివ్వడం వచ్చింది వండ!"

మోహిని చిన్నగా నవ్వింది.

"మీరు మగాళ్ళు!—ఈ మాత్రానికే బెంగపడిపోతే ఎలా?" అంది.

"బెంగపడడం కాదు. దారినపోయే తగువుని తన మీదికి తెచ్చుకోవడం. రంగంలోకి దిగదల్చుకొంటే రౌడీల క్కాదు వాడ్ని పుట్టించిన జేజయ్యల క్కూడా జవాబు చెప్పగలం!" అన్నాడు పౌరుషంగా.

ఇద్దరూ గదిలోకి చేరుకొన్నారు. మోహిని స్విచ్ నొక్కి గదిలో దీపం వెలిగించింది. మూర్తి మంచంమీద వాలిపొయ్యాడు.

"మీరు బాగా అలిసిపోయినట్టున్నారు. బాత్

రూములో కెళ్ళి ముఖం కడుక్కుని రండి! సోపూ టవలూ లోపలే వున్నాయ్. బాయ్ చేత కాఫీ తెప్పిస్తాను" అంది మోహిని చేత నున్న వానిటీ బాగ్ ని టీపాయ్ మీద పెడుతూ.

"అవును. చాలా చిరాగ్గా వుంది. వెళ్ళి ముఖం కడుక్కుని వస్తాను" అంటూ మంచంమీంచి లేచి బాత్ రూములోకి నడిచాడు మూర్తి.

అతడు ముఖమూ కాళ్ళూ కడుక్కుని, తల దువ్వుకుని, ఫ్రెష్ గా తయారై గదిలోకి చేరుకొనేసరికి మోహిని రెండు కప్పుల్లో కాఫీ పోసి తయారుగా వుంచింది.

మూర్తి తిన్నగా వచ్చి టీపాయ్ కెదురుగా కుర్చీలో కూచున్నాడు. మోహిని అతని కెదురుగా మరో కుర్చీలో కూచుని వో కాఫీకప్పుని అతనికి అందించింది.

"థాంక్ యూ!" అంటూ కాఫీ కప్పు నందుకొని సిప్ చేసి కప్పుని టీపాయ్ మీద పెట్టాడు.

మోహిని కూడా కప్పులోని కాఫీని సిప్ చేస్తూ కూచుంది. మూర్తి పాంటు జేబులోంచి సిగరెట్టు పాకెట్ ని పైకితీసి, "ఐ వాంటు స్మోక్ విత్ యువర్ పర్మిషన్" అన్నాడు.

"నో అబ్జక్షన్!" అంది మోహిని.

మూర్తి మరోసారి జేబులు తడుముకుని "మాచెస్ ఎక్కడో మరిచిపొయ్యాను" అన్నాడు.

"ఐ విల్ గెట్ యూ! జస్ట్ యె సెకండ్!" అంటూ మోహిని టీపాయ్ ముందునుంచి లేచి పక్కకి తిరిగింది.

తక్షణం, కప్పుల స్థానాల్ని మార్చేశాడు మూర్తి.

మోహిని టేబుల్ మీద నున్న అగ్గిపెట్టె నందుకుని మూర్తికి అందించింది.

మూర్తి అగ్గిపుల్లతో సిగరెట్టు వెలిగించుకుని, దమ్ము గట్టిగా లాగి గాల్లోకి వొదలి కప్పుని చేతిలోకి తీసుకున్నాడు.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ కాఫీ సిప్ చెయ్యసాగారు.

"ఆ రాత్రి గదిలోంచి చెప్పకుండా వచ్చేశారేం?" అని ప్రశ్నించాడు మూర్తి.

"మీరు వొళ్ళు మరిచి నిద్రపోతున్నారు—మిమ్మల్ని డిస్టర్బ్ చెయ్యడం యిష్టంలేక చెప్పకుండానే బయలుదేరాను" అంది మోహిని.

"అవును! ఆ రాత్రి అంత నిద్ర యెలా వొచ్చిందో అర్థంకావడంలేదు" అన్నాడు మూర్తి అసలు విషయాన్ని బైటికి లాగాలన్న ఉద్దేశంతో.

"నిజమే! నాకూ అలాగే ముంచుకొచ్చింది! బహుశా బాగా అలిసిపోయి వున్నామేమో!" అంది అసలు విషయాన్ని దాచేస్తూ మోహిని.

మూర్తి తనలో తాను నవ్వుకున్నాడు.

కాఫీ త్రాగడం పూర్తయింది.

"మిస్టర్ మూర్తీ!—మిమ్మల్నింత క్రితం ఎక్కడో చూచినట్టుంది!" అంది మోహిని.

"అదేమిటి? నిన్న నా గదిలోనేగా మనం కలుసుకున్నది? అప్పుడే మరిచిపొయ్యారా?" అన్నాడు మూర్తి ఆశ్చర్యంగా.

"నిన్న—కాదు—అంత— క్రితం!" ఆమె మాటలు ముద్ద ముద్దగా వస్తున్నాయి.

"అంత క్రితమా?—అసంభవం!—అసలు నాదీ వూరు కాదు. ఉద్యోగంకోసం వచ్చా నీ వూరు. వచ్చి వారం రోజులు పూర్తికాలేదు. మీరు నన్ను చూడ్డమేమిటి? మనుషుల్ని పోలిన మనుషులుంటారు. ఎవర్నో నాలాంటి వ్యక్తిని చూచి వుండొచ్చు!" అన్నాడు మూర్తి.

ఆమె చిన్నగా నవ్వింది. ఆమె కళ్ళు తేలిపోతున్నాయి. నిద్ర ముంచుకొస్తోంది.

"నాకు—నిద్ర—ముంచు—కొస్తోంది — నన్ను— మంచం—మీదికి—చేర్చండి—ప్లీజ్!" బలవంతంగా కళ్ళు తెరిచి ప్రాధేయపడింది.

"అలాగే" అంటూ ఆమెను మెల్లగా కుర్చీలోంచి పైకి లేపాడు.

ఆమె నిల్చోలేక అతనిమీద వాలిపోయింది. మూర్తి ఆమెను అమాంతం చేతుల్లోకి తీసుకుని, మంచంమీద పడుకోబెట్టాడు.

"మీకు యెలా వుంది?" ఆమెమీదికి వొంగి ఆత్రంగా ప్రశ్నించాడు.

"నిన్న — రాత్రి — మీరు — ఎలా — ఫీల్ — అయ్యారో—అచ్చం—అలాగే—" మోహిని బలవంతంగా పెదాలమీదికి నవ్వు తెచ్చుకుంది. అతి ప్రయత్నం మీద కనురెప్పలు తెరిచి "మిస్టర్ మూర్తీ!—యూ ఆర్—టూ క్లవర్!" అంది.

"మీ కంటేనా?" మూర్తి తనలో తాను నవ్వుకున్నాడు.

"ఐ—లైక్—యూ!" అంటూ రెండు చేతులూ ముందుకి చాచింది.

"ఐ లవ్ యూ మోహినీ!" అంటూ మూర్తి ఆమె

మీదికి వొంగి ఆమె పెదాలని తన పెదాలతో కప్పాడు. ఆమె కళ్ళు మూతలుబడ్డయ్.

మరుక్షణం మోహిని నిద్రలోకి జారిపోయింది. చలనం లేకుండా నిర్జీవంగా, దాదాపు శవంలాగా తయారైంది. ఉఛ్వాస నిశ్వాసలతో ఆమె గుండెలు పైకీ కిందికీ అదురుతున్నాయి.

తెలివి తప్పిన వ్యక్తి శవంతో సమానం. తెలివి తప్పిన వ్యక్తిలో కోర్కెలు తీర్చుకోవడమంత నీచాను నీచం మరొకటిలేదు. అందుచేత మూర్తి ఆమెను ముట్టుకోదలచ లేదు. ఆమెమీద రగ్గు కప్పి, అక్కడ్నించి వెళ్ళిపోదామనుకున్నాడు.

కాని యింతదూరం తానెందు కొచ్చినట్టు?—తాను సాధించేదేమిటి? నిజంగా తాను దురదృష్టవంతుడు. తన కామెను పొందే యోగం లేదు. అందుకనే యిలాంటి అవాంతరాలు ఎదురవుతున్నాయి.

తాను మోహినిని పూర్తిగా మరిచిపోవాలి! తనకీ ఆమెకూ అంతరాంతరాలలో, కలుసుకోవాలన్న కాంక్ష తీవ్రంగా వున్నా, యేదో అతీతశక్తి అడ్డు పడుతోంది అనుకున్నాడు మూర్తి.

తాను పూర్తిగా మరిచిపోదలుచుకున్న వ్యక్తి తాలూకు వస్తువులు మాత్రం తన దగ్గర ఎందుకుండాలి? అని ప్రశ్నించుకున్నాడు.

వెంటనే పాంటు సీక్రెట్ పాకెట్ లోంచి ఎర్ర రాయి పొదిగిన ఉంగరాన్ని బైటికి తీసి, ఆమె కుడిచేతి ఉంగరపు వ్రేలికి తొడిగాడు.

"గుడ్ బై మై డియర్! వొస్తా!" అని చెప్పి గది

లోంచి బైటికి నడిచాడు. గది తలుపులు దగ్గరికివేసి చక చకా ముందుకి నడిచాడు.

## 4

రాత్రి పదయింది.

మూర్తి గదిలోని దీపం ఆర్పి జీరోవాట్స్ బల్బు వెలిగించి మంచంమీదికి చేరుకున్నాడు. గది మధ్య సీలింగ్ ఫాన్ తిరుగుతోంది.

ఎంత ప్రయత్నించినా అతనికి నిద్ర పట్టడం లేదు. అతని మనో నేత్రాలముందు మోహిని భువనమోహన సుందర విగ్రహం చెదిరిపోవడంలేదు. గదిలో నిశ్శబ్దం తాండవిస్తోంది.

ఉన్నట్టుండి గదిలో బజ్ మోగసాగింది. మూర్తి మంచంమీంచి క్రిందికి దిగి తిన్నగా తలుపుల దగ్గరికి చేరుకుని గడియతీసి తలుపు తెరిచాడు.

గుమ్మంవద్ద నిల్చునివున్న స్త్రీమూర్తి యెవరో కాదు. మోహిని! జగన్మోహినిలా తయారైంది. ఆమె అందాన్ని చూచి ముగుడై పొయ్యాడు మూర్తి. కళ్ళప్పగించి అలా చూస్తూ నిల్చుండిపొయ్యాడు.

మోహిని గదిలోపలికి చేరుకొని తలుపులు మూసి గడియపెట్టి వెనక్కి తిరిగింది. మూర్తి దగ్గరగా జరిగి అతని భుజంమీద తన రెండు చేతులూ వేసి, అతని కళ్ళలోకి చూస్తూ అడిగింది.

"మిస్టర్ మూర్తీ! నిన్న మీరు నా గదిలోంచి వెళ్ళిపోతూ ఏమన్నారో గుర్తుందా?" అని.

"ఏమో!-నాకు గుర్తు లేదు!-ఏమన్నాను?"

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను- అని."

"అవును!- ఇప్పటికీ ఆ మాటే అంటాను."

"నువ్వు కాబోతున్న ఆఫీసరువి! సంఘంలో గౌరవంగా బ్రతకాలనుకుంటున్నవాడివి! నాలాంటి స్త్రీని ప్రేమించి యెంతకాలం గౌరవంగా బ్రతగ్గలవ్?"

"నువ్వేమంటున్నావో నా కర్థంకావడం లేదు."

"మరింత వివరంగా చెప్పాలా?"

అవునన్నట్టు తలూపాడు మూర్తి.

"నువ్వు ఆకాశవీధిలో విహరించే మేఘానివి - నేను నూతిలో బ్రతికే కప్పని-యీ రెండూ యెన్నడయినా కలుసుకోగలవా?"

"మేఘం బరువెక్కి వర్షించినపుడు యీ రెండో కలుసుకొంటూనే వున్నాయిగదా!"

"కలుసుకోవచ్చు-కాని కలిసి బ్రతకలేవు."

"కలుసుకుంటే చాలు- కలిసి బ్రతకనక్కరలేదు,"

"కలుసుకుందామనే వచ్చాను."

"అది నా అదృష్టం!"

"కాదు-నా అదృష్టం కూడా."

"ఐతే యిక నేం ఐక్యమైపోదాం!" అంటూ మూర్తి ఆమెను తన కౌగిట్లో బంధించాడు.

ఆ రాత్రి-ఆ గది-ప్రేయసీప్రియుల ప్రణయ సంభాషణలతో, కవ్వింపులతో, కౌగిలింతలతో; నిట్టూర్పులతో వగైరా వగైరా కామకలాపాలతో పునీతమైపోయింది.

మోహిని అందగత్తే కాదు తను సుఖిస్తూ మగవాణ్ని సుఖపెట్టడంలో జాణ కూడా. మూర్తి ఆమెకు సమవుజ్జీకావడంవల్ల ఆ ప్రేమికులు ఆ రాత్రి ఆనందపుటంచుల్ని చవి చూశారు. అలిసి, సొలిసి, ఒకరిపైనొకరు సొక్కి సోలి నిద్రాదేవి వొడిలోకి జారిపొయ్యారు.

హోటల్ బాయ్ డోర్ బజ్ నొక్కేదాకా ఆ

యిద్దర్లో యెవరికీ మెలుకువ రాలేదు.

స్నానపానాదులు ముగించుకొని ఒకరికొకరువీడ్కోలు చెప్పుకునేప్పుడు మోహిని మూర్తి దగ్గర సెలవు తీసుకుంటూ అన్నది. "మక్కువ తీరేందుకు కనీసం ముచ్చటగా మూడు రాత్రులైనా గడపాలట" అంది చిలిపిగా నవ్వుతూ.

"అయితే ఇహనేం?-రాత్రికి అన్ని యేర్పాట్లూ చేయించమన్నావా?" అన్నాడు మూర్తి నవ్వుతూ.

"స్థలం మార్పు కొత్త అందాలని సృష్టిస్తుంది. ఈ రాత్రికి నా గదిలో—డిన్నర్ కూడా అరేంజ్ చేస్తాను. అభ్యంతరమా?" అంది మోహిని.

"చేతి రుమాళ్ళూ—కాఫీ కప్పులూ—మత్తుమందులికి దూరంగా వున్నంతకాలం-నాకే అభ్యంతరమూ లేదు" అన్నాడు మూర్తి తమాషాగా నవ్వుతూ.

మోహిని ముఖం చిన్నబోయింది. కుడిచేతి వుంగరపు వ్రేలిని చూపుతూ "ఈ వుంగరం విలువెంతో తెలుసా?" అని ప్రశ్నించింది.

"ఏమో నాకు తెలీదు, నేను రత్న పరీక్షకుడ్ని కాను!" అన్నాడు మూర్తి.

"ఇరవై వేలు!"

"అమ్మబాబోయ్!" ఆశ్చర్యపోయ్యాడు మూర్తి.

"ఈ వుంగరకోసం మీ మీద మత్తుమందు ప్రయోగించవలసివచ్చింది. కాని నా ప్రయత్నం ఫలించలేదు. చివరికి మీరే నా వ్రేలికి తొడిగారు. ఇక అలా ప్రయోగాలు చెయ్యవలసిన అవసరం లేదు" అంది మోహిని.

మూర్తి "అలాగా?" అంటూ ఆశ్చర్యంగా తలూపాడు. "అయితే నా అభ్యంతరం ఏమీ లేదు. రాత్రికి

నీ ఆతిథ్యం పుచ్చుకోవడానికి సిద్ధంగానే వున్నాను. ఏడింటికల్లా వచ్చేయమన్నావా?" అని ప్రశ్నించాడు.

"నువ్వు రావొద్దు! సాయంత్రం ఓ స్నేహితురాలు నన్ను కలుసుకుంటానని ఫోన్ చేసింది. ఆమెను ఇంటికి సాగనంపి నేనే యిక్కడికి వస్తాను. మనిద్దరం కలిసే వెళ్ళొచ్చు!" అంది మోహిని.

"అలాగే" అన్నాడు మూర్తి.

మోహిని మూర్తికి 'టా టా' చెప్పి ముందుకి నడిచింది.

ఆమె వెళుతూ వెళుతూ విసిరిన చిరునవ్వు గుండెల్లో పదిలపరుచుకుని, మంచంమీద వాలిపోయ్యాడు మూర్తి కలలుగంటూ.

# 5

సాయంత్రం ఏడూనలభై అయింది.

కాంపౌండు ముందు ఆటో దిగి మోహిని, మూర్తి మేడమీదకి చేరుకున్నారు. గదిముందు ఆగి మోహిని తన వానిటీ బాగ్ తెరిచి పొడుగుపాటి తాళం చెవిని బైటికి తీసి, తాళం చెవితో తలుపులు తెరిచి లోపలికి అడుగు పెట్టింది.

మూర్తి కూడా ఆమెతోబాటే గదిలోకి చేరుకున్నాడు.

మోహిని తలుపులుమూసి "నేను బాత్ రూమ్‌లోకి వెళ్ళొస్తాను. బాంయ్స్ కూడా వొచ్చే వేళయింది. నేను వచ్చేదాకా మేగజైన్ తిరుగేస్తుండండి!" అంటూ టీపాయ్‌మీద పత్రికల కట్ట పడేసి బాత్ రూమ్‌కేసి నడిచింది.

మూర్తి కుర్చీలో కూలబడి టీపాయ్‌మీద సున్న పత్రిక లిన్ని తిరగెయ్యసాగాడు.

పదినిమిషాలు దొర్లిపొయ్యేనయ్.

మంచం క్రిందనుండి ఓ ఆకారం మెల్లగా పైకి లేచింది. బొడ్లోంచి బాకు దూసి మూర్తికెదురుగా నిల్చుని వికటాట్టహాసం చేసింది.

మూర్తి బిత్తరపోయాడు అక్కడ రౌడీ రాజయ్యను చూసి.

"ఏరా పుండాకోర్! నాకు దక్కనీయకుండా నా మోహినిని తన్నుకుపోవడానికి తయారయ్యావా! అది నాకు తప్ప మరెవ్వరికి దక్కడానికి వీల్లేదు! నిన్నిప్పుడేం చేస్తానో చూడు!" అంటూ చేతిలోని బాకు పైకెత్తి మీదికి లంఘించాడు.

మూర్తి వొడుపుగా తప్పించుకోవడం వల్ల అతని ప్రయత్నం ఫలించలేదు. కాని మూర్తి చేతుల్లో ఏమీ లేదు. కత్తి చేతవున్నవాడితో పోరాడడం మాటలు కాదు. అయినా తన శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడు మూర్తి అతని చేజిక్కకుండా తప్పించుకొనడానికి.

కాని అతని ప్రయత్నం ఫలించలేదు. గదిలోని వస్తువులు చిందర వందరగా విరిగిపోతున్నాయ్. చివరికి మూర్తి ఆ వ్యక్తి చేతుల్లో చిక్కక తప్పింది కాదు.

వాడు మూర్తిని క్రింద పడవేసి గుండెలమీద కూచున్నాడు. వికటంగా నవ్వి "ఈ దెబ్బతో ఖతం! నా కడ్డు వచ్చేవాళ్ళెవరూ లేరు" అంటూ యెడంచేతితో మూర్తి పీకను నొక్కిపట్టి, కుడిచేతిని పైకెత్తాడు.

అంతే! ఏదో సుర్రుమని దూసుకువచ్చి అతగాడి గుండెలకు తగిలింది. అతడు "అమ్మా!" అంటూ పక్కకి వొరిగి

పోయ్యాడు. మూర్తి అతగాడ్ని ప్రక్కకి తోసి లేచి నిల్చున్నాడు.

మోహిని రివాల్వర్ గురిపెట్టి నిల్చునివుంది. క్రిందపడ్డ వ్యక్తి విల విల తన్నుకొని ప్రాణాలు వదిలాడు. అతని గుండెల్లోంచి చిమ్మిన రక్తం అతని తెల్లచొక్కాని తడిపి వేసింది.

"ఎంతపని చేశావు మోహినీ!" అన్నాడు మూర్తి భయంతో గజగజలాడిపోతూ.

"వీడికి జరగవలసిన శాస్తే జరిగింది. ఇక వీడి పీడ వదిలినట్టే!" అంటూ మోహిని తన రివాల్వర్ని వానిటీ బాగ్ లో దాచింది. "నేను గదిలో లేకుండా చూచి ఏ మారుతాళంతోనో గదిలోకి చేరివుండొచ్చు" అంది.

మూర్తి గజగజలాడిపోతూ నిల్చుని వున్నాడు. అతని బట్టలు చెమటతో తడిసిపోయినయ్.

కాని మోహినిలో ఎలాంటి కంగారూ కనిపించడం లేదు. చిన్నగా నవ్వి "డోంట్ వర్రీ మిస్టర్ మూర్తీ! వీడ్ని ఎలా 'డిస్ పోస్' చెయ్యాలో నాకు బాగా తెలుసు. ఇది యెప్పుడో జరగవలసింది! ఇప్పుడు నెరవేరింది!" అంటూ పక్కకి వెళ్ళి ఓ బ్లాంకెట్టు తెచ్చి వాడిమీద కప్పింది.

మూర్తి మంత్రముగ్ధుడికి మల్లే నిల్చుని చూస్తూ వుండి పోయ్యాడు.

అంతలో యెవరో డోర్ బెల్లు మోగించారు. మోహిని తలుపు తెరిచింది. హోటల్ బాయ్ డిన్నర్ కి ఆర్డర్ చేసిన ఐటెమ్స్ తో తయారుగా నిల్చుని వున్నాడు.

"అవన్నీ అక్కడ పెట్టి వెళ్ళు! మేం పట్టుకెళ తాం లోపలికి" అంది మోహిని, గుమ్మంలో నిల్చుని.

హోటల్ బోయ్ తాను తెచ్చినవన్నీ గుమ్మంముందు పెట్టేసి వెళ్ళిపొయ్యాడు.

"కమాన్ మూర్తీ వాటిని లోపలికి పట్టుకెళ్ళి డిన్నర్ కానిద్దాం! వీడిపని తరువాత చూద్దాం!" అంది హుషారుగా.

"ఈవిడ యెంత గుండెలుతీసిన బంటో!-ఓహత్య చేసి యెంత ధైర్యంగా వ్యవహరిస్తోంది!" అనుకున్నాడు మూర్తి.

"నాకీపూట భోజనం చెయ్యాలని లేదు" అన్నాడు మూర్తి.

ఆమె నవ్వింది. "నువ్వేం మగాడివి! ఈ మాత్రానికే భయపడిపోతే యెలా?" అని ధైర్యం చెప్పసాగింది.

హోటల్ బాయ్ తెచ్చినవన్నీ లోపలికి చేర్చి, గది మధ్య పడివున్న శవాన్ని ఓ పక్కకి లాగి, "కమాన్ మూర్తి! కమాన్!" అంటూ అతగాడ్ని బలవంతంచెయ్యసాగింది.

శవాన్ని గదిలో పెట్టుకుని తినాలంటే అతనికి అసహ్యంగా వుంది. కాని ఆమె బలవంతంతో యింతతిన్నాననిపించి లేచాడు. మోహిని మాత్రం సుష్టుగా భోజనం చేసి బాత్ రూములోకెళ్ళింది, చేతులు కడుక్కోడానికి.

ఒంటరిగా కూచున్న మూర్తి దృష్టి గది మధ్య కారిన రక్తంమీద పడింది. మెల్లగా దగ్గరికి వెళ్ళి రక్తం దగ్గర గొంతు కూర్చుని పరిశీలించసాగాడు. అంతలో ఆమె గదిలోకి రావడంతో లేచి నిల్చున్నాడు.

"ఏమిటి మూర్తీ! ఏమిటో పరిశీలిస్తున్నట్టున్నావు?" అని ప్రశ్నించింది మోహిని.

"ఏంలేదు. ఇక్కడ కారిన రక్తాన్ని వెంటనే

శుభ్రం చెయ్యాలి. లేకపోతే అనవసరంగా యిరుకులో పడతాం. శవాన్ని యెలా మాయం చేస్తావో నీకే తెలియాలి!" అన్నాడు మూర్తి.

"అదంతా నైట్ వాచర్ చూసుకుంటాడు. మనం అలా వెళ్ళి గాలి మేసేసి వద్దాం పద!" అంటూ అతని చెయ్యి పట్టుకుంది.

అలాగే అన్నట్టు తలూపాడు మూర్తి.

గది తలుపులు మూసి, తాళం పెట్టి మెట్లకేసి నడిచింది మోహిని. మూర్తి ఆమెను అనుసరించాడు. మోహిని నైట్ వాచర్‌తో ఏదో రహస్యంగా మాట్లాడి, తాళంచెవి నైట్ వాచర్ చేతిలో పెట్టి మూర్తిని కలుసుకుంది. ఇద్దరూ చేతులు పట్టుకుని పేవ్‌మెంటుమీద నడవసాగారు.

ఇప్పుడు మూర్తి చాలా హుషారుగా వున్నాడు. ఇంతక్రితం అతనిలో చోటుచేసుకున్న 'దిగులు - విచారం' యిప్పుడతనిలో మచ్చుకైనా కనిపించడంలేదు.

ప్రేమికులిద్దరూ అరగంట సేపు అలా షికారు వెళ్ళి గదికి తిరిగి వచ్చేసరికి నైట్ వాచర్ తన పని పూర్తి చేశాడు. గదిలో శవం మాయమైంది. గది శుభ్రంగా వుంది.

మూర్తి తనలో తాను నవ్వుకొన్నాడు.

ఆ ప్రేమికులు 'తొలి' రాత్రిలాగే 'మలి' రాత్రి కూడా ఆనందంగా గడపగలిగారు.

ఆ మరునాడే కంపెనీనుంచి తన్ను అర్జంటుగా వచ్చి ఆఫీసులో కలుసుకోవలసిందిగా వుత్తరం అందింది మూర్తికి.

మూర్తి ఆఫీసుకు వెళ్ళగానే తాను వెంటనే, బయలు

దేరి నిజామాబాద్‌లోని బ్రాంచికి వెళ్ళి చార్జి తీసుకోవలసిందినీ, అక్కడ బ్రాంచి మేనేజర్‌గా పనిచేస్తోన్న వ్యక్తి గుండెపోటువల్ల మరణించడంతో యీ మార్పు చేయవలసివచ్చిందనీ కంపెనీ ప్రొప్రైటర్ తెలియజేశాడు.

మూర్తి మోహినివద్ద సెలవుతీసుకుని ఎకాఎకిన బయలుదేరాడు.

# 6

మూర్తి నిజామాబాద్ చేరుకుని, చార్జి తీసుకొని ఆఫీసు వ్యవహారాల్లో మునిగిపొయ్యాడు. పనీ, పరిసరాలూ కొత్తకావడం మూలాన కొంతకాలంపాటు రాత్రింబవళ్ళు శ్రమపడవలసి వచ్చింది.

నెలకి జీతం అన్ని అలవెన్సులూ కలుపుకొని రెండు వేలదాకా అందుతోంది. కంపెనీవాళ్ళే అన్ని వసతులూ వున్న ఫ్రీ క్వార్టర్సూ, వాడుకోడానికి కారు ఇచ్చారు. అతనికి బాదరబందీ ఏమీ లేకపోవడం మూలాన ఎంత విచ్చలవిడిగా ఖర్చుపెట్టినా ఐదువందలకంటే ఎక్కువ ఖర్చుకావడం లేదు. జీవితం హాయిగా గడిచిపోతోంది.

ఆ సమయంలో మోహినే గనక తన పక్కనుంటే అంతకంటే అదృష్టం మరొకటి వుండబోదు అనుకొనేవాడు. ఆమెతో గడిపిన మధురమైన రాత్రులు అతనికి మాటిమాటికీ గుర్తుకి రావడంవల్ల ఆమె సాహచర్యాన్ని వొదులుకోలేక, రెండు మూడు వుత్తరాలు రాశాడు, ఆమెను ఆహ్వానిస్తూ. కాని ఆమెనుండి యెలాంటి జవాబూ అందలేదు.

ఆరుమాసాలు గడిచిపోయినయ్. మోహినిమీద వున్న మక్కువకొద్దీ మూర్తి అతిప్రయత్నంమీద హైదరాబాద్ బదిలీ చేయించుకున్నాడు. అతడు హైదరాబాద్

చేరుకున్న మరుసటిరోజే మోహినికోసం ఆమె గదికి వెళ్ళాడు. కాని ఆమె దర్శనం లభించలేదు.

ఆమె వూళ్ళో లేదనీ, ఎప్పుడు వస్తుందో తెలీదనీ, నైట్ వాచర్ తాతయ్య ద్వారా తెలుసుకున్నాడు. తన ఆఫీసుఫోన్ నంబర్ నైట్ వాచర్ కిచ్చి ఆమె వూళ్ళోకి రాగానే తనకి ఫోన్ చెయ్యమని చెప్పివెళ్ళాడు.

మరో రెండు వారాలు గడిచిపోయినా ఆమె నుండి తనకి ఎలాంటి కబురూ అందలేదు.

ఒకనాడు తన మిత్రుడొకడు మారేడ్‌పల్లిలో కొత్తగా యిల్లు కట్టుకొన్న సందర్భంలో డిన్నర్ కి ఆహ్వానించాడు మూర్తిని. డిన్నర్ ముగించుకుని యింటి ముఖం పట్టేసరికి రాత్రి ఒంటిగంట దాటింది. రోడ్డుమీద జన సంచారంలేదు. కారులూ, ఆటోలూ వగైరా వాహనాలు కూడా ఆట్టే నడవడంలేదు.

తన కారు ఓ నాలుగురోడ్లు కలిసే చౌరస్తా చేరుకునే సరికి యెక్కడ్నించో ఓ బులెట్ అతి స్పీడుగా తన కారుని దాటుకొని వెళ్ళింది. దానిలో వెనకసీట్లో కూచుని బులెట్ ని నడుపుతోన్న వ్యక్తి నడుముని తన కుడిచేత్తో చుట్టి, ఎడంచేత్తో పైకెగిరే పైటను సవరించుకుంటోన్న స్త్రీ ఎవరోకాదు—మోహిని! బులెట్ ని నడుపుతోన్న వ్యక్తికూడా తనకి బాగా పరిచయమున్న వ్యక్తిలాగే కనిపించాడు.

మూడురోజుల అనంతరం ఒకరోజు ఉదయం పక్కమీంచి లేచి బెడ్ కాఫీ సిప్ చేస్తూ, పేపరు తిరగేస్తున్న మూర్తి కంటిని బాక్స్ కట్టి ప్రచురింపబడిన ఓ వార్త ఆకర్షించింది.

"మొన్నరాత్రి ఒంటిగంటకి మారేడ్‌పల్లిలోని మంజులా బాంక్‌లో దొంగలు పడి, వాచ్‌మాన్‌ని స్పృహ తప్పించి ఇనప్పెట్టెను విరగ్గొట్టి, దాదాపు లక్ష రూపాయలు దోచుకు పొయ్యారు.

పోలీసులు దొంగతనం జరిగిన 24 గంటల్లోగా దొంగని యాభై వేల కరెన్సీతోబాటు పట్టుకుని అరెస్టు చేశారు. ఆ దొంగ పేరు రామరాజనీ, అతడు యిలాంటి దోపిడీల్లో రెండు మూడుసార్లు పట్టుబడి జైలుకెళ్ళాడనీ పోలీసులు చెబుతున్నారు.

అతనితోబాటు మరో స్త్రీ కూడా యీ కేసులో పాల్గొన్నదనీ, దోపిడీ చెయ్యబడిన మిగతా యాభై వేలూ ఆమె దగ్గరే, వుంటుందనీ పోలీసుల అనుమానం. పోలీసులు ఆమెకోసం నలుమూలలా గాలిస్తున్నారు. ఈ సందార్భంలో బాంకు మెనేజర్ మోహన్‌రావును అనుమానం మీద అరెస్టుచేశారు."

ఆ వార్త చదవగానే మూర్తి బుర్రలో ఏదో కలుక్కుమన్నట్టయింది. వెంటనే టెలిఫోన్ గైడు తిరగేసి క్రైం బ్రాంచికి ఫోన్ చేసి యేవో వివరాలు తెలుసుకుని తృప్తిగా వూపిరి పీల్చాడు. రసీవర్‌ని ఫోన్ మీద పెట్టేసి బాత్ రూముకేసి బయలుదేరాడు.

మూర్తి కాలకృత్యాలు తీర్చుకుని బట్టలు తొడుక్కుంటుండగా బంట్రోతు వచ్చి చెప్పాడు. "మీకోసం ఎవరో వచ్చారు సార్. విజిటింగ్ రూములో కూచోబెట్టి వచ్చాను" అని.

మూర్తి గబగబా బట్టలు తొడుక్కుని విజిటర్స్ గది లోకి చేరుకున్నాడు. మోహిని సోఫాలో వాలి అతని కోసమే యెదురు చూస్తోంది.

"హల్లో మోహినీ! ఇంతకాలం యేమయ్యావ్? నీ

కోసం నే నిక్కడికి వచ్చినప్పటి నుండీ ప్రయత్నిస్తున్నాను" అన్నాడు మూర్తి ఆమె కెదురుగా కుర్చీలో కూచుంటూ.

"మీతో ఓ రహస్యం మాట్లాడాలి" అంది మోహిని దిక్కులు చూస్తూ.

"మరేం ఫరవాలేదు. ఇక్కడికెవరూ రారు. ఒక విజిటర్ లోపలుండగా మరో విజిటర్ లోపలికి రావడానికి వీల్లేదు. ఒంట్రోతులు పంపరు. నువ్వు నిర్భయంగా చెప్పవచ్చు ఆ రహస్య మేమిటో?...." అన్నాడు మూర్తి.

"నాకు అర్జెంటుగా పదివేల రూపాయలు కావాలి" అంది మోహిని.

"పదివేల రూపాయలా?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు మూర్తి.

"పదివేలు కాదు. లక్ష!—కాని ఒక్కసారిగా లక్ష రూపాయలు తెమ్మంటే ఎక్కడ్నించి తెస్తావ్? మొదటి యిన్స్టాల్ మెంటు పదివేలు చాలు. మిగతా తొంభై వేలు మెల్లగా వసూలు చేస్తాను."

"ఏమిటి? నా దగ్గరనుండి లక్షరూపాయలు వసూలు చేస్తావా?" అని ప్రశ్నించాడు మూర్తి ఆశ్చర్యంగా.

"అవును."

"ఎందుకు?"

"నీ రహస్యం దాచినందుకు."

"నాకు రహస్యాలేమీ లేవే!"

"ఎందుకు లేవూ? వుంది! రౌడీ రాజుగాడ్ని నా రివాల్వర్ తో చంపలేదూ?"

"ఏమిటి? రాజీగాడ్ని చంపింది నేనా?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు మూర్తి.

"నువ్వో నేనో యెవరు చూశారు? నా కోసం నా వెంటబడుతోన్న రాజిగాడ్ని నా ప్రియుడివైన నువ్వు చంపావు—అని నే నంటున్నాను. కాదని నిరూపించ గలవా?"

"అయితే నన్ననవసరంగా యీ రొంపిలోకి దించుతున్నావన్నమాట."

"లేదు మిస్టర్ మూర్తీ! నీమీద యీ నేరాన్ని మోపాలనీ నిన్ను పోలీసులపాలు చెయ్యాలనీ నా కే మాత్రం లేదు. నే నడిగిన రొక్కం నా కప్పజెప్పితే నీకే ఆపదా రాదు. నువ్వు ఓ. కంపెనీ మేనేజర్‌వి. సంఘంలో నీకు మాంచి పలుకుబడి వుంది. నీకీ పదివేలూ వో లెక్కలోది కాదు. నే నడిగిన పైకం నా కప్పజెప్పి సంఘంలో నీ పరువుని కాపాడుకో. నా కీ పైకం మూడు రోజుల్లో కావాలి! నే నర్జెంటుగా వొక చోటుకి వెళ్ళాలి!" అంది మోహిని.

"నువ్వు నన్ను బ్లాక్ మెయిల్ చేస్తున్నావా?"

"నువ్వు దానికేం పేరు పెట్టినా నా కభ్యంతరం లేదు! నాకు కావలసింది డబ్బు!"

"డబ్బుకోసం ఏమైనా చేస్తావా?"

మోహిని మాట్లాడలేదు.

మూర్తి లేచివెళ్ళి యెవరికో ఫోన్ చేసి వచ్చి మళ్ళీ కూర్చున్నాడు.

"నువ్వడిగిన పదివేలూ నీ కందజేస్తాను. ఒక్క రాత్రి నువ్వు నాతో గడుపు!"

"షటప్! యూ ఫూల్! నేను వొళ్ళమ్ముకొనే

వ్యభిచారిని కాను."

"ఇంత క్రితం రెండు రాత్రిళ్ళు నీ శరీరాన్ని నా పరం చేశావు గుర్తులేదా?"

"నా శరీరాన్ని డబ్బుకి కుదవ బెట్టలేదు. ఇష్టం వుండి కోరిక తీర్చుకొన్నాను."

"మై డియర్, మోహినీ! నేనంటే నీ కిష్టమే కదూ....?"

"కాకపోతే నీతో రెండు రాత్రిళ్ళు గడిపేదాన్ని కాదని యింత క్రితమే చెప్పాను. అర్థం కాలేదా?"

"ముచ్చటగా మూడు రాత్రిళ్ళయినా గడపందే మక్కువ తీరదని నువ్వేగా అన్నావు? మనం గడిపింది రెండే రెండు రాత్రిళ్ళు. ఆ వొక్క రాత్రి కూడా పూర్తి చేసి నా కోరిక తీర్చు—"

"తీరిస్తే పదివేలిస్తావా?"

"పదివేలా?" పకపకా నవ్వాడు మూర్తి. "నా రహస్యాన్ని నువ్వు కాపాడుతున్నందుకా?" తమాషాగా ప్రశ్నించాడు.

ఆమె తీక్షణంగా అతనికేసి చూస్తూ "అవును" అన్నట్టు తలూపింది.

"అసలు రాజయ్య హత్య చెయ్యబడితేగా, అది రహస్యమవుతుంది?" అని ప్రశ్నించాడు మూర్తి.

"రాజయ్య హత్య చెయ్యబడడం నువ్వు చూడలేదా?"

"మన విషయం కాదు నేనంటున్నది? రాజయ్య హత్య చెయ్యబడ్డ విషయం పత్రికల్లో ప్రచురింపబడలేదు. అటు ప్రజలుగానీ, ఇటు పోలీసులు గానీ అనుమానించలేదు. అసలు అతని శవాన్ని సైతం ఎవరూ చూడలేదు.

అలాంటప్పుడు రాజయ్య హత్య చెయ్యబడ్డాడంటే ఎవరు నమ్ముతారు?" అన్నాడు మూర్తి.

"అవును. నైట్ వాచర్ తాతయ్య అతని శవాన్ని యెవరికంటా పడకుండా దాచేశాడుగనక అతని హత్యను గురించి ఎవరూ అనుమానించలేదు. హత్య జరిగినప్పుడు చూచినవాళ్ళూ, శవాన్ని దాచినవాళ్ళూ సాక్ష్య మివ్వడానికి సిద్ధంగా వున్నప్పుడు రాజయ్య హత్యచెయ్యబడ్డాడన్న విషయాన్ని నిరూపించడం అతి కష్టమైన పనేం కాదు" అంది మోహిని.

"హతుడు పోలీసుల కస్టడీలో సురక్షితంగా వున్నప్పుడు హతం చెయ్యబడ్డాడని ఎందరు సాక్ష్యమిచ్చినా ప్రయోజనం వుండదు."

"ఏమిటి? రాజయ్య పోలీసులకస్టడీలో వున్నాడా?" కంగారుగా ప్రశ్నించింది మోహిని.

"అవును. మాచేడ్ పల్లిలోని మంజులాబాంక్ లో లక్ష రూపాయలు దొంగిలించినందుకు పోలీసులు అతడ్ని అరెస్టు చేశారు. అతని అసలు పేరు రామరాజు. ఇనప్పెట్టెలు పగలగొట్టడంలో ఆరితేరిన చెయ్యి. ఇంత క్రితం రెండు మూడుసార్లు జెయిలుకి గూడా వెళ్ళొచ్చాడు. ప్రస్తుతం వేషం మార్చి రౌడీ రాజయ్యగా చలామణీ అవుతున్న వ్యక్తే రామరాజు!"

"వాట్?" మోహని ఆశ్చర్యంగా చూచింది.

"అతని పార్టనర్ రీటా అనే స్త్రీకోసం పోలీసులు గాలిస్తున్నారు. ఆమె కూడా అతనిలాగే పేరు మార్చి పోలీసుల కంటబడకుండా తప్పించుకొని తిరుగుతోందనీ, ఆమె ప్రస్తుత నామధేయం మిస్ మోహినీదేవి అనికూడా పోలీసులికి తెలుసు!"

మోహిని దెబ్బ తిన్న ఆడ సింహంలా కంగారు పడింది.

మూర్తి వికటంగా నవ్వాడు. "మోహినీదేవిగారూ! నువ్వూ ఆ రామరాజూ కలిసి నన్ను వంచించేందుకు ఆడిన నాటకం నా కర్థంకాకపోలేదు. నువ్వు అతగాడిమీదికి పేల్చింది ఫాల్స్ బులెట్ అనీ, అతని గుండెల్లోంచి కారిన రక్తం రంగునీళ్ళనీ నేనా నాడే గుర్తించాను. మీ పాపం పండింది! పోలీసులు యిప్పుడో, మరుక్షణమో నిన్ను అరెస్టుచేసి నీ పార్టనర్ దగ్గరికి పంపడానికి సన్నాహాలు చేస్తున్నారు" అన్నాడు. "మీ తోడుదొంగ తాతయ్యని యీపాటికి అరెస్టుచేసి వుండొచ్చు!"

మోహిని చటుక్కున లేచి పరుగెత్తింది. మూర్తి పరుగెత్తి ఆమెను పట్టుకొన్నాడు. ఆమె గింజుకో సాగింది.

అంతలో డోర్ బెల్లు మోగింది. మూర్తి తలుపు తెరిచాడు. పోలీసులు ప్రత్యక్షమయ్యారు.

క్రైంబ్రాంచి ఇన్‌స్పెక్టర్ రీటా చేతులికి బేడీలు తొడుగుతూ "మీ సహాయానికి మా కృతజ్ఞతలు మిస్టర్ మూర్తీ! మీరీ సాయం చేసివుండకపోతే మేమీ మాయ లేడీని పట్టుకోవడంలో మరికొంత శ్రమపడవలసి వచ్చేది! చాలా థాంక్స్!" అన్నాడు.

కామించిన కాంతను కటకటాల్లోకి పంపేందుకు మనసొప్పకపోయినా, ఆ కాంత కాలాంతకురాలని తెలిసిన తరువాత మూర్తి మనసు కుదుటపడింది.

—:ఐపోయింది:—

# పొగమంచు

సీరియల్



ముద్దా సురేష్

# (మొదటి భాగము)

భావ్‌నగర్ గ్రామం అప్పుడే నిద్రనుంచి మేల్కొం టోంది.........

ఊరికి మధ్యగావున్న ప్రధాన రహదారిలో యిప్పు డిప్పుడే సందడి గోచరిస్తోంది....

బొంబాయి నగరాన్కి ఆవలగా, మూలకు విసిరేసి నట్టున్న ఆ పల్లెలో దైనందిన జీవితం ఎప్పుడూ ప్రశాం తంగా వుంటుంది.

అక్కడి సుందరమైన వాతావరణం మధ్య ప్రశాం తంగా గడపడానికి అప్పుడప్పుడు పట్నంనుంచి టూరి స్టులు వస్తూంటారు. కాని కొద్దిరోజుల్లోనే-అక్కడి నత్త నడక జీవితం అసహనంగా తోచి, తిరిగి వెళ్ళిపోతూం టారు.

మైథిలి ఆ రోజు కూడ యధావిధిగా ఉదయం ఎని మిదిన్నర గంటలకు తన ఫాన్సీ షాపు తెరిచింది. గత పది సంవత్సరాలుగా (భర్త చనిపోయినప్పటినుంచి) ఆమె రోజూ అదే టైంకి కొట్టు తెరుస్తోంది.

నడివయసులో ఉన్న మైథిలికి ఒక్క కొడుకు తప్ప యెవరూ లేరు. ఆ గ్రామంలో అందరితో స్నేహ పూర్వ కంగా మెలుగుతుంది.

"గుడ్ మోర్నింగ్ ఆంటీ!"

తలెత్తి బైటికి చూసింది మైథిలి.

బాలు, లిల్లీ బైట నిలబడి ఉన్నారు. తెలుపు-నీలం దుస్తులో.

"అరే బాలూ! బెహన్‌తో కాన్వెంట్‌కి బైలు దేరావా?" అంది చిరునవ్వుతో పలకరింపుగా.

"హాఁ ఆంటీ!" పరధ్యానంగా అన్నాడు కుర్రాడు; మెడసాచి గాజు సీసాల్లో ఉన్న స్వీట్సుకేసి ఆత్రంగా చూస్తూ.

"ఏమ్మా లిల్లీ! మీ డాడీ ఆదివారం కదా డబ్బులు యిచ్చేది! ఈ రోజు శనివారం కదా?"

గర్వంతో ఆ పాపముఖం చాటంత అయింది. "మరే, డాడీ బూట్లు అన్నీ రాత్రే పాలిష్ చేసేసాం కదా, అందుకనీ....యివాళే యిచ్చేసారు రూపాయి" అంది ముద్దుగా.

వారి తండ్రి పోలీస్ ఇన్ స్పెక్టర్.

స్టేషన్ పక్కా ఊళ్ళో వుంది.

"అబ్బా! అయితే ఏం కావాలో జల్దీగా చెప్పండ్రా మళ్ళీ మీ బస్సు వెళ్ళిపోతుంది" అడిగింది మైథిలి.

లిల్లీ-కాఫీ చాక్లెట్ల సీసాను చూపిస్తూ చేయి చాపింది. బాలూ తల ఊపాడు మెచ్చుకోలుగా.

"పావలాకెయ్యి అంటే నాకు రెండు లిల్లీకి రెండు."

"ధరతగ్గింది. పావలాకు అయిదిస్తాను. మిగతాది సమంగా పంచుకోండేం?"

మైథిలి సీసా మూత తీసి చాక్లెట్లు యిస్తుండగా పిల్లలిద్దరూ సంతోషంతో తలలూపారు.

"థ్యాంక్యూ ఆంటీ" అంది లిల్లీ ఒక చాక్లెట్టు గౌను జేబులో భద్రపరచుకొని, రెండో దానిమీది కాగితం ఒలుస్తూ.

బాలూదగ్గర రూపాయి తీసుకుని ముప్పావలా తిరిగి ఇచ్చింది మైథిలి. "డబ్బులు జాగ్రత్తరా! యికవెళ్ళండి."

ఒకరి చేయి ఒకరు పట్టుకొని, బూట్లు టక టక లాడించుకుంటూ పరిగెట్టారు పిల్లలిద్దరూ.

"భాభీజీ!"

తలెత్తి చూసింది మైథిలి.

పోస్టుమాన్ షాజహాన్-సైకిల్ని బయటి తలుపుకి జేరవేస్తున్నాడు.

"ఆవ్-షానూ! ఏమైనా వుత్తరం వుందా నాకు?"

"హాఁ భాభీ! మీ అబ్బాయి దగ్గిర్నుంచి అనుకుంటాను" షాపులోకి అడుగు పెడుతూ అన్నాడు పోస్టుమాన్, "ఈ రోజు యింకా చలిగానే వుంది, చాలా యిళ్ళు తిరగాలి."

అనువచ్చని ప్రత్యేకమైన ఇన్‌లాండ్ వుత్తరం-కట్టలోంచి బైటికి తీసి ఆమె కందించాడు.

అది అందుకొంటూన్న మైథిలీ ముఖంలో అకస్మాత్తుగా రంగులు మారటాన్ని గమనించాడు షానూ.

"సంవత్సరమైంది ఆర్మీలో చేరి, ఔనా భాభీ?" మౌనంగా తల ఊపిందామె, కవరుమీది చేతివ్రాతను తదేకంగా చూస్తూ.

"విచారపడకూడదు భాభీ! వయసులో ఉన్న కుర్రాడి జీవితమంతా ఈ పల్లెటూళ్లో వుంటే ఏం రాణిస్తాడు చెప్పు? రకరకాల ప్రదేశాలు తిరిగాలి. ఆ ఠాకూర్‌గారబ్బాయి చూడు. మందుల కంపెనీ రిప్రజెంటేటివ్‌గా ఎన్ని ఊళ్ళు తిరుగుతాడో, ఎంత వుత్సాహంగా వుంటాడో. ఒక చోట కాలు నిలవదు గదా."

మైథిలి మళ్ళీ తల ఊపింది, లెటర్ చించుతూ "నువ్వు చెప్పింది నిజమే షానూ! కాని వాడ్ని వదిలి దూరంగా ఉండడాన్కి బాధగా వుంది. వాడు చాలా అమాయకుడు."

"కన్నతల్లికెప్పుడూ అలాగే అనిపిస్తుంది" పో

మాన్ బరువుగా నిట్టూర్చి-భుజాలు యెగరేశాడు. "అచ్ఛా భాభీ? మళ్ళీ కలుస్తాను. యింకా చాలాచోట్లు తిరగాలి"

"ఠీక్ హై సాబ్!"

ఆమె, మడతలు విప్పి ఉత్తరం చదవసాగింది.

మెల్లగా ఆమె ముఖంలో చిరునవ్వు ప్రత్యక్షమైంది, ప్రేమగా, కొడుకు పొగుడుతూరాసిన వాక్యాలు చదువుతూ.

అకస్మాత్తుగా ఆమెకు కళ్ళు తిరిగినట్లయింది....తటాలున కౌంటర్‌ని పట్టుకుని నిలదొక్కుకుందామె....

ఆమెకు గుర....గుర .... మంటూ ఓ విచిత్రమయిన ధ్వని వినిపించసాగింది.

ఆ శబ్దం క్రిందనుంచి వస్తోంది....కాళ్ళక్రింద .... నించి....

ఈసారి కాలిక్రింద నేల కదలసాగింది....

భయవిహ్వలయై కౌంటర్‌ని గట్టిగాపట్టుకుంది మైథిలి.

ఏమిటీ శబ్దం??....

నేల కదలిక క్రమంగా ఉధృతం కాసాగింది....

షెల్ఫుల్లోని సీసాలు ఒకదానికొకటి తగులుతూ చప్పుడు చేయసాగాయి....

పాకెట్లు నేలమీదకి దొర్లసాయి....

భూమిలోంచి వచ్చే వికృతమైన గరగర శబ్దం ఎక్కువౌతోంది....

ఆమె మెదడు అంతా, ఆ భయంకర శబ్దంతో నిండుకోసాగింది....

ఆమె చేతిలోని లేఖ జారిపడింది....

శబ్దాన్ని భరించలేక ఆమె రెండు చేతులతో చెవులు గట్టిగా మూసుకుంది....

ఒక్కసారిగా భూమి తీవ్రంగా కంపించింది....

ఏమిటీ వైపరీత్యం? మొత్తం పాపంతా వణుకు తున్నట్టు అన్పించిందామెకు.

అనిపించడం కాదు-నిజమే.

గోడకున్న పెద్ద గాజు బీరువా, బీటలువారి, భళ్ళున నేలమీద పడింది!

షెల్ఫులు నేలామీదకు విరుచుకుపడ్డాయి....

"ధ్వని" చెవులు బ్రద్దలు కొడుతోంది....

అది పీడ కల కాదు....

నిజంగా జరుగుతోంది.

కెవ్వున కేక వేస్తూ, తూలుకుంటూ బయటికి పరిగెత్త బోయి బాలన్స్ తప్పి క్రింద పడింది. కాలు మోపి, నిల బడ్డానికి ప్రయత్నించినప్పుడల్లా, ఆమె మోకాళ్ళు పట్టు సడలి పడిపోతోంది....

ఏ క్షణంలోనైనా మేడ కూలి పడుతుందన్న భయంతో, మైథిలి పాక్కుంటూ గుమ్మం వైపు కదల సాగింది....

అడ్డూ ఆపూ లేని ఆ తీవ్రమైన భూకంపనవల్ల ఆమె చేతికి ఒకోసారి నేల తగలడం లేదు.

ఆమె ఎలాగో బైటి తలుపుసు చేరుకుని రోడ్డువైపు చూసింది.

ఆశ్చర్యంతో ఆమె కళ్ళు పెద్దవి కాగాయి.

మైథిలి-తన కళ్ళు చూచిన సత్యాన్ని నమ్మలేక పోతోంది.

కరకరలాడుతూ, మెయిన్ రోడ్డు నిలువునా చీలి పోవడం....సైకిల్ నడిపిస్తున్న పోస్టుమేన్ ఆ చీలికలో అకస్మాత్తుగా కూరుకుపోయి సైకిల్‌తో సహా మాయం

కావడం అంతా కనురెప్పపాటులో జరిగిపోయింది.

రోడ్డు చివర స్కూలు బస్సుకోసం నిలబడివున్న బాలు మరి కొందరు కూడా కీచుగా అరుస్తూ మైథిలీ చూస్తుండ గానే ఆ అగాధంలోకి పడిపోయారు.

నేలలో ఏర్పడ్డ ఆ చీలిక జర జరా శ్రీలా ముందుకు పాకిపోసాగింది.

ఆ పల్లెటూర్ని అకస్మాత్తుగా ఓ అద్వితీయ శక్తి బలంగా రెండు భాగాలుగా చీల్చినట్లయింది.

మరుక్షణం రోడ్డులో సగభాగం మాయమైంది.

ఓ బ్రహ్మాండమైన జంతువు నోరు తెరుచుకుని ఆవు లిస్తున్నట్లుందా నేల!

అవతలివైపు పాపులన్నిటినీ, యిళ్ళనన్నింటినీ భూమి తన నోట్లోకి లాగేసుకుంటున్న భీకర దృశ్యం మైథిలి కంట బడి నిలువునా వణికిపోయింది.

* * *

మహారాణా- తన కారుని, గేరుమార్చి - భావ్ నగర్ గ్రామానికి వెళ్ళే రోడ్డువైపు తిప్పాడు.

అతని గడ్డం మాసి వుంది.

ఉదయపు మంచుకి-అతని బట్టలు యింకా తడిసి వున్నాయి. రాత్రిలో సగభాగం నిద్రలేకుండా అతను పొదల చాటున గడిపాడు.

ఖుల్నా ఏరియాలో రాత్రి అతను పరిశోధనలు జరి పాడు.

ఖుల్నా ఏరియా విస్తీర్ణం వందమైళ్ళు దాదాపు వుంటుంది. ఆ ప్రాంతం అంతా ఇండియన్ ఆర్మీ చేతిలో వుంది.

అక్కడ ఎప్పుడూ శిక్షణ తరగతులు, కవాతులు

సైనికదళాలచే వివిధ రకాల ప్రయోగాలు, నిర్వహింప బడుతూ వుంటాయి.

ఆ స్థలంలో బైటి వ్యక్తులు తిరుగుతూ, సైనికుల కంటబడితే తీవ్రమైన చర్యలకు గురి కాబడతారు.

చాలచోట్ల ఆ హెచ్చరిక బోర్డులు కనబడతాయి.

"ప్రొహిబిటెట్ ఏరియా. ట్రెస్‌పాసర్స్ విల్ బి ప్రాసిక్యూటెడ్".

అన్న వార్నింగ్ బోర్డులు హిందీ, యింగ్లీష్ భాషల్లో ఆ స్థలం చుట్టు ఎదురౌతాయి, ఎర్రటి అక్షరాల్తో.

ఆ గ్రౌండ్స్‌లోకి ఎవరూ 'పొరపాటున' అడుగు పెట్టే అవకాశం లేదు.

చుట్టూ వున్న బార్బ్‌డ్ వైర్ ఫెన్సింగ్ ఆ విష యంలో శ్రద్ధ వహిస్తుంది.

అనేక మైళ్ళ పరిధి చుట్టూ ఆక్రమించుకొన్న ఆ ముళ్ళ తీగల ఫెన్సింగ్ వల్లా, అడవిలా పెరిగిన చెట్లూ చేమల వల్లా-లోపల ఏం జరుగుతుందో తెల్సుకొనే అవకాశం బైటి వ్యక్తికి లేదు.

ఆ ప్రాంతాలో తను చేస్తున్న పరిశోధనలు గుర్తుకు వచ్చి, అసహ్యంగా రాణా తల విదిలించాడు.

తను చేస్తున్న పని-యెంత సిగ్గుచేటు?

ఎంత ప్రమాదం?

ఒకే ప్రభుత్వం క్రింద పని చేస్తున్న,

ఒకే ప్రభుత్వపు జీతాలు తీసుకొంటున్న,

రెండు డిపార్టుమెంట్లు-

ఒకదానిపై రెండోదాన్ని నిఘా వేసి ఉంచమంటే బాధాకరం కాదూ?

తన పరిస్థితి అదే యిప్పుడు!

ఒకటి రక్షణ శాఖ!

రెండోది వాతావరణ కాలుష్య పరిశోధన శాఖ!

తను అంతరంగిక కార్యకలాపాల్లో, మరో డిపార్టు మెంట్ తల దూర్చకూడదు, దేని రహస్యాలు దానివే అన్న ఆర్గ్యుమెంట్ తో ఈ రెండు శాఖలు, విడివిడిగా వుండాల్సి వచ్చింది.

డిపార్టుమెంట్ ఆఫ్ ఎన్విరాన్ మెంట్, సరికొత్తగా ప్రారంభించిన ఓ రహస్య విభాగంలో ఇన్ వెస్టిగేటింగ్ ఆఫీసర్ గారి క్రూట్ అయ్యాడు రాణా.

పరిసరాల కాలుష్యం, నదీ కాలుష్యం మొదలైనవి ఏర్పడినపుడు, చుట్టుప్రక్కల ఏవైనా వ్యాధులు ప్రబలుతూంటే వాతావరణ పరిశోధన శాఖ ఆధ్వర్యంలో క్రొత్తగా యేర్పాటు చేయబడ్డ ఈ రహస్య విభాగం- ఆ సమస్యను లోతుగా పరిశోధించాల్సి వుంటుంది.

డిపార్టుమెంట్ ఆఫ్ ఎన్విరాన్ మెంట్ ఈ కొత్త యూనిట్ ని ప్రారంభించడానిక్కి ముఖ్య కారణం-పరిశోధనలు అతి రహస్యంగా జరుపవల్సి వుండటమే.

ఓ కంపెనీగాని, లేబొరెటరీకానీ, ఫాక్టరీగానీ(మనిషి ఆరోగ్యానిక్కి ప్రమాదకరమైన) మిగిలిపోయిన రసాయనిక పదార్థాల్ని, చెత్తని యెక్కడైనా పాతిపెట్టినా, నదుల్లోకాని, సముద్రంలోకాని పారబోసినా, ఆ నేరానికి ప్రత్యక్షపద్ధతుల ద్వారా ఎవిడెన్స్ ఎంత ప్రయత్నించినా లభ్యంకానప్పుడు-రంగంలో దూకవల్సినది ఇన్వెస్టిగేటింగ్ ఆఫీసర్ రాణా!

రాణా సాధారణంగా వొంటరిగానే పని చేస్తాడు,

ఒక్కోసారి మారు పేర్లతో.

కావాల్సిన ఇన్‌ఫర్మేషన్ సంపాదించవల్సినపుడు రాణా అవలంబించే పద్ధతి, సాధారణ కార్మికుడిగా మారు వేషంలో ఫాక్టరీలో ప్రవేశించడం.

ఈ విధమైన చట్ట వ్యతిరేకమైన కార్యకలాపాల్ని పరిశోధించడంకోసం రాణా యెన్నోసార్లు ఆస్పత్రులు, ఫాక్టరీలు, ప్రభుత్వ కర్మాగారాలు వగైరాలలో ప్రవేశించాడు.

ఎంతోమంది వాతావరణ కాలుష్య నేరస్థులను బైట పెట్టాడు. కాని రాణాకు సంతృప్తిలేదు.

పైగా ఉద్యోగంమీద విరక్తి కలుగుతోంది.

ఎందుకంటే, రాజకీయ నాయకులు కలుగజేసుకోవడం వల్లా, కోటీశ్వరుల పలుకుబడివల్లా ఆ బడా నేరస్థులకు శిక్షపడే అవకాశాలు, సందర్భాలు తక్కువ.

అటువంటప్పుడు అతను అహోరాత్రాలు కృషి చేసి నందుకు ఫలితమేమిటి?

రాణా వయస్సు ముప్పైరెండు సంవత్సరాలు. కాని దేహ ధారుఢ్యంవల్ల ఐదు సంవత్సరాలు తక్కువగా కన్పిస్తాడు.

ఖుల్నా యేరియాలో మిలటరీ నిర్వహిస్తున్న ప్రయోగాలు—చుట్టుపక్కల ప్రజల ఆరోగ్యానికి హాని కలిగించేవని చూచాయగా తెలిసింది పరిసరాల కాలుష్య శాఖకి.

ఆ విషయం నిర్ధారించుకొనే ప్రయత్నంమీద రాణా అక్కడ రహస్యంగా సంచరించాడు.

రెండు డిపార్టుమెంట్లమధ్య గూఢచారిత్వం నెరపడం రాణాకి యిష్టంలేదు.

కానీ తన డ్యూటీ తాను చేయక తప్పదు.

నిర్విరామంగా రెండురోజులు పని చేశాడు రాణా, పాట్రోల్ చేసే సైనికులను తప్పించుకొంటూ, అంతులేని ఆ ఖుల్నా ప్రాంతాన్ని ఫోటోలు తీస్తూ, ఇన్ఫర్మేషన్ సంపాదిస్తూ....

ఆ నిషేధ స్థలంలో తను సంచరిస్తూ దొరికిపోతే వచ్చే పరిణామాలని జ్ఞాపకం చేసుకొని నవ్వుకొన్నాడు రాణా. తనకి భయం లేదు.

ఆ పరిణామాలేమిటో రాణాని పంపించిన అధికార్లకు కూడా తెలుసు.

అయితే రాణాపై, రాణా సామర్థ్యంపై వారికి పూర్తి నమ్మకం ఉంది—దొరికిపోడని.

కారుని రోడ్డు మలుపు తిప్పిన రాణా, యెదురుగా ఉన్న భావ్‌నగర్ గ్రామాన్ని చూసాడు—సాలోచనగా.

తన దగ్గరున్న మాప్‌లో అతి చిన్న చుక్క, ఆ గ్రామం. ఏమయినా, యిక్కడ తనకు టిఫిన్ పెట్టే హోటల్ కనబడొచ్చు!

గ్రామం మధ్యనుంచి పోయే మెయిన్ రోడ్డు చేరుతుండగా, తన కారు నడకలో వచ్చిన మార్పుని గ్రహించాడు రాణా.

అంతే కాదు.........యెక్కడ్నుంచో గర గర శబ్దం!?....

రాణా నుదురు చిట్లించాడు....

అతని కారు—రోడ్డుమీద విచిత్రంగా, ఎత్తి కుదేస్తున్నట్లు ఊగుతూ, అదురుతూ నడవసాగింది.

వాహనం మెయిన్ రోడ్డు చేరుకోగానే రాణా కళ్ళు బైర్లు కమ్మినట్లయింది.........కారు నడక మందగించింది....

అప్పుడే యెదురుగా కొనసాగుతున్న విచిత్రఘట్టం ఆతని కళ్ళ బడింది.

నేలలో బ్రహ్మాండమయిన చీలిక, అతని యెదురుగా ఏర్పడింది.

ఆ పగులు, అతి వేగంగా వంకరటింకరగా మెరుపులా ప్రయాణిస్తూ.........క్రమంగా నేల వెడల్పుగా ప్రక్కలకు జరగసాగింది....

స్థాణువులా, కళ్ళప్పగించి చూస్తున్న రాణా, మెదడు మొద్దుబారిపోయే ముందు క్షణంలో జరిగిపోయిన ఒక దారుణ దృశ్యాన్ని అర్థం చేసుకోగలిగాడు.

యిద్దరు పసివాళ్ళు, సంచి పట్టుకొన్న ఓ స్త్రీ వారికి కొంచెం దూరంలో సైకిల్ పట్టుకొన్న ఓ వ్యక్తి ఇంకా అనేకులు రోడ్డు మధ్యగా ఏర్పడ్డ ఆ బ్రహ్మాండమైన చీలికలో మాయమై పోయారు.

తనకి కుడివైపు వున్న షాపులన్నీ పెద్దదవుతున్న ఆ గోతిలో కూలిపోసాగాయి....

క్రిందనుండి ఏదో గందరగోళపు శబ్దం....

భూమి అలా కరకరా విడిపోతూ వుండగా ఏర్పడు తున్న ధ్వని రాణా చెవుల్ని బ్రద్దలు కొడుతోంది.

తన కారు క్రింద వున్న నేలకూడా ప్రక్కలకు విడిపోతున్నట్లు గ్రహించిన రాణా కారు సడెన్ బ్రేక్ వేశాడు.

అతని ముఖం భయంతో తెల్లగా పాలిపోయింది....

గాభరాగా అతను తలుపు తోసాడు....!

కాని అప్పటికే ఆలస్యమైంది!

కారు ఒక్క అడుగు ముందుకి జరిగి—ఆ పాతాళం లోకి కూలిపోసాగింది....!!!

కారు తలుపు దేనికో తగిలి ఫడాలున మూసుకొంది....

క్రిందికి జారిపోతున్న ఆ వాహనంలో రాణా 'ట్రాప్' అయిపోయాడు!

ఒక్క క్షణంపాటు, కూలిపోతున్న ఆ కారు క్రింద ఏదో అడ్డుపడి ఆగిపోయింది.

భూమి రెండు భాగాలుగా, యింకా ప్రక్కలకు విడిపోవడంతో తిరిగి కారు మళ్ళీ అగాధంలోకి ప్రయాణించసాగింది.

ప్రాణభయంతో, తెల్లగా పాలిపోయిన ముఖంతో అతను పిచ్చివాడిలా కేకలు పెట్టసాగాడు.

మట్టికి, కొట్టుకుంటూ, బరబర శబ్దంతో క్రిందికి జారిపోతున్న ఆ కారు, అటూ ఇటూ ఉన్న మార్గం ఇరుకై హఠాత్తుగా ఓ చోట ఆగిపోయింది.

భయంతో ముడుచుకుపోయాడు రాణా.

మెదడు మొద్దుబారిపోయింది.

ఏం జరుగుతోందో, ఎందుకు జరుగుతోందో, యెలా జరుగుతోందో అతనికి అర్థం కావడంలేదు.

స్టీరింగ్ వీల్ కీ, సీటుకీ మధ్య చిక్కుకుపోయిన రాణా, భయంగా అద్దంలోంచి తొంగిచూశాడు.

క్రింద అంతా అంధకారబంధురం!

చీలిక లోపల—యిరుకుగా ఉండడంవల్ల తన వాహనం చిక్కుపడిపోయింది.

నేల మళ్ళీ ప్రక్కలకు జరిగితే. కారు తిరిగి లోయ లోకి జారుతోంది.

రాణా అద్దంగుండా, నేల ఉపరితలంవైపు చూడ్డానికి ప్రయత్నించాడు.

అయితే—గింగుర్లు తిరుగుతున్న దట్టమయిన దుమ్ము, ధూళి తప్ప—అతనికేం కనబడలేదు.

ప్రాణభయం అతన్ని పని చేసేలా చేసింది!

ఛాతీకి గుచ్చుకుంటూ వంగిపోయిన స్టీరింగ్ వీల్ని తప్పించుకుంటూ గట్టి ప్రయత్నంతో బైటపడ్డాడు.

అంతే!

రాణా చేసిన ఆ కదలికవల్ల కారు మరో రెండు అడుగుల క్రిందికి గభాలున జారింది.

గుండెలు దడదడలాడాయి రాణాకి.

కారు ఒక్క ఉదుటున క్రిందికి జారడంవల్ల మట్టి పెళ్ళల వర్షం కురుస్తోంది.

ఆ కాసంతో కొప్పసాగాడు రాణా.

ఈసారి, జాగ్రత్తగా కారు బాక్ సీట్లోకి అడుగు పెట్టే ప్రయత్నం చేశాడు రాణా.

ఆ ప్రయత్నంలో మళ్ళీ కారు కదలడంతో, స్థంభించి పోయాడు.

కాని, ఈసారి అది కొంచెంగా మాత్రమే జారింది. పొజిషన్ జాగ్రత్తగా చూసుకుంటూ పదిక్షణాలు బరువుగా గడిపాడు.

తర్వాత దడలాడే గుండెలతో అతను మెల్లగా వెనక సీట్లో కుడివైపు తలుపువద్దకు చేరుకున్నాడు.

వంకరటింకరగా విడిపోయిన నేల అంచుకీ, దాన్ని అనుకున్న కారు అంచుకీ మధ్య బైటకు వెళ్ళడాన్కి

కొద్దిపాటి ఖాళీ ఉన్నట్టు గ్రహించాడు రాణా. తను బైటపడాలి! కార్లో ఉంటే యెప్పటికైనా ప్రమాదమే! జారుతున్న పట్టిపెళ్ళలు, తెరిచివున్న తలుపు అద్దంలోంచి లోపలికి పడి, బాలన్స్‌గా వున్న వాహనం బరువును పెంచాయి.

ఊపిరి బిగబట్టి, అతి కష్టంమీద తలుపులోంచి బైటికి వచ్చి, వంకరటింకరగా చీలిన మట్టి గోడను పట్టుకున్నాడు రాణా!

చేతులకి ఏదో బలమైన ఆధారమే దొరికింది.

చీకట్లో అదేంటో కనబడ్డం లేదు....

ఏ క్షణంలోనైనా అంచులు వదులై పోయి కాలు కూలి పోయేలా వుంది.

ఇసుకదుమ్ము మెల్లగా మాయమైన తర్వాత భయంగా అటూ ఇటూ చూసాడు రాణా, గోడ మధ్యభాగంలో వ్రేలాడుతూ.

నేల ఊపరిభాగం సుమారు రెండువందల అడుగులు ఉంటుందని అంచనా వేశాడు. కళ్ళు చిట్లించి అగాధంలోకి చూశాడు రాణా. అతని వెన్నెముక జలదరించింది!

అడుగుభాగం అంతులేనట్టు కనబడుతోంది....అంధకారంలో........క్రిందికి కొన్ని మైళ్ళు లోతుగా ఉన్నట్లు....

గోడ మళ్ళీ చిన్నగా కదిలినట్లయింది....

రాణా అదిరిపోయాడు!

డెస్పరేట్‌గా చేతికి అందిన ఆధారాన్ని బిగించి పట్టుకున్నాడు.

ఎంతసేపు యిలా వేలాడ్డం?

మృత్యువుకూ—ప్రాణానికీ మధ్య?

కొద్ది సేపట్లో తన చేతుల్లోని శక్తి సన్నగిల్లుతుంది....
అప్పుడు రబ్బరుబొమ్మలా తను అగాధంలోకి కూలిపోతాడు,
లోతుల్లోకి....అంతు తెలియని లోతుల్లోకి....

ముచ్చెమటలు పడుతున్నాయి రాణాకి.

సరిగ్గా అప్పుడే వినబడింది—కెవ్వున ఆర్తనాదం!

ఉలిక్కిపడి తల వెనక్కి తిప్పాడు రాణా, బలవంతంగా కళ్ళు తెరుస్తూ.

అరకాంతిలో కనబడుతోంది ఓ ఆకారం!

ఓ చిన్న ఆకారం—అవతలివైపు గోడమీద సుమారు పదిహేను అడుగుల ఎత్తులో వ్రేలాడుతూ!

ఆ ఆకారం యింతకుముందు తను గోడమీద చూసిన యిద్దరు పసివాళ్ళలో ఒకరని గ్రహించి షాక్ అయ్యాడు రాణా.

పసిపాప!

ఇంతకుముందు ఆమెను పట్టుకుని నడిచిన పిల్లాడి జాడ కనబడలేదు రాణాకి....

పాప, దీనంగా

శక్తిహీనంగా

రోదిస్తోంది.

తొందరగా ఆమెను చేరుకోవాలి!

ఏ మాత్రం ఆలస్యం అయినా ఆ పసిపాప శక్తి సన్నగిల్లి లోతైన పగులులోకి కూలిపోతుందని తెలుసు రాణాకి.

ఆమెను గట్టిగా పిల్చాడు.

అతని పిలుపు ఆమెకు వినబడినట్లులేదు.

ఇంకా—బలహీనంగా—రోదిస్తూనే వుంది. రాణా చుట్టూ పరికించాడు, రెండుగోడల మధ్యవున్న పగులును ఎలా క్రాస్ చేయాలా? అని ఆలోచిస్తూ. (ఇంకావుంది)

## "ముఖచిత్ర వాఖ్యాల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 8/-లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ ఇంటిదగ్గర అంద జేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగడం సరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 90/-లు ముందుగా పంపవచ్చును.



# క్రైమ్‌లో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

## గేమ్??

పూర్ణా మార్కెట్‌లో సిటీ బస్ దిగేను కూరగాయల బేగ్ పట్టుకుని.

భుజంమీద చెయ్యిపడిందెవరిదో. వెనక్కి తిరిగి చూసేను. దృఢమైన శరీరం, ఖరీదైన దుస్తులు, కూలింగ్ గ్లాసెస్, ఎవరో అపరిచితుడు.

"నన్ను గుర్తుపట్టలేదా?" అడిగేడతను.

అతని గొంతు విన్నా గుర్తురాలేదు నాకు. ఎవరు చెప్మా ఇతను?

"చదువుకునే రోజుల్లో మనం...."

గుర్తుకొచ్చింది నాకు. చదువుకునే రోజుల్లో నాకు మంచి రూమ్మేట్, క్లాస్‌మేట్ ఒకే ఒక వ్యక్తి. శ్రీహరా ఇతను. భాషలోను, వేషంలోను ఎంత మార్పు!

"అరే శ్రీహరీ! నువ్వా! బాగా మారిపోయావే!" అన్నాను.

"మరి నువ్వు మారలేదూ?" అన్నాడు శ్రీహరి భుజంమీద చేయివేస్తూ.

"ఏం చేస్తున్నా విప్పుడు?" ఫార్మాలిటీగా అడిగేను.

"నేవీలో పనిచేస్తున్నాను" శ్రీహరి మాటల్లో కొంచెం గర్వం కనిపించింది. ఏదో పెద్ద ఉద్యోగంలోనే వుండి వుంటాడు.

"నేవీలో నీ పనేమిటి?" అడిగేను.

"కెప్టెన్ దగ్గర అసిస్టెంట్‌గా వుంటున్నాను. నెలకి వెయ్యిరూపాయలపైన జీతం. అంతా అక్కడే. రోజుకో వూరు. రోజుకో దేశం. యిప్పటికి అన్ని దేశాలూ తిరిగేను. నెలరోజులు శెలవుపెట్టి పుట్టిన వూరు చూసిపోదామని వచ్చేను. పద, అలా హోటల్‌లో కాఫీ త్రాగుతూ మాట్లాడుకుందాం" అంటూ మోతీ మహల్‌కేసి నడిపించేడు.

మౌనంగా శ్రీహరిని అనుసరించేను.

"ఏం తీసుకుంటావ్?" అనడిగేడు లోపల కూర్చున్నాక.

"నాకేం వద్దు. కాఫీ చాలు."

శ్రీహరి బలవంతంచేసి స్వీటు, ఇడ్లీ, దోసె తినిపించేడు. టిఫిన్ పూర్తయ్యేక హార్లిక్స్ చెప్పేడు.

వెయిటర్ బిల్లు తెచ్చిపెట్టేడు శ్రీహరి బిల్లు అందుకోబోయేడు. అంతకన్నా వేగంగా బిల్లు అందుకుని, కౌంటరు వేపు నడిచేన్నేను. బిల్లు చెల్లించి బయట పడ్డాం.

"ఈ రోజు మా యింట్లో ఉండరాదూ?" అన్నాను.

"సారీ బ్రదర్! నేను శ్రీహరిని కాను. నా కడుపు నింపుకోవడానికి ఈ గేమ్ ఆడుతుంటాను. అయామ్ ఎక్స్ట్రీమ్లీ సారీ ...." అనేసి అతను చరచరా వెళ్ళిపోయేడు. నేను విస్తుపోయిచూడసాగాను. —అంధవరపు మల్లిబాబు

## ధర్మ సందేహం-?

ఒక అబ్బాయి ఆస్పత్రినుండి తిరిగి వస్తూ ఇరవై ఏండ్ల అక్కయ్యతో—

"అక్కయ్యా, నీకు మాత్రం నడ్డిలో ఇంజక్షన్ యిస్తాడు, నాకు మాత్రం రోజూ జబ్బలో ఇంజక్షన్ యిచ్చి చంపుతున్నాడెందుకు ఆ డాక్టరు?"

—దామెర్లకృష్ణమూర్తి, నెల్లూరు.

